# భారతి

జూలై 1962



వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# విషయానుక్రమణిక

## జూలై 1962


| | | |
|---|---|---|
| వేదనా వాసుదేవము | శ్రీ నాయని సుబ్బారావు | 1 |
| రవీంద్రుని కథాకథన మార్మికత | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు, శ్రీ కల్లూరి బసవేశ్వరరావు | 3 |
| నాటకోత్సవము | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 17 |
| కాళహస్తిమాహాత్మ్య పాఠపరామర్శము | శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి | 25 |
| సౌందర్యశిఖ | శ్రీ మాదిరాజు రంగారావు | 33 |
| స్థలపురాణములలో వస్త్వైక్యము | శ్రీ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు | 35 |
| దోదమ్మ | శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి | 43 |
| అమరావతీ శిల్పాలలో స్త్రీల అలంకారాలు | శ్రీమతి యర్రంసెట్టి పద్మావతి | 47 |
| నేను | తెనుఁగులెంక | 51 |
| మాలపల్లి | శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ నాటకీకరణం : శ్రీ గోపీచంద్ | 53 |
| మహాత్తర పరివర్తనము V | శ్రీ జాన్ స్ట్రాచీ | 57 |
| తెలివిమాలిన మనసు | "స్ఫూర్తి శ్రీ" | 60 |
| విశ్వంగారి నాల్గు అనువాద గ్రంథాలు | శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి | 61 |
| పుత్రవతి | మరాఠీ మూలం: శ్రీ మహాదేవశాస్త్రి జోషి; అనువాదం: శ్రీ జగన్నాథ్ | 65 |
| ఉత్తమసాహిత్యం ఎప్పుడు వచ్చింది? | శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి | 74 |
| స్వాతంత్ర్యానంతర సాహిత్యం | శ్రీ పి. గణపతిశాస్త్రి | 75 |
| అజ్ఞాతవాసం | శ్రీ సి. నారాయణరెడ్డి | 78 |
| కలగూరగంప | | 81 |
| గ్రంథవిమర్శనము | | 89 |
| వార్తలు | | 98 |


[మంచి నవల రానందున ఈ సంచికలో అనుకున్న ప్రకారం ఒక నవలను ప్రకటించలేకపోయినందుకు విచారిస్తున్నాము. —సం.]

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

కనబడు నెల్లవాని గతకాలము నందెపుడో యొకప్డు కాం
చినగతి దర్శనమ్ము వికసించియు విస్మృతి దర్శ తామసీ
వినివృత్తమై ముడుంగు నొకవెంటనె విశ్వవిలీన! యేమి ద
ర్శనమిది నీదు దర్శయిత్రు జాలములో సుడివోవు మిణ్గురై

నీ వున్నావు గదయ్య! విశ్వజగతీ నిర్వాహకానంద ధా
రావిర్భూత సమస్త వస్తు వ్యాదయాధ్యక్షుండవై మన్మనో
భావమ్మందున నైకరూపకలనా బంహిష్ఠ మీ సృష్టియున్
నీవైతోచమి కేమికారణము తండ్రీ! వాసుదేవ ప్రభూ!

కూటస్థుండవిదేమి యాగడము నీకున్ భ్రాంతిమద్రూపతా
పాటీరమ్ము లనంతమార్గములుగా పండించి యొండించు న
య్యాటల్ మానవు నాదు జీవనము వైయర్థ్యమ్ముపాలై భవ
త్కూట ప్రక్రియలందు చిక్కుకొని దిక్కుగా మొక్కులే కార్వగ।

చీకటి రేయి నింగి విరజిమ్ము ననంతములైన తారకల్
వేకువ తెల్విప్రామి యొక వేకువ చుక్కగ నిల్చి యంతలో
నీ కుడికంటి లేతళుకు నిగ్గుల లీనము నొందునట్లుగా .
నాకు భవద్విరూప ధరణమ్ముల నిక్కపు తెల్వి నీయవే

బొమముడిలోన కర్కశత పోగులు పోగులు పోసికొన్న వా
ని మనసు లోతులెల్ల హావణించియు మెత్తదనమ్ము హాస్యముల్
గుమిగొను మోము వాని నెరగుండియ కర్కశతా కరాళమై
యమరు భవద్విభావముల కన్వయమేగతి చిద్రసోదయా!

## భా ర తి

వికటోజ్జృంభిత కుంతకర్కశ సటావేల్లచ్ఛటాభీలమై
చకితారణ్య మృగావళీ ప్రళయగర్జా ఘూర్ణితాశా వివ
ర్తకమై పేర్చు మృగేంద్రు నాత్మయు మహాత్మా! నీవమై తత్కనీ
నికలం దార్ద్రిత సంతరించుకొనవా నిర్నిద్రసర్గ క్రియా!

పెండయు దుమ్ము కొట్టుకొని వేసగి కాకల కాయకష్టమే
పండుగమైన బాల యొకపట్టున నవ్విన నవ్వుల్లోన బ్ర
హ్మాండము లన్నియుఁ కెరలి యాడినయట్లయి నీ ప్రమోదవ
త్తాండవ మెన్ని శోభన పథమ్ములు పోవునురా! మనోహరా!

ఈ రూపమ్ముల సంతలోపడి త్వదీయేచ్ఛా వికారమ్ము నా
నా రూపాంతరభూమి వీవెవరవన్నా! సర్వసృష్ట్యంతరా
కారాధార సుసూక్ష్మతా ప్రణిహితాగమ్యావ్యయాకార! వే
సారు న్నామతి నీదుగుర్తు తెలియన్ శక్యమ్ముగా కేమియుఁ

చిత్తమువోయి నాదు సమజీవనమిట్లసమాపక్రియా
యత్తమొనర్చి పూర్ణపరమార్థము నెందును పొందరాని యా
వృత్తుల సాగదీసి దాక వేడుక నొక్కసమాపక్రియా
విత్తములేని శబ్దగతవేధవుపో! జగదేక పండితా!

# రవీంద్రుని కథాకథన మార్మికత

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు          శ్రీ కల్లూరి బసవేశ్వరరావు

రవీంద్రనాథ ఠాగూరు కవి, తత్త్వవేత్త, విద్యావేత్త, గేయకారుడు, గాయకుడు, చిత్రలేఖకుడు. ''గీతాంజలి'' కవిగా ఆయన కీర్తిని హరిదంతాలవఱకు గాన మొనర్చినది. తత్త్వవేత్తగా ''సాధన'' ఆయన జీవనతత్త్వమును ఆవిష్కరించినది. ''శాంతినికేతనము'' రవీంద్రుని విద్యావేత్తగా విశ్వమునకు పరిచయము చేసినది. రవీంద్రుడు వంగ భాషలో రెండువేలయ్యైదు వందల గేయములు రచించెను. ఆ గేయములకు ఆయనయే సంగీత ఫణితులను సమకూర్చెడివాడు. ఆ సంగీతపు బాణీలు వాణీవీణానిక్వాణములై రాణకెక్కి ''రవీంద్రసంగీత్'' పేరుతో ప్రసిద్ధి గాంచినవి. ''రవీంద్ర సంగీత'' మందు పంకజమల్లిక్ పండితుడై దానిని ప్రచారము చేయుచున్నాడు. అది అనుదినము కలకత్తా—ఆకాశవాణి కేంద్రమునుండి ప్రసారితమై వంగరాష్ట్ర ప్రజలను పరితోషవీచికలలో ఓలలాడించుచున్నది. రవీంద్రుడు గీసిన గీతయే మహాచిత్రమైనది. అట్టి చిత్రములు ఆయన కళానైపుణ్యమును సహస్రధా చాటుచున్నవి. పైన చెప్పిన ప్రక్రియలకే రవీంద్రుని సృజనాత్మకశక్తి పరిమితమై లేదు. ఆయన కమనీయ కావ్యములను పోలిన కథలను సృజించినాడు. రవీంద్రుడు కథకచక్రవర్తి. ''క్షుదిత పాషాణ్'' ''ఘాటి'' ''కాబూలీవాలా'' మున్నగు కథలు నాటికి నేటికి అసదృశములై కళాఖండములుగా, సాహితీ కలకండములుగా వాఙ్మయోపాసకులకు అవశ్య పఠనీయములై అలరారుచున్నవి. ఆనందము కల్గించుచున్నవి.

రవీంద్రుడు బొడ్డున మాణిక్యముతో పుట్టినాడు. పూవులలో పెరిగినాడు. కాని బాల్యదశలో ఆయనకు కావలసినంత స్వేచ్ఛ కఱవయినది. ఆయనతండ్రి దేవేంద్రనాథ ఠాగూర్. కన్నబిడ్డలను కఠోర నియమ శృంఖలములతో కట్టివైచెడివాడు. పిల్లలకు గడపదాట వీలుండెడిది కాదు. అందువలన రవీంద్రుడు ఎల్లప్పుడు ఇంటిలో తల్లితో దాసదాసీజనముతో కూడి మాడి యుండెడివాడు. రవీంద్రుడు చిన్ననాటి ముచ్చటలను గూర్చి ''నా బాల్య కాలము'' అను నొక వ్యాసము వ్రాసినాడు. ఆయనకు కథ లెంతగా ఆహ్లాదకరములై యుండెడివో దానిలో వివరించినాడు. ఒక్కొక్కసారి ఏమియు పాలుపోవక సేవకులతో కాలక్షేపము చేసెడివాడు. అప్పుడు సేవకు లెన్నో కథలు చెప్పెడివారు. బందిపోటు దొంగలనుగూర్చి వారి తెంపరితనమునుగూర్చి కథలు విని ఆయన పరవశించెడివాడు. అప్పుడే రామాయణము పారాయణము చేయుట కద్దు. ఒక్కొకనాడు రవీంద్రునిమాతృమూర్తి చిత్రవిచిత్ర కథలు ఆయనకు చెప్పెడిది. ఆ కథలు శౌర్యప్రధానములై యుండెడివి. అవి మన కాశీమజిలీ కథలను పోలి యుండెడివి. వానిని విని రవీంద్రుడు ఎంతగానో మురిసిపోయెడివాడు. ఆవేశపడెడివాడు. కైలాస్ అను గుమాస్తా కూడా రవీంద్రునకు రమణీయ కథలు చెప్పెడివాడు. ఈ విధముగా రవీంద్రుని బాల్యమంతయు కథలు వినుటలో విననవానిని మననము చేసికొనుటలో, ఊహాగానముతో ఉల్లాసమందుటలో గడచిపోయినది. కొన్నాళ్లకు రవీంద్రుడే కథలు చెప్పుట నేర్చుకొన్నాడు. తాను విన్న కథలకు తన యూహలను జోడించి క్రొత్తకతలు కూర్చి ఆయన ఆత్మానందము పొందెడివాడు.

రవీంద్రుడు రచించిన కొన్ని కమనీయకథలకు ఆయన బాల్యానుభవములే ఆలంబనములు. రవీంద్రుడు చిన్ననాడు చదువుకొను గదియందు ఒక అస్థిపంజరము వ్రేలాడుచుండెడిది. దానివలన ఆయన మానవశరీరనిర్మాణమును అవగాహన చేసికొన్నాడు. గాలి వీచినప్పుడు ఎముకల రాపిళ్లవలన ఆ అస్థిపంజరము విచిత్రధ్వనులు వెలార్చెడిది. ఈ అల్పానుభవమును ఆశ్రయించి రవీంద్రుడు తర్వాత ''కంకాళ్'' అను అద్భుతకథను కల్పించినాడు. వ్యాపారార్థము విచ్చేసిన కాబూలీవాలాలను చూచి రవీంద్రుడు ఆశ్చర్యపడెడివాడు. ఆ ఆశ్చర్యము రవీంద్రునిహృదయములో చెదరని ముద్రవైచినది. తత్ఫలితముగా ఆయన లేఖిని ''కాబూలీవాలా'' యను రసవత్కథను అందిచ్చినది. ఒకసారి రవీంద్రుడు తన సోదరుని చూచుటకు అహమ్మదాబాదు అరిగినాడు. అప్పుడాయన వయస్సు పదియేడేండ్లు. చరిత్రప్రసిద్ధి గాంచిన అహమ్మదాబాదులో రవీంద్రుడు కొన్నాళ్లున్నాడు. అచట ఉన్న కోటలను, పురాతన శిథిల నిర్మాణములను చూచినాడు. ఈ అనుభవము నుండి ''క్షుదిత పాషాణ్'' అను కథ ఆవిర్భవించినది. అట్టికథ ఇతర భారతీయ వాఙ్మయములలో నున్నదని నికరముగా చెప్పలేము.

రవీంద్రనాథ ఠాగూరు ప్రప్రథమముగా రచించిన కథ ''భికారిణి''. ఈ కథ 1877 లో ప్రకటింపబడినది. ఆ నాటి కాయన షోడశవర్షప్రాయుడు. అప్పటినుండి 1940 సం. వరకు రవీంద్రుడు కథలు రచించుచున్నాడు. మొత్తము ఆయన ఎనుబదినాల్గు కథలను సృష్టించినాడు. ఆ కథలన్నియు ''గల్పగుచ్ఛ'' అను పేరుతో వంగభాషయందు మూడు సాయలుగా ప్రకటింపబడినవి. అవసానకాలము సమీపించిననాడు రవీంద్రుడు కొన్ని కథలు రచింపకపోలేదు. కాని వానిని కథ లనుటకంటె కథాప్రణాళిక లనుటయే యుక్తము.

"అనగా అనగా ఒక మేకపిల్ల కలదు. ఒకనాడు అది ఏడ్చుచు బ్రహ్మదగ్గఱికు వెళ్లినది. బ్రహ్మ "ఎందుల కేడ్చుచున్నదాన" వని దానిని ప్రశ్నించెను. "స్వామీ ! అందరు తినునట్లుగా నన్ను నీవేల సృష్టించితి" వని మేకపిల్ల విశ్వస్రష్టను ఎదురడిగినది. "బిడ్డా ! నన్నేమి చేయమందువు ? నిన్ను చూచుచుండగా నాకుకూడ మ్రింగవలయునని బుద్ధి పుట్టుచున్న" దని అన్నాడు బ్రహ్మ. ఈ కథ రవీంద్రునకెంతో యిష్టమని ఒక విమర్శకుడు వ్రాసినాడు. ఎందువలన ? మేకపిల్లవలె జీవనసంగ్రామములో బలియై పోవుచున్న "సన్న జీవాల పట్ల" ఆయనకు అపారమయిన అనురాగ మున్నది. సానుభూతి యున్నది. బ్రతుకు బరువుతో క్రుంగిపోయి, కూలబడి చిదికి చిద్రుపలగుచున్న మానవులలో మాననీయులను, దారిద్ర్యబాధా సంతప్తమై మోడువాఱిన గుండెలలో ప్రేమను దర్శించిన మహాద్రష్ట రవీంద్రుడు. అందువలననే ఆయన కథాప్రపంచము అతివిశాలముగా నున్నది. ప్రపంచమహాగ్రంథమునుండి వివిధవిషయములను గ్రహించి కథలల్లినవా డాయన. జమీందార్లు, జాగీర్దార్లు, పేదసాదులు, అదృష్టవంతులు, అదృష్టహీనులు, కవులు, గాయకులు, నటీనటులు, పండితులు, పామరులు, పిన్నలు, పెద్దలు, పడుచువాండ్రు—ఒక్కరేమిటి—ఈవిధముగా ఎందరో మన కాయన కథలలో కన్పడెదరు. రవీంద్రుడు విశ్వవిశాల రంగములో భిన్న సన్నివేశములను, విభిన్న పాత్రలను, పరిపరివిధ మనస్తత్త్వములను పరిశీలించినాడు. సమస్తమును ఆయనకు దర్శనయోగ్యమయినది. విశ్వములో ఆయనకు ఉచ్చ నీచములు కన్పింపలేదు. అసంఖ్యాక ఘట్టములలో ఎదురుపడు అభాగ్యసమూహముపట్ల ఆయనకు ఆదర మున్నది. వారి జీవనమందు అట్టడుగు పట్టులలో కన్పట్టు తత్త్వమును రవీంద్రుడు దర్శింపగలడు. వారి హృదయాంతరాళములను పరిశోధింపగల డాయన. ఆ విధముగా పరిశీలించి పరిశోధించు ఉత్తమాన్వేషకునకు జీవితము అల్పముగా కన్పింపదు. ఏ సంఘటనము సాధారణము గాదు. రవీంద్రునితో ఱాలు మాట్లాడును. అస్థిపంజరములు గోష్ఠి చేయును. ఆయనతో చిన్నపిల్లలు ఆటలాడుదురు. మూగవారు తమ తలపులను ఆయనకు తెలియజేయుదురు. అందువలననే రవీంద్రుని కథలలో విషయవైవిధ్యము విస్తారముగా కన్పించుచున్నది.

## 2

నవీన సాహిత్యప్రక్రియలలో కథానిక ప్రధానమైనది, బహుళప్రచారము పొందుచున్నదియును. ఈ నాడెందరో ప్రసిద్ధకథకు లున్నారు. ప్రతిదినము పత్రికాద్వారమున ఎన్నో కథలు ప్రచురింపబడుచున్నవి. అశేష ప్రజానీకము వానిని చదివి ఆనందించుచున్నది. కథానిక ఈవిధముగా అతివ్యాప్తి పొందుటకు కారణములు నవీనయుగ జీవనమందే ఇమిడియున్నవి. మానవజీవితము నానాడు ప్రచండ వేగముతో, పలు తెరగుల పోకడలతో ప్రయాణించుచున్నది. తత్ఫలితముగా మానవుడు సుదీర్ఘకథలను, పెద్ద నవలలను, బృహత్కావ్యములను పఠించుట యిచ్ఛగించుటలేదు. దానికి తగిన ఓపిక, విడుమరయును అతనికి లేవు. ఈ యుగస్థితిగతులే అచిరకాలములో కథానికలకు అనల్ప ప్రచారము చేకూర్చినవి.

చేయి తిరిగినవారికథలను పరిశీలించినచో మనకు ఉత్తమకథానికల లక్షణములు కొంతకుకొంత తెలియును. కథానిక నవలలకంటె భిన్నమయినది. నవల యనగా పెద్దకథ యనియు కథానిక యనగా చిన్న కథ యనియు అనుకొనుట నెఱపొరబాటు. ఏ మూడు వందల పుటల నవలగానో వ్రాయదగిన కథావస్తువును ముప్పది పుటలకు కుదించి, బిగించినంత మాత్రమున అది కథానిక అనిపించుకొనదు. నవల కథానికకంటె విశాలమైనది. నవలలో అనేకపాత్రలు తారసిల్లును. నానావిధ ఘట్టములు కన్పించును. నైక మనస్తత్త్వవర్ణనములు చూపట్టును. 'వస్త్వైక్య' (unity of plot) మొకటే నవలకు ప్రబల ప్రధానలక్షణముగాదు. పరిధిలో, ప్రణాళికలో, నిర్మాణపద్ధతిలో, పరమార్థములో కథానికకు, నవలకు పొత్తు పొందికలు కానరావు. కథానిక కమనీయాకృతిగాంచిన అసామాన్య కౌశలము. పరాకాష్ఠ నందిన కళ. మంచి కథలు లిఖించువారు మహోత్తమమైన నవలలు సృష్టింతురని చెప్పలేము. టాల్స్టాయ్ ఉత్తమ కథలనే కాక ఉత్తమములయిన నవలలు కూడ వ్రాయగలిగినాడు. ప్రపంచములో అట్టివారు చాలా అరుదుగా నుందురు. ఏ కొలదిమందియో యుందురు. ఆ కొలదిమందిలో రవీంద్రు డొకడు. రవీంద్రుడు మౌలికములయిన నవలలనే కాక మణి సమానములయిన కథానికలు కల్పించినాడు. కాని కథారచనలో కన్పించుచున్నంతగా రవీంద్రుని ప్రతిభ నవలలో గూడ నిండియున్నదనుట కష్టము. ఆయన నవలలకంటె కథలే మహో కళాఖండములని విమర్శకులు తీర్పు సెప్పియున్నారు.

కథారచనకు ప్రధానమయినసమస్య ఇతివృత్తమును ఎన్నుకొనుట. ఇతివృత్తము ఈ చాలున నడువవలయునని గాని, అందలి నాయికానాయకుల లక్షణములు ఇట్లుండవలయునని గాని సూత్రములు చెప్పుట సాధ్యముగాదు. జీవనమునకు సంబంధించిన ఏ విషయమయినను కథగా రూపొందవచ్చును. ఒక సాంఘికసమస్య, ఒక విశేషమానసిక స్థితి, ఒక ప్రత్యేక సంఘటనము, ఒక విచిత్రానుభవము—ఈ విధముగా ఏదయినను కథానికలో చోటు చేసికొనును. కాని కథారచయిత తాను స్వీకరించిన విషయమును కథామితి యందే నిబద్ధముచేయవలె. ప్రఖ్యాత విమర్శకుడు హడ్సన్ ఈవిధముగా చెప్పినాడు.

"The subject of a story must be one that can be adequately and effectively developed within the prescribed limits. On

this point the reader's own feeling of satisfaction or dissatisfaction will provide a sufficient test."

(An Introduction to the study of Literature Page 338.)

కథకు మితి యనునది యుండునా? యను ప్రశ్న యిప్పుడు జనింపవచ్చును. మితి యున్నదనియే సమాధానము. ఈ సమాధానము కథను నిర్వచించుటలో కన్పించును. హడ్సన్ మహాశయుడు కథను ఈవిధముగా నిర్వచించినాడు.

"For working purpose we need a rough definition to start with, and that suggested by Edgar Allan Poe will do enough: a short story is a prose narrative "requiring from half an hour to one or two hours in its perusal". Putting the same idea into different phrasaeology, we may say that a short story is a story that can be read at a single sitting."

(An Introduction to the study of Literature. Page 337).

కథానికలో ఇతివృత్త మేదయినప్పటికీ, కథా నిర్మాణము సర్వసాధారణముగా పై నియమములను అనుసరించుచు నుండును. ఇతివృత్తమును అహేతుకముగా పొడిగించుట, వర్ణనీయ విషయములు వదలుట జరుగరాదు. కథ పరిమాణములో పెద్దదా ? చిన్నదా ? అనునది ముఖ్యముగాదు. విషయోన్మీలనము, సంఘటనాసంవిధానము చిక్కగా చెలువు కలిగి యుండవలయును. దీనినే మనము అంగాంగి భావ సంబంధముగా పేర్కొనవచ్చును. అంగికి, అంగములకున్న అవినాభావసంబంధమే కథ యందలి ఇతివృత్తమునకు, వర్ణిత ఘట్టములకు ఉండవలయును. అనగా కథలో బంధ మేవిధముగను సడలిపోరాదు. అపుడు కాని కథ బిగింపు కలిగి పాఠకులను ఆకట్టదు. కథారచనలో జిగిబిగి యున్నదా యనుటకు చదువరుల అనుభూతియే సాక్షి.

కథారచనములో రెండవ ప్రధానసమస్య "ఐక్యము"ను కాపాడుట. ఐక్యమనగా వస్త్వైక్యము, భావైక్యము, క్రియైక్యము. వీనిని ఆంగ్లభాషలో "Unity of Subject, of purpose and of action" అందురు. ఈ యైక్యత్రయమును పాటించినకథలో అంగాంగి భావ సంబంధము ఆవిర్భవించును. ఆవిధముగా కథలను వ్రాయుట అందఱికు సాధ్యము గాదు. ఈ యైక్యత్రయము గలిగిన కథలు శిల్పకళాఖండములవలె అజరామరములై పాఠకులలో అనిర్వచనీయానందానుభూతిని కలిగించును. అట్టికథలు అజంతా వర్ణచిత్రములవలె, నాగార్జునుని కొండ శిల్పాలంకృత శిలా ఫలకములవలె శాశ్వతములు. ఒకమహాశిల్పి ఏవిధముగా కమనీయ కళాఖండమును ముందుగా భావనచేసి, ఆ భావనకు అతిలోక కౌశల్యమును మేళవించి, మహాశిలలను వెన్నపు టుండలవలె తొలిచి అద్భుతసృష్టి చేయుచున్నాడో, అట్లే కథారచయితయు రసమయభావములను భావించి, వానికి అక్షరమయిన అక్షరరమ్యతను ఆపాదించుచున్నాడు. ఈ దృక్పథముతో పరిశీలించినచో కథాకల్పన మెంత కష్టతమమైనదో అందుల కెంత భావ శబలత, నిర్మాణదక్షత, అభ్యాసము కావలయునో స్పష్టమగును. ఒక కథయొక్క మంచి సెబ్బరలను కొలుచుటకు మనము గుర్తుపెట్టుకొనవలసిన ప్రమాణములను ఈ క్రింది విధముగా వింగడింపవచ్చును.

1. కథ స్వతంత్రమై నవ్యభావస్ఫోరకముగా నుండవలయును. అది రచయిత సృజనాత్మక శక్తిని చాటవలయును. కథావస్తువు ప్రాబడినదై, కథకుని భావ దారిద్ర్యమునకు తార్కాణ కారాదు. ఇతివృత్తము అచుంబిత మైనచో పాఠకుల ప్రశంసలను పొందును. (The Subject of the short story must be original).

2. ఇతవృత్తము కథా పరిధిని దాటరాదు. నవలకు తగిన కథావస్తువును కథానికగా మలచినచో అది పాఠకులకు రసానందము కల్గింపదు. (The subject of the story must be effectively developed within the prescribed limits).

3. కథానిర్మాణములో ఐక్యత్రయము నియతముగా పాటింపబడవలయును. అప్పుడు గాని అది కమనీయ కళాఖండము కాదు. హడ్సన్ మహాశయుడు చెప్పిన మాటలు వినుడు :

"Singleness of aim and singleness of effect are the two great canons by which we have to try the value of a short story as a piece of art."

(An Introduction to the study of Literature Page. 340.)

వివిధ రచయితలు త్రొక్కిన త్రోవలను బట్టి కథలు మూడురకములుగా నుండునని కొందఱు విమర్శకులు వక్కాణించియున్నారు. 1. కథా ప్రధానమయిన కథలు. 2. పాత్ర ప్రధానమయిన కథలు. ఇట్టి కథలలో అద్భుతపాత్ర సృష్టియే అగ్రగణ్యముగా నుండును. తదనుగుణముగా సంఘటనములు సృష్టింపబడును. 3. విశేషవాతావరణ ప్రధాన కథలు. వీనిలో కథగాని, పాత్ర సృష్టిగాని గౌణము. కథకు డూహించిన ఒక ప్రత్యేక వాతావరణము ఇట్టి కథలలో ప్రధానమై

యుండును. సౌలభ్యముకొఱకు కథలను ఈ మూడు తీరులుగా విభజించినప్పటికి విశ్వవిఖ్యాత కథకులకథలకు ఈ ప్రమాణ త్రయమును సమన్వయించుట దుస్సాధ్యము. కథ, పాత్రలు, తదుచితమయిన వాతావరణము—ఈ మూటిని కలిపి ముప్పే టగా కథలల్లిన ప్రతిభావంతు లెందరో యున్నారు. వారిలో టాల్‌స్టాయ్, గోర్కీ, చెకోవ్, గోగోల్, మపాసా, హాథారన్, ఓహెన్రీ మున్నగువారు ప్రాతఃసంస్మరణీయులు. వారి కోవకు చెందినవాడే రవీంద్రుడు. ఆ మహాద్రష్టల కథల వలెనే రవీంద్రుని కథలుగూడ దిగంత విశ్రుతకీర్తిని నాచి కొన్నవి.

మేము వంగభాష నేర్చినవారముగాము. ఆంగ్లాను వాదముల రూపములోనే మేము రవీంద్రుని కథా కృతులను పరిశీలించితిమి. మాక్మిలన్ కంపెనీవారు ప్రకటించిన రెండు కథాసంపుటములను (Hungry stones and other stories; Mashi and other stories) "విశ్వభారతి" వారు ప్రకటించిన ఒక కథాసంపుటమును (The Runaway and other stories) మాత్రమే మేము సమ గ్రముగా పఠించితిమి. "విశ్వభారతి" యధికారులు కోరిన వెంటనే వంగభాష యందలి కథల పేరులు తెల్పిరి. ఆపేరు లిందు చేర్చితిమి.

## 3

కొందరు కథకులు కథాసంవిధానములో అద్భుత రస మును చక్కగా పోషింతురు. కథాగమనములో పాఠకు డూహింపని ఒక సంఘటనమును సృష్టించి, వాని యూహ కంటె వేరయిన పోకడలో కథాంతమును మార్చి ఉత్కంఠను రేకెత్తింతురు. ఆశ్చర్యమును కల్గించి గిలిగింత వెట్టుదురు. ఇట్టి ఆశ్చర్యప్రధానమయిన కథలను రవీంద్రుడు గూడ వ్రాయకపోలేదు. ఉదాహరణకు "శుభదృష్టి" (The Auspicious vision) అను కథను పరిశీలిం తము. కాంతిచంద్రుడు నదీతీరమున ఒక లావణ్యరాశిని చూచును. చూచి సొక్కి సోలిపోవును. ఆ బాలిక యింటికి వెళ్ళును. అప్పుడు ఇంటనున్నవారు "సుధా !" యని పిల్తురు. వెంటనే ఆ బాలిక యింటిలోనికి వెళ్ళును. కాంతి చంద్రు డా గృహస్థునితో మాటలాడి "సుధ" ను వివాహ మాడుదునని, ఆమెను చూడ నవసరము లేదని చెప్పును. పెండ్లి జరిగినది. కాని కాంతిచంద్రు డెవరిని "సుధ" యని యింటిలోనివారు పిల్చినపుడు వెళ్లిన బాలిక కాంతిచంద్రుడు వివాహమాడిన బాలిక కాదు. తా నెవరిని "సుధ" గా భావించెనో ఆమె మూగపిల్లయని, చెవిటిపిల్ల యని కాంతిచంద్రుడు తర్వాత తెలిసికొనును. "సుధా !" యను పిల్పు వినవడినప్పుడే మూగపిల్ల యిల్లుజొచ్చుట కాకతాళీయముగా ఘటిల్లినది. ఈ కథలో వచ్చిన వంపులవలన కాంతిచంద్రుడే కాక పాఠ కులు గూడ ఆశ్చర్యచకితు లగుదురు. కాని రవీంద్రుని ప్రతిభ యిట్టి కథలలో మాత్రము గోచరింపదు. "విచా రక్" అను కథ యిట్టిదే. ఒక న్యాయవాది తన కామమున కొకనాడు బలియయిన స్త్రీని తానే కారాగారమునకు బంపును. కాని కథాంతమున గాని ఈ రహస్యము తెలియదు.

మానవులను అర్థము చేసికొనుట చాలకష్టము. మానవుల అంతర్ప్రవృత్తిని తఱచి చూచుట అందఱికు చేతకాదు. ఋషివంటి రవీంద్రుడు అగాధమానవహృద యములను పరిశీలించినాడు. సకలజీవనాంశములను సమీక్ష చేసినాడు. అమాయకులుగా నున్న సామాన్య స్త్రీ పురుషు లలో, అల్లరిచేయు చిన్న పిల్లలలో, "దేశద్రిమ్మరుల" లో సంన్యాసులలో, ఊడిగము చేయు దాస దాసీజనములో మఱుగువడిపోయిన హృదయానురాగములను, ఆవేదనములను రవీంద్రుడు సూక్ష్మాతి సూక్ష్మముగా పరిశీలించినాడు. సకల మానవుల హృదయాంతరాళములలో నిక్షిప్తమై యున్న భావరత్నములను ఆయన తన కథాహారములలో పోహళించి నాడు. మానవునిలోని దానవత్వమును త్రోసిరాజని మాన వత్వమును, జగత్సత్యమును దర్శించురీతులలో ఆయన నేర్పు అసదృశము. ఆ నేర్పు ఇతరులకు అబ్బునది గాదు. మఱి అది ఆజన్మసిద్ధమయిన సంస్కార పరిపాకవిశేషముగా రవీంద్రునిలో సాక్షాత్కరించును. ఆర్థిక దృక్కోణము నుండి మానవుని కొలుచువారు గాని, ఫ్రాయిడ్ సులోచన ములు ధరించి ప్రపంచమును పరిశీలించువారు గాని రవీం ద్రుడు పోయిన బాటలలో పోలేరు. అవి వారి కగమ్యములు. మానవునిలోని వేదనలను, భావనలను, ఊహలను దర్శింప వలె నన్నచో ఎల్లరు రవీంద్రుని కథలు అవశ్యము పఠింప వలయును. పఠించి మననము చేసికొనవలయును. రవీంద్రుడు రచించిన "ఘూటీ" (The Home-Coming) "కాబూలీ వాలా" (The Cabulliwallah) 'పోస్టుమాష్టర్' (The Post Master) "ఆపద్" (The Castaway) ఉత్త మోత్తమములైన కథలు. "ఖోకా బాబూర్ ప్రత్యవర్తన్" (My Loid, the baby) కూడ నిట్టిదే.

"పోస్ట్ మాష్టర్ (The Post Master):— కలకత్తా నగరవాసియైన ఒక పడుచువాడు ఒక కుగ్రామ ములో పోస్టుమాష్టర్ ఉద్యోగము చేయుచుండును. అతడు అవివాహితుడు. ఉద్యోగమా ! చిన్నది. సంబళమా ! అల్పము. అందువలననే అత డొక్కడే ఆ కుగ్రామములో నివసించుచు తానే వంట చేసికొనెడివాడు. రతన్ అను అనాథబాలిక పరి చారికగా నున్నది. ఇట్టిపాత్రలతో కథ యెట్లు సాగును.? మఱొకరైనచో పోస్టుమాష్టర్ రతన్‌ను ప్రేమించినట్లు వర్ణించి, ఆమెచే గర్భధారణము చేయించి, అవకాశ మున్నచో భ్రూణహత్యను గావించి కథను ముగించెడివారు. అట్టి కథ అభ్యుదయకథల జాబితాలో అగ్రశ్రేణికి చెందియుండెడిది. రవీంద్రుడు అభ్యుదయ కథకుడుగాదు కదా ! ఒంటరిగా నున్న

# రవీంద్రుని కథాకథన మార్మికత

పోస్టుమాష్టర్ రతన్ పట్ల అశేషమైత్రీభావమును ప్రకటించును. ఆ భావము అనిర్వచనీయము.. అనుదినము అతడామెకు చదువు చెప్పును. కొన్నాళ్లకు పోష్టుమాష్టరా మారుమూల పల్లెనుండి వేరొక చోటికి బదిలీ యగును. పోవునపుడు అతడు జీవనభృతికై కొంతసొమ్మును రతన్ కిచ్చుటకు ప్రయత్నించును. కాని రతన్ స్వీకరింపదు. పోష్ట్ మాష్టర్ వెళ్లిపోవును. అతడు తిరిగి వచ్చునను ఆసతో రతన్ ప్రతిదినము పోష్టాఫీసుకు వచ్చి పోవుచు ఎదురు తెన్నులు చూచుచుండును. ఈ కథలో ఒకానొక అనాథ బాలిక హృదయగహ్వరములో ఆరిపోకుండ వెలుగుచున్న ప్రేమ జ్యోతిని రవీంద్రుడు చూచినాడు. మానవహృదయములలో ఆజానజముగా నున్న మైత్రిని ఆయన మనకు చూపించినాడు. ప్రకృతిసిద్ధమయిన ఈ ప్రేమ, ఈ మైత్రి సమాజస్థితిని మించియుండునని, సాంఘిక సిద్ధాంతాలకు అందవని రవీంద్రుడు విశ్వసించినాడు. మనము నిత్యము ఇట్టి భావాలను సంఘములో కనుగొనుచున్నాము. ఇవి తర్కమున కందవు. ఆర్థికదృక్పథముతో వీనిని వ్యాఖ్యానించుట అనుచితము. ఈ సందర్భమున ఎన్. సి. సేన్‌గుప్తా చెప్పిన వాక్యములు గుర్తుచేసికొందము.

"What Rabindranath reveals in this casual aquaintance of a village postmaster is the primeval emotional yearning of human nature which is too deep and too mysterious to fit into the coarser arrangements of human society."

(The Great Sentinal, Page. 184)

"ఆపద్" (The castaway) :— ఈ కథలో నీలకంఠుడు ప్రధానపాత్ర. దేశాలుపట్టి తిరుగు నీలకంఠుడొక భాగవత మేలములో చేరును. ఆ మేలము నదిమీద ప్రయాణము చేయుచుండగా తుపానువలన పడవ మునిగిపోయినది. ఆయువు గట్టిది గాన నీలకంఠుడు బ్రతికి బయట పడినాడు. కిరణ్మయి ఆశ్రయము అతనికి లభించినది. ఆమె స్వానురాగామృత కిరణ స్పర్శచే నీలకంఠునిలో నిక్షిప్తములైయున్న మానవతను సత్స్వభావమును మేల్కొల్పును. కాని కిరణ్మయి భర్తయగు శరత్తునకు నీలకంఠునిపై నిర్హేతుకముగా ద్వేషము జనించును. ఈ పట్టున కిరణ్మయి మఱిది సతీశుడు వచ్చును. కిరణ్మయి సతీశునిపై మమత చూపుచున్నదని, తా నుపేక్షితుడనని నీలకంఠు డూహించును. అతనికి సతీశునిపై ఆగ్రహము కల్గినది. నీలకంఠుడు సతీశుడు సిరాపోసికొను పనిముట్టును (Ink Stand) దొంగిలించును. ఈ దొంగతనము బయటకు పొక్కునప్పటికి అతడు కిరణ్మయికి దూరమై విశ్వజన్యసమూహములో లీనమైపోవును. నీలకంఠుని ద్వేషమునకు, ప్రతీకారవాంఛకు, దుష్కార్యాచరణమునకు మూలకారణమయిన మనస్తత్వమును రవీంద్రుడు వెలికి తీడ్చినాడు. కిరణ్మయి తనపట్ల చూపు మమకారము నానాడు సతీశుని మూలమున అదృశ్యమగు చున్నదని నీలకంఠుని యూహ. ఈ యూహ అతనిని చెడ్డపనులు చేయుటకు ప్రేరేపించినది. వ్యక్తి బహిరంగముగా చేయు చేష్టలకంటే ఆ చేష్టలకు కారణమయిన అంతరంగ ప్రవృత్తి ముఖ్యమనునొక పరమసత్యమును రవీంద్రుడీ కథలో ప్రకటించెను. అంతేకాక సమాజస్థితి దౌర్బల్యమువలన సహజసిద్ధమైన మమతలు సంఘర్షణమునకు వశమై శిథిలమగునను నీతిని ఈ కథ ప్రబోధించుచున్నది.

"ఘూటీ" (The Home Coming):—అతి ప్రసిద్ధి పొందిన యీ కథలో పథిక్ చక్రవర్తి నాయకుడు. పల్లెలో అల్లరిపిల్లలపై ఎదురులేని ఏల్బడి సాగించు ఈ బాలుడు—పదునాల్గేండ్ల చిఱుతల మనస్తత్వ మంతయు ముద్దకట్టి మూర్తీభవించినవాడు—విధివశమున చదువుకొనుటకు కలకత్తా చేరును. కాని మేనమామ భార్య యితనిని జూచి విద్వేషజ్వాలలు వెళ్ళగక్కును.. ఆ యింటిలో ఆత్మీయత శూన్యమయినది, ఆదరించువారు కఱవైరి. కలకత్తా వెళ్లిన తర్వాత పథిక్‌చక్రవర్తిని ఇంటిబెంగ పట్టి పల్లార్చినది. అతడు తల్లికి దవ్వగుటయే కాదు. పుట్టినప్పటినుండి విడదీయరాని పొత్తును ఏర్పరచుకొన్న ప్రకృతికి, నదీతీరములకు, శాద్వలములు మైదానములకు, దవ్వై అలమటించినాడు. కలకత్తావచ్చిన తర్వాత గాని పథక్ చక్రవర్తికి మాతృప్రణయానుభూతి కల్గలేదు. ఆ మహానగర స్థితిగతులు, మేనమామ భార్య యీసడింపులు అతనిని తల్లి వలపు కొరకు అఱ్ఱులుచాచి ఆక్రోశించునట్లు చేసినవి. పల్లెనట్టున నున్నపుడు ఈ వలపుపట్ల ఉదాసీనభావముతో ప్రవర్తించినాడు. ఏమి లాభము! అతనిని గాఢముగా అర్థము చేసికొన్నవా రెవరు లేరు. సాహసిక్యముతో ఇంటికి బయలుదేరినాడు. వానలో తడిసి ముద్దయైనయతడు జబ్బుపడి, గతానుభవములతో కలవరించి కలవరించి అభాగ్యుల పాలిటి మాతృమూర్తి మృత్యుదేవత యొడిలో విశ్రాంతి ననుభవించును. ఈ కథ కరుణరసభరితమయిన ఒక మహాకావ్యము. స్వార్థము, అమాయికహృదయము కయ్యము చేసిన కథ యిది. లోకమునకు తెలియని గుండెగూడులలో కాపురించిన వేదనలు ఎట్లు అసంగతస్థితులలో వ్యక్తమగునో యీ కథ సుస్పష్టముగా బాహిర పుచ్చుచున్నది.

"కాబూలీవాలా" (The Cabulliwallah): ఈ కథ ఒక మంజుల కళాఖండము. "రహమాన్" అను ఆఫ్ఘన్ దేశీయునకు, "మినీ" యను పసిపాపకు మధ్య నానాడు పెంపొందిన మైత్రిన్ని రవీంద్రుడు సంపూర్ణముగా సాక్షాత్కరింపజేసినాడు. కథాంతమున "అయ్యా! మీరు చాల దయగలవారు. నన్ను గుర్తుపెట్టుకొనుడు. మీరు, నాకు

డబ్బు ఈవలదు. మీకొక చిన్న అమ్మాయి ఉన్నది. అట్లే నాకును ఒక పాపఉన్నది. మా అమ్మాయిని స్మరించుకొనుచు మీ పాపకు పండ్లు తెచ్చుచున్నాడను—అంతేకాని నేనేలాభము పొందవలెనని మాత్రము గాదు" అని రహమాన్ మినీ తండ్రితో పలికినపుడు పాఠకుల హృదయము అనంతమైన ఆర్ద్రతకు అగపడును. ఈ కథా ప్రభావమును గూర్చి ఎస్. సి. సేన్‌గుప్త చక్కగా చెప్పినాడు :—

"The revelation of the emotional side of the Cabulliwallah comes suddenly at the end of the story ; it has a stabbing effect partly because we are unprepared for it and partly because it shows in an unsuspected manner the universality of the primal emotions and of the fundamental unity of man."

(Tne, Great Sentinal, Page. 189)

మినీ, రహమాన్ తుల్య వయస్కులు గారు. వారి భాష వేఱు. భావములు వేఱు. అనుభూతులు వేఱు. మతాచారములు వేఱు. ప్రథమకాలములో ఈ పరిచయము అతి సామాన్యమయినది. కాలక్రమమునగాని రహమాన్ వేదన వ్యక్తముగాదు. మినీతోడి పొత్తువలన గాని రహమాన్ హృదయమందలి పుత్రికానురాగ వాంఛ ఫలవంతముగాదు. దేశాంతరమందు ప్రవాస జీవితము ఈడ్చు రహమాన్ పెరిగి పెద్దదైన కూతురిపై—అజ్ఞాతముగా నున్న దానిని—వాత్సల్యమును కురియించుటకు మినీ హేతుభూతురాలయినది.

"ఖోకా బాబూర్ ప్రత్యవర్తన్" (My Lord, the Baby) :—రాయ్‌చరణ్ అమాయకుడు. కలవారియింటి పనివాడు. ఏలిక బిడ్డను వయాళికి తీసుకొని వెళ్లగా ఆ పసివాడు నీటిపాలగును. నెత్తురుపిండి చాకిరిచేసిన యజమానుడు పసిబిడ్డను రాయ్‌చరణుడే చంపినట్లు నేరము మోపును. ప్రాణసమానముగా చూచుకొనుచున్న పసివాడు నీటిపాలయినందులకే కుమిలిపోవుచున్న రాయ్‌చరణుడు ఈ నిందారోపణమును భరింపలేడు. అతడు స్వగ్రామమునకు వెళ్లును. ఏడాదిలో రాయ్‌చరణునకు కొడుకు పుట్టును. యజమాని కుమారుడే తనయింటిలో అవతరించెనని అతడు మురిసిపోవును. కన్నబిడ్డనే పెంచి పెద్దవానినిచేసి, చదువు సాములు నేర్పించి యజమానికి—వారి బిడ్డడనియే బొంకాడి—అప్పగించును. ఒక మహావేశము, ఒక దుర్భరానుభవము క్రుంగదీయునపుడు అమాయికుడయిన మనుష్యుని హృదయము ఎట్టి పోకడలు పోవునో ఈ కథ స్పష్టము చేయుచున్నది. అద్భుతావహమయిన మనస్తత్వ చిత్రణము ప్రధానముగా గల కథ యిది.

## 4

సమకాలీనసాంఘిక పరిస్థితులు ప్రతిరచయిత యందు పరివర్తనము కలిగించును. అట్లే 19 వ శతాబ్దము నందలి వంగరాష్ట్ర సాంఘికపరిస్థితులు రవీంద్రునిపై ఎనలేని ప్రభావమును చూపినవి. పందొమ్మిదవ, యిరువదవ శతాబ్దములలోని సంఘము ఆయన కథలలో గోచరించును. భారతీయసంస్కృతి విరాణ్మూర్తి రాజారామమోహన రాయలు. ఆయన స్థాపించిన బ్రహ్మసమాజమునకు రవీంద్రుని తండ్రి మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్ అండదండలు లభించినవి. రవీంద్రుడు కూడ బ్రహ్మసమాజ మతస్థుడే. బ్రహ్మసమాజ మతస్థులు వాంఛించు మత సాంఘిక సంస్కరణములు రవీంద్రుని రచనలలో—కథలలో—ప్రతిబింబించుట వింత యేమియు గాదు. బాల్య వివాహములను, కుల భేదములను నిరసించినాడు గురుదేవుడు. రవీంద్రుని సాంఘికదృష్టి సాక్షాత్కరించు ఒక కొన్ని కతలు పరిశీలింతము.

"ఠాకూర్‌దా" (The Babus of Nayanjore):—ఈ కథలో జమీందారుల చిత్తప్రవృత్తి నిరూపింపబడినది. కైలాసబాబు బతికి చెడినవాడు. కాని దివాణపు దర్జాగాని, దర్పముగాని ఆయనలో నశింపలేదు. "మ్రింగుటకు మెతుకు లేదు. మీసములకు సంపెంగనూనె" యను ధోరణిలో కైలాసబాబు ప్రవర్తించును. చితికిపోయిన దర్జాను, దర్పమును, విలాసమును కట్టుకతలుగా అల్లి అత డిరుగుపొరుగువారికి ఏకరువు పెట్టును. ఇతరుల అవివేకమును ముచ్చటలుగా చెప్పుకొను ఆ యిరుగు పొరుగువారు ఆ కతలను విన్నంతసేపు నిజములని నమ్ముచున్నట్లు నటింతురు. వారి యీ నటన కైలాసబాబును భ్రమింపచేయును. అప్పుడొక కొంటెవాడు కైలాసబాబును—నాటకమాడి—నవ్వులపాల్సేయును. ఈ నాటకములో కైలాసబాబును పరాభూతుని జేయనెంచిన నాయకుడు కూడ పరాభూతుడే యగును. ఈ ద్వంద్వాపజయములకు కారణము కైలాసబాబు మనుమరాలు కుసుమ. ఈ అపజయములే కథను తుదకు రమణీయముగా మార్చును. కుసుమ ఈ కథలో వ్యక్తిత్వము లేని పాత్ర. కాని ఆ పాత్రయే భిన్నోపాధులను ఆశ్రయించి మనుగడను మధురముగా చేయు రసభావములను వెల్వరించును. మనుమరాలిని ఆత్మాధికముగా ప్రేమించు కైలాసబాబు మొదటిసారిగా—చివరిసారిగా కూడ—తన పేదఱికమును ఒప్పుకొనలేక తప్పలేదు. "నేను పేదవాడను. గత వైభవ ప్రాభవములను తిరిగి పొందలే"నని అతడనక తప్పినది గాదు.

కైలాసబాబులో జమీందారుల కృత్రిమ జీవనము దంభ ప్రవృత్తి, వ్యళీకరీతులు రూపుదాల్చినవి. కాని యతని పోకడ శోచనీయము. కైలాసబాబు కల్పనా కథా సూత్రముల వలన ఇతరులను గాక తననే బంధించుకొనును. కాని ఎంత ఆడంబరజీవి యయిన మానవసహజభావములను చంపుకొనలేడు. కైలాసబాబు కూడ అంతే. మనుమరాలిపైని మమత

మున పేదవాడనని ఒప్పుకొనక తప్పలేదు. బాహ్యాను బంధములు బలీయములు కావచ్చును. కాని అవి అంతర రసభావ ప్రవృత్తికి లొంగకతప్పదు.

"త్యాగ" (The Renunciation) :—ఈ కథలో ఒక సనాతన పరతంత్రుని బిడ్డ కులము తక్కువయిన బాలికను వివాహమాడును. ఈ విషయము పెండ్లినాడు తెలియదు. పగబూనిన యొక మనిసి పన్నిన పన్నాగములవలన యీ వివాహ కార్యము జరుగుట సంభవించును. కాని యీ తంత్రము తరువాత తెలియును. ఆవేదనల కంటె ఆచారములను ఆరాధించు, విశ్వసించు వరుని తండ్రి యీ బాలికను పరిత్యజింపుమని కుమారుని బలవంతము చేయును. ఒత్తిడి చేయును. కాని అంధ విశ్వాసములకు ఏనాడో తిలోదకము లిచ్చిన ఆ కోడెగాడు హృదయానుభూతులు పరమ యథార్థము లని భావించు ఆ నవీన నాగరకుడు తండ్రిమాటను పెడచెవిని బెట్టును. అగ్నిసాక్షిగా వివాహము చేసికొన్న అతివను ఏలికొనును. ఇందు కులభేదములను కూలదన్నవలయు ననుటయే రవీంద్రుని లక్ష్యముగాదు. మానవుని అంతరంగిక జగత్తు బాహ్యజగత్తుకంటె సర్వోత్కృష్టమైనది. దానిని కృత్రిమాచారశృంఖలములతో బంధింపబూనిన అహేతుకప్రళయములు సంభవించునని చాటుటకూడ రవీంద్రుని తాత్పర్యము. హృదయానుభూతికి పట్టము గట్టువారు బాధలపాలు గాక తప్పదు. వా రాబాధలను నిర్విచారముగా అనుభవింతురు. తనమాట వినలేదను కినుకచే తండ్రి బిడ్డను ఇంటినుండి బహిష్కరించును. కాని మూఢాచారములను నమ్మి ఆత్మద్రోహము చేసికొనుట కంటె, విశాలదృక్పథముతో పితృద్రోహము—తండ్రిమాట వినకపోవుట ద్రోహమా !—చేయుట మంచిదని నమ్మి ఆ యువయిల్లాలితో ఇంటి నుండి వెడలిపోవును.

"ఘాటేర్ కథ" (The River Stairs) : కథా రచనా ప్రారంభదశలో రవీంద్రుడు ఈ కథను సృష్టించెను. అతని యుత్తమ కథలలో ఇది యొకటి. దీనిలో ప్రకృతి పన్నిన యింద్రజాలము గాక, ఒక ప్రత్యేక ప్రదేశము సృష్టించిన దిగ్భ్రమ కలదు. ఆ చోద్యమును సృష్టించినవి నదీ సోపానములు. ఈ కథలో నదీసోపానములే కథకుడుగా నుండును. ప్రపంచమునకు కన్పింపకుండ స్త్రీ పురుషులు కప్పిపుచ్చిన బాధలను, భావములను, ఆందోళనములను, ఆవేశములను మూక సాక్షియై పరిశీలించినవి ఈ యేటి మెట్లు. అవ్యక్తము లయిన ఆవేదనలను స్పైతము గ్రహింపగల్గిన వివి.

ఈ కథలో బాలవితంతువయిన కుసుమ నాయిక. ప్రవాసజీవితమును గ్రోయుచున్న పడతి ఆమె. కుసుమకు వివాహ మయినది. కాని ఎనిమిదేండ్ల యీడున ఆమె "నల్లపూసల సౌరు గంగలో కలిసిపోయె." కాలము గడచినది. కుసుమ యువతియైనది. ఒకసారి యొకసన్యాసి వారి యూరికి వచ్చెను. అతడే కుసుమభర్త యని యూరివారెల్ల గుసగుసలు పోవుదురు. అందఱితోపాటు కుసుమ కూడ ఆ సంన్యాసిని పూజించును. అనుదినార్చలవలన ఆమె ఆత్మశాంతి ననుభవించును. కాని ఆమె మనసు కలతజెందును. తన యీ పరివ్రాజకార్చనము ప్రియాపూజనమని కుసుమకు స్వప్నములో గాని అనుభవమునకు రాదు. కామలిప్తమయిన ఆమె వాంఛ సంన్యాసి పూజగా పరిణమించినది. ఈ విషయము కుసుమకు కలయందు తెలిసినది. ఆమె ప్రస్తావనోచితముగా తనయీ బాధనుగూర్చి సంన్యాసికి చెప్పును. వారిరువురి ఈ రహస్యసమావేశము కుసుమచేసిన సంభాషణము మానవమాత్రున కెవరికి తెలియదు—నదీ సోపానములకు తప్ప. స్వకీయ స్వప్నానుభవమును చెప్పిన కుసుమతో "నేను నిస్సంగుడనని తెలిసికో. ఐహిక సుఖగత జీవినిగాను. నీవునన్ను మఱచిపోకతప్ప" దని సంన్యాసి చెప్పును. చెప్పి మెట్లమీదుగా నడిచిపోవును. ఏఱు కుసుమను తనకడుపులో దాచుకొనును.

ఈ కథలో వితంతువుల మనస్తత్త్వచిత్రణము గుండె కరగిపోవునట్లుగా చూపబడినది. సర్వత్ర—ఔచిత్యము పాటింపబడినది. కథాకథనములో ఉత్కంఠ సాంద్రము. కుసుమ భర్త మరణించెనా? అతడు సంన్యాసియై తానే మరణించినట్లు కూటలేఖను పంపెనా? కథలోని సంన్యాసియే అతఁడా! కుసుమ అతనిని తన ప్రాణేశ్వరుడేయని గుర్తించి నమ్మెనా? మఱి యీ బైరాగి యెవరు? ఈప్రశ్నలకు నదీ సోపానములు—కథకుడుగా నున్నవి—సమాధానములుచెప్పవు.

"జీవిత ఓ మృత" (Living or Dead) : కాదంబిని యను వితంతువు దీనిలో నాయిక. ఒకనాడామె మూర్ఛ పోవును. బంధువు లామెమరణించినదని భావించిరి. సేవకులు స్మశానమునకు కొంపోయిరి. అక్కడ కాదంబిని మూర్ఛనుండి తేరుకొనును. శవవాహకులు పలాయనము చిత్తగింతురు. కాని కాదంబినిలో విపరీతపరిణామ ముప్పతిల్లును. బ్రతికియున్నను మరణించితిననియే యామె యూహ. తాను నిశాచరయైనట్లు, లోకముతోడి నెయ్యపు త్రాళ్లు త్రెంపబడినట్లు కాదంబిని భావించును. ఈభావన చెలిమికత్తెయగు జోగ్‌మాయ యింటికి వెళ్లినను ఆమెను వెన్నంటియే యున్నది. అచట కాదంబిని ప్రవర్తనము మానవాతీతముగా నుండును. అచటనుండి స్వగృహమున కామె వచ్చును. అప్పటికిగాని ఆమెభ్రమ వదలలేదు. పెంచిపెద్ద చేయుచున్న ఒకపసివానిపైగల వలపుగూడ ఆమె దుర్భ్రమను తొలగించును. కాని బంధువులెవ్వరు ఆమె సజీవయని విశ్వసింపరు. తిరిగి నిజముగా చనిపోయి తాను బ్రతికియున్నట్లే నిరూపించినది కాదంబిని. ఒకదుర్భ్రమ వ్యక్తి చిత్తమును క్రుంగదీయునపుడు అసాధారణానుభవము తారసిల్లినపుడు ఆవ్యక్తి చిత్తవృత్తి యెట్లుండునో క్షోదక్షమముగా పరిశీలించినవాడు రవీంద్రుడు.

వితంతువుల మనస్తత్త్వమును ఆశ్రయించిన కథల నెన్నింటినో రవీంద్రుడు రచించినాడు. "మహామాయ"

"కంకాళ్" "ప్రతివేషిణి" మున్నగు కథలిట్టివే. "ప్రతివేషిణి" కథలో ఒకపాత్ర ఈవిధముగా—ఇది రవీంద్రుని అభిప్రాయమా అనునట్లు—పలుకును.

It is all very well for you to idealise widowhood from your safe distance, but you should remember that within widow-hood there is a sensitive heart, throbbing with pain and desire."

(Mashi and other Stories, Page. 219)

"ఏక్తీ ఆషాడే గల్ప" (The kingdom of cards):— భారతదేశ వర్ణవ్యవస్థను, తత్ఫలముగా జనించిన దుష్టపరిణామములను, తీవ్రముగా నిరనుకంపముగా విమర్శించి చాటెనకథయిది. నలువైపుల మూఢాచార కుడ్యములను నిర్మించుకొని, కాలాంతరమున వ్రాయబడిన గ్రంథములను పరమప్రమాణముగా భావించి, విజ్ఞాన భాస్కర రోచిస్సులు ప్రసరింపనీని సంఘవ్యవస్థ ఎట్లు నిర్జీవముగా నుండునో వర్ణించిన కథయిది. ఒకానొక రాజ్యములో ఆసు, రాజు, జాకీ అగ్రకులములవారుగా చలామణి యగుచుందురు. మిగిలిన పేడిముక్కలు తక్కువ కొలములవారు. ఈవ్యవస్థలో పరిణామములేదు. ప్రాబడిన పలుకు త్రికాలాబాధిత దివ్యసత్యమని నమ్మి ఆరాజ్యములోవారు నడుతురు. ఇట్లుండగా పరభూములనుండి కొందఱు వత్తురు. వారిరాకతో చైతన్యములేని రాజ్యములో సంచలనము పుట్టును. అశాంతి అలముకొనును. తక్కువ కొలాలవారిలో "ఇచ్ఛ" జనించును. ప్రాచీనాచారములు, అంధవిశ్వాసములు అనుచిత నియమములు అన్నియు సడలిపోయి బ్రద్దలగును.

"చోరెయ్ ధన్" :—(The Stolen Treasure) జ్యోతిషముపట్ల మానవునకున్న దురభిమానమును చీల్చి చెండాడు కథయిది. సునేత్ర తండ్రి జ్యోతిశ్శాస్త్ర పారంగతుడు. ఆయనకుగల జ్యోతిశ్శాస్త్ర దురభిమానము సునేత్రకు సంక్రమించినది. సునేత్రకొక కూతురు కలదు. ఆకుమార్తె యీడు జోడు సరిగానున్న యొకపడుచువానిపయి మరులుగొన్నది. కాని సునేత్ర ఆ వివాహమున కంగీకరింపదు. కారణము వధూవరుల జాతకచక్రములు భిన్నముగా నుండుట. సునేత్రభర్త ఈ సమయమున ఒకరహస్యము బయటపెట్టును. సునేత్రజాతకము, ఆమెభర్తజాతకము మొదట ఒకటిగాలేవు. సునేత్ర తల్లి కాబోవు అల్లునిని తనకూతురు జాతకమునకు సరిపోవునట్లుగా జాతకము మార్చుకొనుమని ప్రోత్సహించును. సునేత్రభర్త యట్లే చేయును. అప్పుడుగాని సునేత్ర వివాహము కాలేదు. ఈ రహస్యమును విన్న సునేత్రకుమార్తె పెండ్లికి అంగీకరించును. వివాహమునకు వధూవరుల పరస్పర ప్రేమముఖ్యము. తారాబలము, గ్రహబలము చాలక పోయినను వధూవరుల హృదయములలో చాలినంత ప్రేమయున్నచో వివాహములు విజయవంతము లగును.

"సమస్యాపూరణ్" (The Riddle Solved):— అనుకథ హైందవ మహమ్మదీయ సామరస్యము నుద్బోధించుచున్నది. ఝిక్రకోట జమీందారు కృష్ణగోపాల సర్కార్ జ్యేష్ఠ పుత్త్రునకు ఇంటి పెత్తనము అప్పగించి కాశీపట్టణము చేరి భగవధ్యానములో కాలక్షేపము చేయుచుండును. క్రొత్తగా పెత్తనమునకు వచ్చిన ఆ పెద్దకుఱ్ఱడు పొరుపత్తెమును చలాయించుచుండును. తండ్రికే వంకలు దిద్దుచుండును. తనజాగీరునుండి ఒక మహమ్మదీయుని తొలగింపవలయునని బిపిన్ శతథా ప్రయత్నించుచుండును. కాని మహమ్మదీయుడు అంగీకరింపడు. ఇరువురి మధ్య పగచిచ్చు రాజినది. బిపిన్ మహమ్మదీయునిపై దావా వేయును. న్యాయవిచారణావసరమున కాశీనుండి కృష్ణగోపాలసర్కార్ కూడ వచ్చి ఆ మహమ్మదీయుడు తన వలపును పంచుకొన్న బీబీ కొమారుడే యని బిపిన్‌తో చెప్పును. మహమ్మదీయుడు ఎప్పటియట్ల తన కొండ్రను తాను పొందును. రవీంద్రుని విశాల దృష్టికి ఈ కథ తార్కాణము. భారతీయసంస్కృతిని హైందవ సంస్కృతిగా దర్శించువారికి గుణపాఠము నేర్పునదీకథ.

వంగదేశములో నొక మూఢాచారము కలదు. ఆర్జించిన విత్తమును ఒకచో పూడ్చిపెట్టి, ఆ ధనముతోపాటు ఒక మనుజుని కూడ ఖననము చేసినచో ఆ మనుజుడు యక్షుడుగా మారును. యక్షుడాధనమును కాపాడుచుండును. అతడు ధన నిక్షేపమును జేసినవానికి ఆగామి జన్మలలో ఎప్పుడైన తిరిగి దానిని అప్పగించును. ఇది యొక భయంకర విశ్వాసము. "రాబోవు పుట్టువులలో నే నెప్పుడయిన ఈ బాటనే వెళ్ళుచున్నచో నీ వీ ధనమంతయు నా కప్పగింపవలెను. అప్పటివఱకు ఇక్కడనుండి కదలకుండ దీనిని కాపాడుచుండు" మని ధననిక్షేపముచేయువాడు తాను పూడ్చిపెట్టబోవు వ్యక్తిచే వాగ్దానము చేయించును. కాని నవీన కాలమున ఈ ఆచారము వంగదేశములో కథగా శేషించినది.

"సంపత్తి సమర్పణ్" (The Trust Property) కథలో ఈ ఆచారమువలన కలుగు అనర్థములు నిరూపింపబడినవి. జగన్నాథకుండు అవిజ్ఞాతముగా తన మనుమనినే ధన నిక్షేపము చేయుచు పూడ్చిపెట్టును.

"గుప్తధన్" (The Hidden Treasure) అను కథలో ధనవాంఛాతత్పరుడైన వ్యక్తి పడు పాటులు చిత్రింపబడినవి. కానని క్రంతలలో నున్న ముళ్లకై ఆరాటపడు మానవహృదయము తత్త్వ మెట్లుండునో ఈ కథ చక్కగా చెప్పును. ధనాశా పిశాచ తాండవమును ఈ రెండు కథలు చక్కగా చిత్రించుచున్నవి.

# రవీంద్రుని కథాకథన మార్మికత

"రాజ్ టీక" (We Crown the King) అనునది జాతీయోద్యమ ప్రభావము కల కథ. ఈ కథానాయకుడు నవేందుశేఖరుడు. అతని మఱది ప్రమథనాథుడు మతీయొక ముఖ్యపాత్ర. ప్రమథనాథు డాంగ్ల దేశములో విద్యాభ్యాసము పూర్తిచేసి స్వదేశమునకు తిరిగివచ్చెను. మొదట నతనిలో ఆంగ్లనాగరకత బాగుగా జీర్ణమయినది. కాని స్వదేశమునకు వచ్చినపిదప అతని మనసుమారినది. అతడు ఒకసారి రైలులో ప్రయాణము చేయుచు రక్షకభటాధికారి యొకడు తోడి ప్రయాణికులను రైలుపెట్టెనుండి గెంటుట కనులార చూచెను. అప్పటికిగాని ప్రమథనాథునకు భారతీయుల దుర్భరస్థితి తెలియలేదు. అతనిలో మాతృదేశభక్తి జనించినది. ఈ దేశభక్తి విదేశవస్త్రదహనములో పర్యవసించినది. నవేందుశేఖరుడు తెల్లదొరల అడుగులకు మడుగు లొత్తెడివాడు. తండ్రినుండి సంక్రమించిన గుణమిది. కాని ప్రమథనాథుని సోదరియగు అరుణలేఖను వివాహమాడిన పిదప అతనిలో మార్పు గోచరించినది. వదినగారగు లావణ్యలేఖ అతనిలో దేశభక్తిని ప్రోదిచేసినది. కాని ఆంగ్లేయుల ఆగ్రహమునకు గురియగుదునేమో యని నవేందుశేఖరుడు భయపడును. తన యీ భయము వదినగారికి కన్పడకుండ చేయుటకు ప్రయత్నించి పలుసారులు పరాజయము పొందును. తుదకు దేశభక్తుడగును. ప్రమథనాథుడు, నవేందుశేఖరుడు స్వాతంత్ర్యోద్యమమునాటి భారతీయులలో చూపట్టు ద్వివిధ మనస్తత్త్వములను పుణికిపుచ్చుకొన్నారు. ఈ కథలో స్వాతంత్రోద్యమకాలమునాటి రాజకీయస్థితి చక్కగా ప్రతిబింబించుచున్నది.

మానవజీవితమునకు మెఱుగులు దిద్దునది కుటుంబ వ్యవస్థ. ఆ కుటుంబ వృక్షమునకు బీజము వివాహము. భారతీయులు వివాహమును పరమపవిత్రకార్యముగా భావింతురు. వివాహాచలశిఖరాగ్రములనుండి రసఝరులు స్రవించి వధూవరుల జీవనమును ఆర్ద్రీభూత మొనర్చును. "వివాహము సంగీతమయ నాటకము వంటిది. దానిని ప్రదర్శించుటకు ఒక జీవితకాలము పట్టు" నని రవీంద్రుని సిద్ధాంతము. భార్యాభర్తలను బంధించునది ప్రేమసూత్రము. ఈ సూత్రము తెగిపోయిననాడు, కుటుంబము భగ్నమగును. వధూవరుల జీవితములో సుఖశాంతులు శూన్యమగును. బ్రతుకు ఎడారియై నిరాశా వాలుకాత్రసరేణు మయమగును. ఆలుమగల వలపును లక్ష్యముగా గొని రవీంద్రుడు కొన్నికథలను రచించెను. వానిలో "మాషి" (శేషేర్ రాత్రి) యనునది యొక కథ. మాషి యనగా పిన్నమ్మ యని యర్థము.

జోతిన్ జబ్బువలన మంచము పట్టును. చావు బ్రతుకుల మధ్య లోలకమువలె పూగిసలాడుచుండును. జోతిన్ భార్యానురాగము ప్రయత్నించియు పడయజాలని అభాగ్యుడు. భార్యపేరు మణి. మణికి రోగపీడితుడయిన భర్తపై ఆదరము ఆవగింజంతయు లేదు. ఆమె ముచ్చటలనిన చెవి కోసికొనును. జోతిన్ మేనత్త మణికి అతనిపై గాఢానురాగ మున్నట్లు కల్లలు పల్కును. పనులన్నియు మణియే చేయుచున్నదనియు, విరామము లేకుంటచే అతనిని జూచుటకు రాలేక పోవుచున్నదనియు, మేనత్త జోతిన్‌తో చెప్పును. ఈ విధముగ బొంకాడియైన భూమిపై నూకలు నిండుకొన్న అతనికి ఆత్మతృప్తి కల్గింపవలెనని ఆమె ఆరాటము! మేనత్త కడసారి చూచుటకయిన భర్త దగ్గఱకు పొమ్మని మణిని బతిమాలును. కాని ప్రయోజనములేదు. చావు దగ్గర పడిన పతిని వీడి మణి చెల్లెలు అన్నప్రాశనోత్సవమునకై పుట్టినింటికి వెళ్ళును. కాని మణియింట నున్నదని మేనత్త జోతిన్‌తో చెప్పును. జోతిన్ మణిని జూడవలయునని ఆరాటపడును. కాని ఆమె యితని గదివైపే చూడదు. ఐనను ఇత డన్యవిధముగా భావింపడు. జోతిన్ హృదయసామ్రాజ్యమునకు మణి మహారాజ్ఞి. అతని దృష్టిలో ఆమె యొక ప్రణయదేవత. కాని మణి పుట్టినింటికి వెళ్ళినదని శంభు చెప్పినప్పుడు జోతిన్ గాలిమేడలు కూలిపోయినవి. అతని అవసానకాలమున మణి వచ్చి కాళ్ళపై బడును. కాని పోగాలమునందు గాని సత్యము దర్శింపని అతడు మేనత్త మణియే అల్లినదని అబద్ధము చెప్పిన సాలువును గూడ తన్నివేసి "అత్తయ్యా! అది సాలువుకాదు! కాదు! అది మోసము మాత్రమే" అని అనును.

సత్యాసత్యములను మొదట జోతిన్ గుర్తింపలేదు. అతడు భావగతజీవు డయినాడు. ఏనాడు భార్యను పల్లెత్తి మాట అననివాడు, ఏనాడు క్రూరస్వభావుడు కానివాడు జోతిన్. అట్టివాడు అంత్యకాలమున సత్యమును గుర్తింపదలచినాడు. సాలువును తన్నివేసె ననగా జోతిన్ భ్రమలను తొలగించికొనె ననియే అర్థము. ఇది ఒక రమణీయ ప్రతీక.

"మాషి" కంటె రమణీయమయిన కథ "దృష్టిదాన్" (Vision). ఈ కథలో అంధురాలు నాయిక. నాయికయే కథను చెప్పును. ఆ అంధురాలి ఆవేదన, అతీంద్రియ దృష్టి దానిలో చక్కగా వర్ణింపబడినవి. ఈ కథ యంతట స్త్రీజన సరళ ప్రవృత్తి నిండియున్నది. యుగయుగాలనుండి స్త్రీయందు రూపుదాల్చిన శక్తి, సంస్కారము, పవిత్రత—పురుషులకు దుస్సాధ్యము లైనవి—కుముదిని భావములలో, పలుకులలో, నడవడికలో కన్పించుచున్నవి. కుముదిని అంధురాలైనపుడు భర్త ఎంతో విచారించును. అతని పేరు అవినాశుడు. తన అశ్రద్ధవల్లన భార్య కనులు పోయినవని పశ్చాత్తాపపడు అవినాశుడు ఆమెను ప్రణయదేవతగా పూజించును. ద్వితీయవివాహము చేసికొననని బాసచేయును. వైద్యశాస్త్రప్రవీణుడై ఒక గ్రామమున చికిత్సాలయము నెలకొల్పును. ధనమార్జించును. అప్పటినుండి అతనిలో మార్పు వచ్చినది. శారీరకముగా కుముదిని అంధురాలు గావచ్చు. కాని నానాడు భర్తకు తనకు మధ్య భావభేదము ఒక మహాభారత

రూపమున పెరుగుచున్నదని యూహించినది. భర్త భౌతిక వాంఛలకు దాసు డైనాడని ఆమెకు తెలియును. అవినాశుడు హేమాంగినిని వివాహమాడ నిశ్చయించినపుడు ప్రతిజ్ఞా భంగమగునని కుముదిని కుమిలిపోయినది. అవినాశుడు హేమాంగినిని వివాహమాడదలచినను కథాంతమున కుముదిని సోదరుడు ఆమెను పెండ్లిచేసుకొనును. కథ చివరకు ప్రణయకథగా, సుఖాంతకథగా పరిణమించును. ఈ కథలో రవీంద్రుడు ప్రణయభావమును సూక్ష్మాతిసూక్ష్మమయిన సన్నివేశములందును రసవత్తరముగా చిత్రించినాడు.

భార్యాభర్తలకు సంబంధించిన మఱియొక గాథ "దీదీ" (The Elder Sister). భర్తయొక్క స్వార్థమునకు, భార్యయొక్క త్యాగమునకు మధ్య జరిగిన సంఘర్షణ మిందలి యితివృత్తము. శశికళ కథానాయిక. ఆమె తల్లిదండ్రులు లేని తమ్ముడు నీలమణిని కానకకన్నబిడ్డవలె పెంచును. కాని ఆమె భర్తయగు జయగోపాలుడు నీలమణి యన్నచో ఏవగించుకొనును. అంతేగాక నీలమణి ఆస్తిని అపహరింప జూచును. శశికళ జయగోపాలుని ప్రయత్నములకు ఆటంకములు కల్గించును. భర్తను ఎదిరించును. తమ్మునిపై గల కూరిమిచే భర్తకు దూరమగును. ప్రభుత్వోద్యోగుల అండదండలవలన శశికళ జయగోపాలుని బారినుండి నీలమణిని రక్షించును. జయగోపాలుడు శశికళను చంపి ఆమె కలరావలన చనిపోయినదని చాటును. నవల వ్రాయుటకు సరిపోవు కథ యిది. కాని అల్పములయిన సన్నివేశములను వర్ణించి రవీంద్రు డీ కథ కొక సమగ్ర స్వరూపము తీర్చిదిద్దెను. ధర్మానురాగములు స్వార్థదుష్టశక్తులతో యుద్ధముచేసి గెలుపొందినవి.

"ఇన్ ది నైట్" అను కథను కూడ భర్త భార్యపట్ల చేయు అపచారమును చిత్రించుచున్నది. దోఖిన్‌బాబు భార్య వ్యాధిగ్రస్తురాలు. అత డామెను ప్రేమించుచున్నట్లు నటించును. కాని దోఖిన్‌బాబు మరొక యువతిపై మక్కువ కలిగియుండెను. భార్య కీవిషయము తెలియును. ఒకనాడు దోఖిన్‌బాబు రెండవ యువతిని ఇంటికి తీసుకొని వచ్చును. సాయంసంధ్యారాగ కాంతిలో గడప దగ్గఱ నిలబడిన ఆ యువతిని దోఖిన్ భార్య సరిగా చూడలేదు. ఎవరో గడప దగ్గఱ నిలబడి యున్నారని మాత్రమే తెలిసికొనిన ఆమె నోటి నుండి అప్రయత్నముగా "ఓకే" యనుమాట వెల్వడును. వంగభాషలో "ఓకే" యనగా ఎవరు వారని అర్థము. ఆ నూతన యువతి తనను భర్తృహృదయ సింహాసనమునుండి స్థానభ్రష్టురాలను చేయుచున్నదని భావించి భయపడుచు దోఖిన్‌భార్య "ఓకే" యను మాట ముమ్మారు అనును. ఆమె మరణించిన పిదప "ఓకే" యను వెఱ్ఱికేక వేయుట ప్రకృతిశక్తులకు అలవాటయినది. దోఖిన్‌బాబు ద్వితీయ భార్యను ఎంతగానో ప్రేమించును. కాని ప్రకృతి అర్ధాంతర హానములు చేయుచున్నట్లు అత డూహించును. ఈలలుకొట్టు గాలిలో, జలజల పాఱు సెలయేటిలో, పులుగుల సవ్వడిలో దోఖిన్‌బాబునకు "ఓకే" యనుమాటయే విన్పించును. అత డేమి చేయుచున్నను "ఓకే" యను కేక విన్పించును. దోఖిన్‌బాబు తాను జేసినపనికి క్రోధమానవివశయై ప్రథమభార్య "ఓకే" యను పదరూపమున తనను శపించుచున్నదా యని భావించును. ప్రకృతి దోఖిన్‌బాబు మొదటి యిల్లాలికి చేసిన అపచారమునకు కసలి ప్రతీకారము చేయుచున్నదేమో యనిపించును. ప్రకృతి యిట్లు చేయుట అమానుషసంఘటనమే. రవీంద్రు డేరీతిగా ప్రకృతిని అమానుష సంఘటనా సాధనమ్ముగా కథలలో వినియోగించెనో మున్ముందు విపులముగా వివరింపబడును. ఈ కథలో ప్రథమ కళత్రము తనక్రోధమును ప్రకృతిద్వారమున వెలార్చినదిగదా!

"గిరిబాల" అను కథకూడ అలుమగలు తలపులను ప్రకటించుచున్నది. ఒక పడుచువాడు భార్యను పరిత్యజించును. నర్తకులను మోహించును. భార్య దీనాలాపములను అతడు వినడు. ఆమె యింటినుండి వెడలిపోవును. అతనికి గృహిణియేమయినదో యని కూడ తెలియదు. తెలిసికొనవలయునని ప్రయత్నింపడు. చివరకు భార్య నర్తకియై ఒక నాటకములో నటించుచున్నపు డతడు ఆమెను గుర్తుపట్టును. గుర్తించి ఆమెను బాధింప మొదలిడును.

భార్యాభర్తల అనుకూలదాంపత్యమువలన గృహము స్వర్గసీమ యగును. కాని నాడది రౌరవ నరకమే. ఈ జగత్సత్యమును రవీంద్రుడు, విభిన్న స్త్రీ పురుష పాత్రలను సృష్టించి తెలిపినాడు. "సమాప్తి" (The Conclusion) సదర్ ఓ అందర్ (Raja and Rani) "ఉద్ధర" (Saved) "బోష్టమి" (The Devotee) మున్నగు కథలు ఈ కోవలో చేరినవే.

## 5

రవీంద్రుని కథలలో జగత్ప్రసిద్ధ మయినది "హంగ్రీ స్టోన్స్". ఈ కథలో అతని కల్పనాశక్తి పరాకాష్ఠ నందినది. మ్లేచ్ఛరాజప్రాసాదము ఒక వ్యక్తి చిత్తప్రవృత్తిపై చూపిన ఇంద్రజాలము ఈ కథకు బీజము. కాలయవనికను తొలగించి రెండువందల యేబదియేండ్లనాడు ఈ హర్మ్యరాజములో నివసించిన "ఎల్రప్రాయంపు మిటారి కత్తెల బెడంగు"ను, వారి నెఱవేరని కోర్కులను, వారి వలపుచిచ్చుల వెలుగులను, వారి వలకాకల హొయలును రవీంద్రుడు చూపినాడు. చరిత్రలో దాగిన అరేబియా భామినుల, పర్షియా సుందరీమణుల హృదయ వ్యధలను, భగ్నాశలను, రాగభోగములను, సాధనములుగా చేసికొని రవీంద్రుడీ కథాసౌధమును నిర్మించెను. ఆ మహమ్మదీయ సౌధ పాషాణములలో ఏ మదవతి మానక్రోధములు, ఏ సుందరి హావభావవిలాసములు, ఏ జవ్వని కిలికించితమోట్టాయితములు ముద్దకట్టి మూలుగుచున్నవో ఎవరికి తెలియును—రవీంద్రుని వంటి భావుకునకు తప్ప. ఎర్నెస్ట్ రీన్ వాక్యములను వినుడు.

# రవీంద్రుని కథాకథన మార్మికత

"When we think" says Ernest Rhys "of places on which romance has breathed the spell of a past crowded with apparitions and filled with half-realizable memories,...We shall feel tempted after reading the story of the Hungry Stones, to add the palace of Barich to their number."

(The Great Sentinel. Page. 196)

కాని యీ కథలో ఒక మహావిశేషమున్నది. ఏ జవరాలి భగ్నజీవితము ఇందు కథగా వర్ణింపబడలేదు. నిజము చెప్పవలయునన్న "హంగ్రీ స్టోన్స్" లో కథకంటె భావుకతయే స్పష్టముగా కొట్టవచ్చినట్లు కన్పించును. ఒకవేళ యీ మ్లేచ్ఛులమేడలో జరిగిన యొక కథనే రవీంద్రుడు చెప్పియున్నచో దానిలో సొగసేమియు నుండెడిదికాదు. ఏవో కొన్నిఅంశములను మాత్రము స్థూలముగా వర్ణించి పాఠకులను గంధర్వలోకమునకు కొనిపోయి పరవశింపజేసిన కథకచక్రవర్తి రవీంద్రుడు. ఉద్యోగవశమున ఆ హర్మ్యములో నున్నవాని హృదయము ఏట్టిఅనుభవములను పొందినదో వర్ణించుటయే రవీంద్రుని ఉద్దేశ్యము. చరిత్రప్రసిద్ధి పొందిన ప్రదేశములలోని శిధిల నిర్మాణములను వీక్షించినపుడు భావుకుని మనస్సులో జనించు ఊహాలే "హంగ్రీస్టోన్స్" కథాగోపురమునకు పునాదిరాళ్లు. ఈ కథను చెప్పు వ్యక్తి ఆ మేడలో ఒకనాడు హంసతూలికాతల్పముపై అధిష్టించిన పర్షియ విలాసవతిని, రతనములు పొదిగిన ఆమె కటారిని, ఆమె పట్టుపైజమాలను, ముత్యాల కంచుకమును, నవరత్న ఖచితమయిన మేలి సమ్మాళిగలను చూచును. పట్టపగలు కనరాని యీ సౌందర్యప్రపంచము నిశావేళల కన్పించుట పాఠకుల భ్రమను సాంద్రము చేయును. ఆ విలాసవతి అనామధేయ. ఆమెకు చరిత్రలేదు. శిలలలో జీర్ణమయిన అవ్యక్త వాంఛలకు, అవిజ్ఞాత కామక్షుధకు ఆమె చిహ్నముగా నిలుచును. కథకు డామెకై కక్ష్యాంతరములలో అన్వేషించును. కాని అతనికామె కన్పింపదు. ఆమె కనులకు కన్పింపని ఆకృతి వహించిన హర్షరోమాంచము. ఆ సౌధములో, ఆ సౌధప్రాంత ప్రదేశములలో నేత్ర గోచరముగాని సౌందర్యము శ్రుతిగోచరముగాని మధుర సంగీతము, హృదయగోచరము గాని వెతలు మూర్తీభవించినవి. ఇంత జరిగిన ఆసౌధగాథను రవికవి మనకు చెప్పడు. ఈ కథను గూర్చి ఎస్. సి. సేన్‌గుప్త ఈ వాక్యములు వ్రాసినాడు.

"The author's principal achievement consists in the manner in which he maintains the balance between a delicate flutter and hard reality, in the way he gives the womenly charm without portraying a woman"

(The Great Sentinel, Page. 196)

కాలగర్భములో కలిసిపోయిన చరిత్ర విపంచిక వెలువరించిన ఒక మధుర సౌందర్యవిషాదనాదము "హంగ్రీ స్టోన్స్" (క్షుధితపాషాణ్).

రవీంద్రుని కవిత్వమునకు ప్రాణభూతమయిన కవితాంగము ప్రకృతివర్ణనము. ఆయన రచించిన కావ్యములు ప్రకృతి వర్ణనామయములు. రవీంద్రుడు ప్రకృతిలో మైత్రిని, ఆదరానురాగములను కురియించు మిత్రుని చూచినాడు. మానవుని భావ ప్రపంచమును ఆయన ప్రకృతికి ఆరోపించినాడు. మనుజుని ద్వంద్వప్రకృతిని రవి కవి ప్రకృతిలో దర్శించెను. మానవజీవనములో అతిసామాన్య సన్నివేశములకు వెనుక నున్న రాగద్వేషములను, వాత్సల్యమును, బహూకార నికారములను, మమకార తిరస్కారములను బట్టబయలు చేసిన ద్రష్ట ఆయన. రవీంద్రుని కథాసాహిత్యములో మనకు కన్పించున దీ దర్శనమే. ప్రకృతి దృశ్యములకు, మానవుని అంతఃకరణ ప్రవృత్తికి మధ్య గల గాఢానుబంధమును ఆయన కథలతో సొగసులు చిమ్మునట్లు వర్ణించును. సందర్భోచితముగా పొందుపరచును. "శేషేర్ రాత్రి" అను కథలో జోతిన్ ఆకాశమువైపు చూపు సారించును. మణి అమర యువతిగా, నక్షత్రములు విశ్వమాత మణిపై చల్లు ఆశీస్సుములుగా అత డూహించును. తన భార్యమోమును చీకటి ముసుగునుండి మరల ప్రప్రథమముగా చూచుచున్నట్లు అతడు భావించును. మహా రాత్రియంతయు మణి కలువకన్నుల వలపు చూపులతో నిండిపోయినట్లుగా ఆ నిర్భాగ్యుడు తలపోయును. "దృష్టిదాన్" అను కథలో అంధురాలయిన కథానాయిక అంతర్దృష్టి కలిగినదై సర్వశరీరాంగములతో ప్రకృతి సౌందర్యమును స్పృశించి పరవశించుచున్నట్లు రవీంద్రుడు వర్ణించును.

"ఏక్‌రాత్రి" (The Supreme Night) అను కథలో ప్రకృతి ప్రధానస్థాన మాక్రమించినది. ఇది యొక ప్రణయగాథ. ఆ ప్రణయము ప్రకృతివలన పరమపవిత్రమైనది. ఈ కథను చెప్పుచున్న యతడే కథానాయకుడు. అతడు చిన్నప్పటినుండియు సురబాల నెఱుగును. ఇతని శీలములో నొక దోషము కలదు. ఏ కాలమునం దేపని చేయవలయునో దానిని చేయడు. అంతయు మించిపోయిన పిదప పశ్చాత్తాప పడును. మానవసంఘమంతయు తప్పులతడక యనియు, సకాలములో చేయవలసిన పనులు చేయక అవకాశము జారిపోయిన తరువాత మానవుడు రిక్తవాంఛలతో గుండె బ్రద్దలు చేసుకొనుననియు నతడే కథలో నొకచోట భావించును. కాని యతడు గూడ ఈ భావన కతీతుడు కాడు. బాల్యదశలో అతడు సురబాలా సౌందర్యా

కృష్టుడు కాలేదు. అమెపట్ల ఉదాసీనముగా ప్రవర్తించును. అతని జీవనలక్ష్యము భిన్నమైనది. ఫలితము సురబాల మరొకరి సొత్తగుట. ఉత్తమదేశభక్తుడు కావలె నను కొన్న అతడు చివరకు ఉపాధ్యాయు డగును. సురబాలా కుటుంబమున్న యూరనే యతడుద్యోగము చేయుచుండును. ఒకసారి పెనుగాలి చెలరేగినది. కార్మొయిళ్లు నింగిని పల్లటీలు కొట్టినవి. కడవపోతగా జడి పెచ్చరిల్లినది. కథకుని మనస్సు సురబాలను గూర్చి యాలోచించును. ఒకటి, రెండు సారులు అత డిదివరకు సురబాల యింటికి వెళ్లను. గుండె లోతులలో దాగిన వలపుబుగ్గ ఒక్కసారిగా అతనిలో పెల్లుబుకును. 'ఈ వలపు క్షుద్ర వాంఛా సమన్వితముగాదు. అతడు సురబాలతో మాటాడడు. మాటాడుటకు ప్రయత్నింపడు. మమకారము నింగి దాకుచున్నది. గాలివాన లోకము నుత్పాత లూగించునపుడు అతని మనస్సు సురబాలపైకి పోయినది. ఇంతలో పెద్దఝుప్పెన వచ్చును. అతడు సురబాలా గృహాభిముఖుడై పరువెత్తును. విచిత్ర మేమనగా సురబాల యితనికొఱకు బయలుదేరును. ఇద్దరొక లంకపై మూడు గజముల వైశాల్యము గలదానిపై ఎదురుపడుదురు. చుట్టు జలప్రళయములు! మాటలు లేవు. వలపు గొంతువాకిటిని మూసినది. ఇరువురు ప్రకృతిసంవర్తకాల తాండవమున గాఢాంధ తమస్సులను వీక్షించుచుందురు. వారి కాళ్ల దగ్గఱ మృత్యురూప జల ప్రవాహము సుడులువాఱుచుండును. ఇంకొక యలయే పొంగి వచ్చినచో ఇరువురు జలసమాధిగతు లయ్యెడివారు. కాని యట్లు జరుగలేదు. మరునాటి ప్రొద్దున ప్రకృతిప్రసన్నరూపమైన పిదప వారు తమ తమ యిండ్లకు వెళ్లిరి. ఏనాటినుండియో గుండెలో నిండియున్న కోర్కులతనికీ ప్రకృతిసంక్షోభ సమయమునగాని నెఱవేఱలేదు. అతడు స్వర్గీయానందము అనుభవించును. అందువలన అది అతని పాలిటి చరమరాత్రి యైనది.

"ది హంగ్రీ సోన్స్" కథలో కథకునకు నిశా సమయమున గాని విచిత్రానుభవములు కలుగలేదు. ప్రకృతి, ఆ సుందరసౌధము రెండు నొకటియై గతించిన కన్నెల భగ్నప్రణయమును ప్రాణవంతముగా చేయును. కొన్ని సన్నివేశములలో ప్రకృతి అసాధారణ కార్యములకు కారణ మయినది. ఒకానొక సాయంసమయమున కథానాయకుడు భవనమునుండి పోదలచెను. అదృశ్యమూర్తు లెంతగా బతిమాలి నను అతడు బయలుదేరును. హఠాత్తుగా ఏటి యిసుకతో నిండిన సుడిగాలి వీచి యతని కోటును, టోపీని ఎగురగొట్టును. అతనిని ఎగతాళిచేయు నవ్వుల కలకలలు దెసల మార్మ్రోగినవి. మఱునాటి మునిమాపున కథానాయకుడు కనులకు కన్పింపక తనను ఉవ్విళ్లూరించు కన్నెపిల్లను కాదనగూడదని నిశ్చయించుకొనును. అప్పుడే రెండు కన్నీటి బొట్లు అతని నుదుటిపై పడును. ఈ భాష్పకణము లెక్కడివి ? అతనిని క్షమించిన అదృశ్యరూప రాల్చిన అశ్రుకణములా ? లేక అప్పు డాకసమున క్రమ్మిన మొయిళ్లు రాల్చిన నీటిచుక్కలా ? రెండవయూహ నిజమని నమ్మినన్ కథానాయకుడా అగోచరకు లొంగిపోవ నిశ్చయించినప్పుడే మొయిళ్లేల నీటిచుక్కలు రాల్చినవి ? ప్రకృతి, ఆ ప్రాసాదము ఆ అదృశ్యమూర్తికి తోడ్పడుచుండెనా ? ఏమో !

"శుభ" యను కథ యుత్తమ మయినది. దీని యందలి కథ సాంద్రముగాదు. మానవునకు ప్రకృతికి మధ్య గల గాఢానుబంధమును సాక్షాత్కరింపజేయుటయే యీ కథా ప్రయోజనము. ప్రకృతి తాదాత్మ్యమును పొందుటకు మానవాత్మ యెట్లారాటపడునో యీ కథ మనోహరముగా చెప్పుచున్నది. ప్రకృతి సంభాషణాచతుర గాదు. మానవుడు మాటలు నేర్చిన గడుసరి. మరి యీ యిరువురకు పొత్తెట్లు బిగియును ? మానవుడు కూడ ప్రకృతి మాదిరిగా మూగవా డయినచో నతనికి దానితో తాదాత్మ్యము కల్గును. దీనికి తార్కాణము వాణీకాంతుని కుమార్తె యయిన "శుభ". ఆమె మూగపిల్ల. అయిననేమి ? ప్రకృతిలో లీనముకాగల దామె. నదితో సరసములాడు నామె, జంతువులతో—మేకలతో, ఆవులతో—సంభాషించు నామె, మూగపిల్ల యవుటచే ఆమెకు మనుష్యులతోడి పొత్తు అశక్యము. ఆమెకు తగిన చెలి ప్రకృతి. ఏలయన ప్రకృతి కూడ మాటలాడ జాలనిదే కదా ? వా రిరువురి మనోగత భావములు సహజ సుందరములు. వారు స్పష్టముగా పరస్పరాభిప్రాయములను అర్థము చేసికో గల్గుదురు. ఎర్నెస్ట్ రీస్ మహాశయు డిట్లనినాడు.

"In such tales, Rabindranath confesses as he does in his songs, his belief in the identity of Nature and man, of nature and Supernature."

(The Great Sentinel, Page. 194)

రవీంద్రుడు వ్రాసిన కథలలో కొన్నిటియందు అమానుష సంఘటనలు జరుగుచుండును. "ఇన్ ది నైట్" అను కథను సమీక్షించునపు డీ విషయమును కొంత వివరించితిమి. "ది లాస్ట్ జ్యుయెల్స్" అను కథలో కూడ ఒకానొక అమానుష సంఘటనము బలీయముగా గోచరించును. మణి తన నగల నన్నిటిని దీసికొని అత్తగారి యింటినుండి వెళ్లిపోవును. పోవునపు డొక గుమాస్తాను, ఆ గృహమున పనిచేయుచున్న వానిని తోడుగా తీసుకొని పోవును. ఆ గుమాస్తా పేరు మధు. మణి తిరిగి అత్తగారి యింటికి రాలేదు. మధు ఏమయిపోయినాడో యెవరికి తెలియదు. అతడు మణిని తాముప్రమాణము చేయుచున్న పడవనుండి నదిలోకి నెట్టి నగలతో పరారి యయ్యెనేమో ! రాత్రివేళల మణి భర్త యగు భూషణునకు నగలచప్పుడు విన్పించును. ఎవరో తలుపు తట్టినట్లుండును. మణి పడవ యెక్కిన రేవు నుండి ఆ ధ్వని వచ్చుచున్నట్లుండును. ఒకనాటి రేయి

# రవీంద్రుని కథాకథన మార్మికత

గుడ్డివెన్నెలలో సర్వాంగములయందు నగలు ధరించిన యొక యస్థిపంజరము వచ్చి భూషణుని యేటి దగ్గఱకు మఱపించి తీసుకొనిపోవును. భూషణుడు నదిలో పడి మరణించును. ఈ యస్థిపంజర మేమిటి ? అది కేవలము భూషణుని భ్రమప్రమాద జనితమా ? లేక నిజముగా పితృలోకములనుండి మఱి భూమి కవతరించినదా ?

అవిధమయిన కథయే "కంకాళ్" అనునది కూడ. ఇది యొక అమానుషగాథ. కథాకథన సమయము అర్ధరాత్రము. కథకురాలు ఒక దయ్యము. ఐనప్పటికి కథాగత విషయము మాత్రము మానవలోక సంబంధి. భగ్నప్రేమ, కథకు మూలాధారము. ఆమె త్రిలోకీ సుందరి. కాని వితంతువు. ఆమె శేఖర్ అనునొక వైద్యుని ప్రేమించినది. ఈ ప్రేమ ఫలవంతముగాదు. శేఖర్ మఱొకరిని పెండ్లాడబోవును. ఆమె హృదయము విద్వేషజ్వాలలను వెళ్ళగక్కను. పానీయములో విషము కలిపి వైద్యున కిచ్చును. ఆమెయు విషము త్రాగి మరణించును. అతిలోక సౌందర్యము సర్వ వినాశనములో విజయము పొందినది. ఆమె యస్థిపంజరమును జూపి వైద్యశాస్త్రోపన్యాసకుడు విద్యార్థులకు శరీర శాస్త్రము బోధించును.

రవీంద్రుడు వ్యంగ్యప్రధానముగు, అవహేళనామయమయిన కథలు కొన్ని రచించెను. వానిలో "ది పారెట్స్ ట్రైనింగు", "ది ఓల్డ్‌మన్స్ ఘోస్ట్" ముఖ్యమయినవి. వానిలో మొదటిది నవీన విద్యావిధానమును తీవ్రముగా హేళనచేయును. రెండవది ప్రాచీన సంప్రదాయములకు దాసులై, వర్తమానమును మఱచి భవిష్యత్కాలము నుపేక్షించువారిని హేళనము చేసిన కథ. ఎట్టి కథ రచించినను రవీంద్రుడు కథాకథనరీతినే అనుసరించినాడు. రవీంద్రుని కథలలో నాటకీయత అల్పము. ఆయనయే కథను చెప్పుచుండును. పాత్రల చిత్తవృత్తిని, చేష్టలను వర్ణించును. పాత్రలు—ఆయన కథలలో—చేష్టలవలన వాక్కులవలన తమ స్వభావమును ప్రకటింపవు. అట్లు ప్రకటింపవలయునన్న కథారచయిత పరోక్షముగా నుండవలయును. రవీంద్రుడు పురాణమును చెప్పు పౌరాణికుని వలె కథను నడిపించును.

రసదృష్టి తో పరిశీలించినపుడు రవీంద్రుడు కరుణరసమునకే తన కథలలో ప్రధానస్థానము కల్పించినాడు. భవభూతి యుత్తరరామ చరిత్రములో ఈ క్రింది విధముగా చెప్పినాడు.

> ఏకోరసః కరుణఏవ నిమిత్త భేదా
> ద్భిన్నః పృథక్పృ థగివాశ్రయతే వివర్తాన్
> ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారాన్
> అంభో యథా సలిలమేవ హి తత్సమస్తమ్.
>
> (ఉ. రా. 3 అం. 47 శ్లో)

(కరుణరసము ఒక్కటియే రసము. నీరు బుడగలుగా, సుడులుగా, అలలుగా కన్పింపవచ్చును. రూప మేదియయినను వాని యన్నిట నున్నది నీరే. అట్లే కరుణమే నిమిత్తభేదమునుబట్టి భిన్నరసములుగా పరిగణింపబడును. లోకమంతయు శోకముతో నిండియున్నది. కాని యిదియే నిమిత్తభేదముచేత శృంగారాద్యన్యతమముగా కన్పించును. శృంగారాదులు తాత్కాలిక సుఖకారులయినను అవి చివరకు శోకముగా పరిణమించును. ఆవర్తాదు లన్నియు జలరూపములై యుండునట్లు శృంగారాదిరసము లన్నియు కరుణరూపములై యుండునన్నమాట. ఇది భవభూతి తీర్పు. రసమనుభవింపునపుడు మనస్సు కరగి (చిత్త విద్రుతి) పోవును. అట్టి చిత్తవిద్రుతి యెక్కువగా కరుణరసమునందే కలుగును. కావున అది యొకటే రసము. "విశ్వనాథునకు బూర్వుడగు నారాయణుడు రసానుభవకాలమునం జిత్త విస్తారము గలుగు ననెను. భవభూతి చిత్తవిద్రుతి గలుగు ననెను. భోజుడు చిత్తవికాసము కలుగుననెను. ఈ భేదముచే వారు క్రమముగా అద్భుతమును, కరుణమును, శృంగారమును ప్రధానముగాఁ బేర్కొనిరి."

రవీంద్రుని కథలలోని పాత్రలు కరుణము స్థాయిభావమయిన శోకమునకు ఆలంబనములు. పధిక్ చక్రవర్తి, రాయ్‌చరన్, జోతిన్, శుభ, రతన్, నీలకంఠుడు, మహామాయ, క్షీరద మున్నగు పాత్రల స్థితిగతులను పరిశీలించినపుడు పాఠకులకు చిత్త విద్రుతి మాత్రమే కలుగును. వీరిలో కొందఱు మూఢాచారములకు బలి యయినవారు. మఱికొందఱు సంఘదౌష్ట్యమునకు, దురన్యాయములకు బలి యయినవారు. ఇంక కొందఱు పాశవిక ప్రవృత్తికి, అవివేకమునకు బలి యయినవారు. తల్లిదండ్రుల, భర్తల, తోడివారల స్వార్థము వలన నలిగిపోయిన బిడ్డలు, భార్యలు, స్త్రీపురుషులు రవీంద్రుని కథలలో కన్పింతురు. వారి శోకావేశములు ఆ కథలలో అడుగడుగున ప్రతివాక్యములో, ప్రతి శబ్దములో మనకు గోచరించును.

రవీంద్రునకు ఒకసారి మహాజ్ఞాన ప్రకాశానుభవము కలిగినది. జగత్సత్యము గోచరించినది. ఆ యనుభవకాలమునుండి తన జీవనగతి పూర్తిగా మారిపోయినట్లు చెప్పుకొనినా డాయన. ప్రపంచములో వైవిధ్యము, భేదమ్ము పైకి మాత్రమే కన్పించుచున్నవి. కాని లోతునకుపోయి చూచినచో ఈ వైవిధ్యములలో, ఈ భేదములలో ఒక ఐక్యభావ మున్నట్లు అనుభవసిద్ధ మగును. ఈ యైక్యభావము సరస్వతీ నది వంటిది. ఈ యైక్య భావమునీరు దర్శించినవా డగుటచేతనే రవీంద్రుడు మానవ హృదయాంతరాళములను అభేద్యములుగా నున్న

వానిని పరిశోధించి అవిజ్ఞాతసత్యానుభవములను రసభావావేశములను కనుగొని కథలలో చిత్రించినాడు. ఇట్టి దర్శనము మనకు తదితరులలో కనరాదు. ఇట్టి దర్శనము కలిగినవానికి ప్రపంచమునందు ద్వైతభావము గోచరింపదు. సర్వమానవుల జీవనములు సుందరములుగా సాక్షాత్కరించును. అట్టి సౌందర్య సాక్షాత్కారము గల కథలు కావుననే రవీంద్రుని కథలు జగత్ప్రసిద్ధి నందినవి. రసపోషణములో, సంవిధానములో ఆయనకథలు ఏ విశ్వవిఖ్యాతకథకుని కథలకు లొచ్చుగావు. ధూర్జటి ప్రసాద ముఖర్జీ యేమన్నాడో చూడుడు.

"Really speaking, Tagore the story-teller is a master-craftsman. The beginning, the middle and the end are clearly conceived. Almost every story has a plot. The style is one of narration, and never errs on the side of over-statement. And the contents range from the village postmaster and the poor private tutor to the dying aristocrat."

మానవుడు చంద్రగోళమునకు ప్రయాణము చేయవచ్చును. భూగర్భమును ఛేదింపవచ్చును. కాని యతడు ప్రకృతి సౌందర్యమును సాక్షాత్కరింప జేసికొననినాడు, ప్రకృతి తాదాత్మ్యమును పొందనినాడు సమస్తవిజ్ఞానశాస్త్ర పరిశోధనములు నిష్ప్రయోజన కరములే. మనుష్యుని అగాధహృదయములను పరిశీలింపనినాడు అంతరిక్ష పరిశోధనము వలన ప్రయోజన మేమి ? మానవుని ఆవేదనలను అర్థము చేసుకొననినాడు విజ్ఞానశాస్త్రప్రయోగములలోని విశేష మెయ్యది ? మానవునకు, ప్రకృతికి మధ్య యుగయుగాల నుండి యేర్పడిన అవినాభావ సంబంధమును దర్శించి సామాన్య సన్నివేశములను ఆధారముగ్గా చేసికొని చాటినవాడు విశ్వకవి. ఇదియే ఆయన లోకమున కిచ్చిన తపోవన సందేశము. శ్రీమతి స్టైక్స్ వ్రాసిన వాక్యాలు రవీంద్రుని కథా కావ్యాలకు చిర స్మరణీయ భాష్యములు.

"The greatness of Rabindranath's little stories lies in the beautiful simplicity and understanding with which they are told. They are all filled with the light of the vision which he had seen so long before in Calcutta—the vision which showed him the glory hidden in common lives, and the Joy which flows from nature to man."

# నాటకోత్సవము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

గిరి : ఏమిరా హరీ. నాకు నాటకాలు చూపిస్తానన్నావ్. బలేవాడవు. వీధి నాటకాలు చూపించావు; అవి యక్షగానా లన్నావు; అవే నాటకా లన్నావు.

హరి : తంజావూరులో అవ్వే నాటకా లనేవాళ్ళు.

గిరి : అది కాదోయ్. ఇప్పుడు సంస్కృతంలో కాళిదాసు, భవభూతి, మురారి నాటకాలు వ్రాశారు. అల్లాంటి నాటకాలు తెలుగులో లేవా ?

హరి : ఎందుకులేవు. ఉన్నవి.

గిరి : ఎక్కడ ఉన్నవి ? అన్నీ ప్రబంధాలే. యక్షగానా లొకటి నాటకాలని చూపించావు. తంజావూరునుంచి ఇవతలికి వచ్చాము. ఇక్కడకు వచ్చినా మళ్ళీ కావ్యాలే. మళ్ళీ పద్యాలే. నాకు విసుగెత్తిపోతున్నది.

హరి : ఇవ్వాళ్ల నాటకోత్సవం జరుగుతున్నది. అన్నినాటకాలూ ఒక్కరోజున చూపివేద్దువుగాని.

గిరి : అన్ని నాటకాలు ఒక్కరోజున ఎట్లా చూస్తాము ?

హరి : ఎట్లా చూస్తాము. గొప్ప విందుకు పిలిచా రనుకో. నాలుగు కూరలు పది పిండివంటలు చేశారు. తలా కాస్త నంజుకోవడమే.

గిరి : ఐతే పద పోదాం. నాటకాలన్నీ ఒక్కచోటనే ఆడుతున్నారా? పదిచోట్ల ఆడుతున్నారు? ఎట్లా చూడడం?

హరి : ప్రతి చోటుకీ వెళ్లేది, ఒక పద్యమో కొంత వచనమో విని వచ్చేది.

గిరి : తృప్తి కలుగుతుందా ?

హరి : తృప్తి ఎందుకురా. అన్నీ చూచామని అనిపించుకోవాలి గాని.

గిరి : సరేగాని, నువ్వీ నాటకాలుఎందుకు చూపిస్తున్నట్టు అబ్బాయ్ !

హరి : నీవు నాటకాలు నాటకాలని గోల కెత్తుతున్నావుగదా. అదీ కాక కృష్ణదేవరాయల నాటివరకూ పురాణాంధ్రీకరణ యుగం. రాయలనాడు ప్రబంధయుగం. తంజావూరు యక్షగానయుగం. తరువాత నాటకయుగం అంటాను.

గిరి : మరింకెవరైనా ఏమైనా అంటారేమో ?

హరి : వాళ్లవాళ్ల అభిమానాలకొద్దీ అంటారు. కొందరు తిరుపతి వేంకటేశ్వర యుగం అంటారు. కొందరు వేదం వేంకటరాయశాస్త్రి యుగం అంటారు. నేను నాటకయుగం అంటాను.

గిరి : మా బావ వీరేశలింగం యుగం అంటున్నాడు.

హరి : అట్లా అనటమే బాగుంటుంది. ఎందుచేతనంటే ఈ యుగంలో ప్రాచీనంగా ప్రబంధాలూ, పద్యాలూ వ్రాయటం అనుస్యూతంగా వస్తున్నా ఇంగ్లీషుభాష ప్రచరితమై ఆ భాషలో ఉండే అనేక సారస్వతశాఖలు మన భాషలోకి కూడా వచ్చినవి. వాటి నన్నింటిని తెలుగులోకి తెచ్చింది శ్రీ వీరేశలింగంపంతులుగారే. ఆయన ప్రహసనాలు, కవులజీవితాలు, గద్యప్రబంధాలు, నవలలు, జీవితచరిత్రలు, రకరకాలుగా వ్రాశాడు.

గిరి : సంఘ సంస్కారం చేయడం మూలంగా ఆయన కంత పేరు వచ్చింది తప్ప పెద్ద కవిగా నేను ఒప్పుకోను.

హరి : గుడ్డికన్ను మూస్తే ఎంత, తెరిస్తే ఎంత ?

గిరి : ఈమాట గుడ్డివాడు కూడ అనొప్పునోయ్.

హరి : మాటలునేర్చిన కుక్కను వేటకు తీసుకవెళ్లితే ఉజ్జో అంటే ఉజ్జో అందిట.

గిరి : వేటకు తీసుకువెళ్ళు. అది వేటేగామాలు పెద్ద అల్లరి జరుగుతున్నది.

హరి : వేటకాదు. వీరేశలింగం పంతులుగారు మొదటిసారి విధవావివాహం చేశారు. 1881 సెప్టెంబరు 11 వ తారీఖున రాత్రి; పెండ్లికుమారుడు గోగులపాటి శ్రీరాముడు; ఆ పెండ్లి కాకండా ఉండటంకోసం జనం చేస్తున్న అల్లరి.

గిరి : జరిగితే వీళ్ళ సొమ్మేం పోయింది.

హరి : అబ్బో. ఎంత గోల. గుంటూరులో భువనగిరి పరదేశి సోమయాజులు, బందరునుంచి గౌతం కోటీశ్వరరావు శాస్త్రి, మదరాసునుంచి కొక్కొండవెంకటరత్నం పంతులు, కాకినాడనుంచి ఓగిరాల జగన్నాథం, విశాఖపట్నంనుంచి దంతులూరి నారాయణగజపతి, రాజమండ్రి నుంచి వేదం వేంకటరాయశాస్త్రి వీళ్లందరూ వీరేశలింగం పంతులుగారి మీద కత్తికట్టారు. పంతులుగారికీ, వాళ్లకీ ఒకటే యుద్ధం. విధవావివాహాలు చెయ్యకూడదని వాళ్ళు, చెయ్యవచ్చునని ఈయన. ధర్మశాస్త్రాలు తిరగవేశారు. వాళ్ళ పత్రికలు పెట్టారు. వీళ్ళ పత్రికలు పెట్టారు. హోరాహోరి పోట్లాడుకుంటున్నారు.

గిరి : ఇంత యుద్ధంలోంచి వీరేశలింగం పంతులుగారు ఎట్లా బయటపడ్డారు ?

హరి : పైడా రామకృష్ణయ్యగారని కాకినాడలో జమీందారు. ఆయన వేలకొద్దీ డబ్బు ఇచ్చాడు. పంతులుగారి వాదం నెగ్గింది. పైగా రాజమహేంద్రవరంలోని విద్యార్థు లందరూ పంతులుగారి వైపే.

గిరి : ఇది సంఘసంస్కారయుద్ధమంటావా ? సారస్వతయుద్ధ మంటావా ?

హరి : రెండూ కలిసి జోడింపుగా జరిగినవి. సారస్వత యుద్ధంలో మాత్రం వీరేశలింగం పంతులుగారి విరోధుశే పైచేయిగా ఐనట్లు కనిపిస్తుంది. పూండ్ల రామకృష్ణయ్యగారు అముద్రిత గ్రంథచింతామణి అను ఒక మాసపత్రిక పెట్టారు. అటువంటి పత్రికలు చాలా వెలిసినవి. ఆ పత్రిక లానాడు భాషా సేవ చాలా చేసినవి. ఆయన, వేదం వేంకటరాయ శాస్త్రిగారు ఒకపక్షంవారు.

గిరి : వేంకటరాయశాస్త్రిగారి కొచ్చిన ప్రతిష్ఠ, వేంకట రత్నం పంతులుగారి ప్రసన్నరాఘవం విమర్శించడం మూలంగా వచ్చిందని విన్నాను. నిజమేనా ?

హరి : ఆయన గొప్పవిమర్శకుడే. తరువాత తరువాత ఆయన్ని ఆంధ్రమల్లినాథసూరి అన్నారు.

గిసి : ఆయనకీ వీరేశలింగం పంతులుగారికీ పడదా ?

హరి : పండితు లందరూ పూర్వసంప్రదాయం వాళ్ళు. పంతులుగారు బ్రహ్మసమాజం మతస్థులు. సంఘ మంతా కశ్మలంగా ఉంది. బాగుచెయ్యాలన్నవాడు. ఆయనది ఉత్తరధ్రువం, వీళ్లది దక్షిణధ్రువం.

గిరి : భాషలోకూడా సంస్కారం, తెచ్చారు కదూ ?

హరి : ఆయన గిడుగు రామమూర్తి పంతులుగారు. సంఘానికి వీరేశలింగం పంతులుగారు ఎట్లాంటివాడో, భాషకి ఆయన అట్లాంటివాడు. ఇద్దరూ కలిసి రెండు వైపుల ఉన్న కశ్మలంగా కడిగారు.

గిరి : ఒకే ! ఏమైనా చెప్పు. కశ్మలంతోపాటు కొంత మంచి కూడ పోతుంది.

హరి : క్రొత్తమంచి వస్తుంది. గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కమనే నాటకం వ్రాశారు. నీలగిరి పాటలని వ్రాశాడు. భవిష్యదాంధ్రకవులకు మార్గదర్శకము లైన రెండు మహాగ్రంథాలు వెలువడ్డవి.

గిరి : అప్పుడంత అల్లరి జరిగింది గనుక. సరేకాని వేటకి తీసుకవెళ్తానన్నావు. గొలుసులు, వేటకుక్కల్ని వర్ణించడం సరిపోతోంది. అసలు వేటని చూడడమే లేదు.

హరి : వేట అని ఇట్లా ఉంటుందని తెలీకుండా వెళ్లి ఏం లాభం ? వేటకుక్కలు పెద్దపులిని పట్టుకుంటవి. పులి గర్జిస్తూ ఉంటుంది. భయపడి పారిపోయి వస్తే వేటని ఏమి చూసినట్లు. అప్పుడు పులి మన మీదికి రావేరాదు .... అది కుక్కల్తో తట్టుకోలేక బాధ పడుతూ ఉంటుంది. మనం నిర్భయంగా చూడవచ్చు. ఆ సంగతి తెలుసుకొని వేటకి వెళ్లాలి.

గిరి : సరే చెప్పు.

హరి : ఈ కాలంలో అనేకములైన సాహిత్యశాఖలకు వీరేశలింగం పంతులుగారు బాట వేశారని చెప్పా కదా మొట్టమొదట. తెలుగు నవల వ్రాసింది ఆయన. దానిపేరు రాజశేఖరచరిత్రము. గోదావరి రేవులో నీళ్ళు తీసుక వెళ్లడానికి వచ్చిన స్త్రీలు మాట్లాడు కోవడం, వాళ్ల ఇళ్లల్లో ఉన్న బాధలు చెప్పుకోవడం, దానితో సంఘముయొక్క స్థితి ప్రతిబింబించడం ఎంతో బాగా వ్రాశాడు. దానినిబట్టి ఇతరులు నవ లలు వ్రాశారు.

గిరి : అంటే ఆయన నవలే గొప్పదన్నమాట. ఆయన మంచి వచనం వ్రాస్తాడా ?

హరి : ఆయనకి గద్యతిక్కన్న అని పేరు.

గిరి : అబ్బాయి బుకాయించకు. విన్నడుగుతున్నా కదా అని నేను పుస్తకాలు చదవలేదనుకోకు. నేను చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారి నవలలు చదివాను. హేమలత, రామచంద్ర విజయం, కర్పూరమంజరి, సౌందర్య తిలక. అట్లాంటి నవలలు నేను కాదు కదా, నీవు కూడా వ్రాయలేవు. ఆ వచనము తేనెపాక మనుకో.

హరి : ఆయనవచన మేమిటోయ్. ఆయన పద్యం కూడా తేనెపాకమే. ఆయన హృదయమే తేనెపాకం. ఆయన వ్రాసిన గయోపాఖ్యానంమీద కొన్నిలక్షలు వచ్చినవి. ఆయన డబ్బంతా పేద సంసారాలకే పెట్టాడు. ఆయన వంటి దాత కవులమొత్తంమీద ఆ యుగంలో లేడు.

గిరి : కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారులేరా ?

హరి : ఆయనకు కోపమన్నా ఉండేది. ఈయనకి అదికూడా లేదు.

గిరి : ఇంకా నవల లెవరు వ్రాశారు ?

హరి : వేంకట పార్వతీశ్వరకవులు వ్రాశారు. కాని వారు వ్రాసిన నవలల్లో ఎక్కువ భాగం బెంగాలీ, హిందీ నవలల తర్జుమాలు.

గిరి : అయితే ఏం ? తిరుపతి వేంకటేశ్వరకవులు తమ మెత్తని పద్యాలతో, అవధానాలతో, నానారాజసందర్శనంతో దేశంలో జనానికి తెనుగు పద్యమంటే ఎంత రుచికల్పించారో, వేంకటపార్వతీశ్వర కవులు తమ నవలలతో జనానికి నవలలు చదవడమంటే అంత రుచి కల్పించారు.

హరి : అంతేకాదు. వారు పద్యాలూ వ్రాశారు. టాగూరు గీతాంజలివంటి గ్రంథాలు వ్రాశారు.

గిరి : సరేగాని మన వేటమాట ఏం చేశావు ?

హరి : ఎక్కడ మొదలు పెడదాం ?

గిరి : అటునుంచి నరుక్కురా.

హరి : అయితే ధర్మవరం కృష్ణమాచార్యులతో మొదలెడదాం. ఆయన ఆంధ్రనాటకకవితాపితామహుడు. ఇంగ్లీషులో షేక్స్‌పియర్ ఎన్ని నాటకాలు వ్రాశాడో తెలుగులో ఆయన అన్ని నాటకాలు వ్రాశారు. వాటన్నింటిలో చిత్రనళీయం చూడామణి వంటిది. ఆ నాటకం ఇక్కడాడుతున్నారు. వెడదామా ?

గిరి : పద పోదాం.

* * * *

(పద్యం—దమయంతి.)

సురసందేశహరా; ఇదే సరసమా
శుద్ధాంత కాంతాళితో;
ధర నా దైవముగాఁగ గొల్చు నల భూ
దారుండు నీ వన్న యు
ట్లురలం ద్రోచినఁ గూపము ల్గలుగవే
యొక్కింత త్రాడుండదే
గరళంబున్ గఱవయ్యెనే యకట ఖ
డ్గంబైన జేజిక్కదే.

* * * *

గిరి : ఎవరయ్యా చదివేది ?

హరి : ముప్పిడి జగ్గరాజుగారు. ఆయన దమయంతీవేషం. ఆ పద్యం చదువుతున్నారు.

గిరి : అదేం రాగం ?

హరి : నీలాంబరి.

గిరి : ఆయన గొప్ప నటకుడా ?

హరి : గొప్ప నటకుడా? ఏమి ప్రశ్నవోయ్. 'ద్వీపాంతంబున నుండి వచ్చితివ భూదేవా ?' అన్నట్లు మాట్లాడుతున్నావు. ముప్పిడి జగ్గరాజంటే సాత్త్వికభావ ప్రకటనలో భరతాచార్యు డన్నమాట.

గిరి : సరే. ఇంకో నాటకం దగ్గరికి పోదాం.

హరి : ఓయీ నాటకమంతా చూడవద్దా. ఆ కృష్ణమాచార్యులుగారు నాటకంలో సంభాషణలు వినాలి. మరీ చివర బాహుకుడు అంటే నలుడు వంటచేస్తూ ఉండగా దమయంతి చెలికత్తె వస్తుంది. అతడు నలుడౌనో కాదో కనుక్కోమని దమయంతి పంపించింది. వాళ్ల ఇద్దరి సంభాషణ వినాలి.

గిరి : ఇట్లా ఒకచోట కూర్చుంటే ఎట్లా తెములుతుంది ? అట్లా వినాలంటే నాటకోత్సవానికి రాకూడదు. విడివిడిగా పోయి చూడాలి.

హరి : అయితే గయోపాఖ్యానం పోయి చూద్దామా ?

గిరి : ప్రతి పట్టణంలో ప్రతిపల్లెటూళ్లో ఆడే నాటకాన్ని చూడట మెందుకు? ఎవళ్లయినా నలుగురు కంపెనీగా చేరి నాటక మాడదామంటే ఆడేదే గయోపాఖ్యానమాయె. దాన్నిక్కడ చూడ్డమెందుకు ?

హరి : అయితే ఇచ్ఛాపురపుయజ్ఞనారాయణశాస్త్రులుగారని రసపుత్రవిజయమని వ్రాశారు. ఆ నాటకం ఒకటి చాలమంది ఆడుతూ ఉంటారు. అదిచూద్దామా ?

గిరి : అది నేను చూచాను. ఇంకో నాటకం చూద్దాం పద.

హరి : అయితే రా.

* * * *

(వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారంలో భీముడు పద్యం.)

తల్లడమందఁ గౌరవ శ
తంబును బట్టియనిన్మథింపనా ?
ప్రెల్లదు దుస్ససేను రుధి
రంబు నురంబును వ్రచ్చి త్రావనా ?
పెల్లుమనన్ సుయోధనుని
పెందొడలన్ గద నుగ్గుసేయనా ?
యూ ళ్లయిదింటితో నృపతి
యొప్పుగఁ జేసెడుఁగాక సంధులన్.

గిరి : ఎవరయ్యా. ఆ చదివేది ?

హరి : భీముడు. ఆ కంపెనీవాళ్లది బందరు. ఆయన పేరు పెదన సుబ్బయ్యగారు. ఆయన గొంతుక పెద్ద తూములోంచి నీళ్ల వదలినట్లు ఉంటుంది. అది వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారం నాటకం. సుబ్బారాయుడుగారు చాలా సంస్కృతనాటకాలు తెనిగించారు. తెనిగించడమంటే ఆశ్చర్యంగా తెనిగించారు. గొప్ప పండితుడు. పద్యరచనాశిల్పం వారికి తెలిసినంత ఆ కాలంలో ఇంకొకరికి తెలియదూ అంటే పెద్దతప్పేమీ లేదు. అదిగో విను. భీముడు అంటున్నాడు.

* * * *

తతఘూర్ణద్ఘట వార్ధిమధ్య విలుఠ
న్మంథాచలధ్వాన ధీ
రత కోణాతతమై జగత్ప్రళయ గ
ర్జన్మేఘ సంఘట్టచం
డత కృష్ణోర్ణరుషాగ్రధూత కురు రా
ణ్ణాశంకర ప్రాయమై
సతి మచ్చింహ రవానుకారి రణని
స్వాణంబదే మ్రోగెడున్.

* * * *

హరి : సంస్కృతంలో వేణీసంహారం రచనాశిల్పంపండిన గ్రంథమని అలంకారికులు వ్రాశారు. ఆ అర్థమంతా సరిపోయేటట్లుగా సుబ్బారాయుడుగారి రచన ఉంటుంది.

గిరి : అబ్బాయ్ ! అల్లా ఎవర్నిగురించీ గొప్పగా చెప్పకు. మాత్సర్యగ్రస్తులు కుత్తుక పట్టుకుంటారు. ఇంకో నాటకం చూపించు.

* * * *

ధరణిలో దొంగతనములో దొరతనములొ
భాగ్యవంతున కేదైన బాధలేదు
పెన్నిధి యదృష్టమున నిరుపేదవాని
కబ్బినను దొంగతనమంట అబ్బురంబె.

* * *

గిరి : యిదేమి నాటకము ? ఆ చదివే దెవరు ?

హరి : ఇది హరిశ్చంద్ర నాటకము. వ్రాసినాయన బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. చిక్కనిపాకంలో పద్య మంత మధురంగా వ్రాసినాడు మరొకడు లేడనిచెప్పవచ్చు. ఆ హరిశ్చంద్రుడు వేసిన యాయన హరి ప్రసాదరావుగారు. వారిది గుంటూరు. ఆయన మహానాట్యశాలి. హరిశ్చంద్రుడు వేస్తే ఆయన్ని చూసేతీరాలి.

గిరి : మరి అయితే నేను పుట్టకముందాయన ఎందుకు చచ్చిపోయినాడు?

హరి : తరువాతవెళ్లి అడుగుదువుగానిలే.

గిరి : ఈ లక్ష్మీకాంతంగారు ఇంకేమన్నా నాటకాలువ్రాశారా?

హరి : బుద్ధిమతీ విలాసమని సిరియాళునికథవ్రాశారు. పామర్రు నాటకకంపెనీ అని ఒకటి ఉండేది. ఆ కంపెనీవాళ్లు రుక్మాంగదనాటక మారుతున్నారు పోయిచూద్దామా?

గిరి : ఆ నాటక మెవరు వ్రాశారు?

హరి : బేతపూడి భగవంతరావు అనివ్రాశారు.

* * * *

కొడుకును చంపెద నంచును
బుడబుడ లాడెదవు చంపుకో నాకేలా,
గుడిలోని లింగమూడిన
నడుమన గల నంబికేమి నష్టము చెప్పుమా?

* * * *

గిరి : ఎవరయ్యా. ఆ పాడేది! ఏమిసన్నని గొంతుక? ఏమి మధురమైన సంగీతము?

హరి : ఆయనపేరు ఉప్పలూరి సంజీవరావుగారు. ఆ పామర్రు కంపెనీలో ఆడవేషం వేశేవారు. హరిశ్చంద్రలో చంద్రమతి, బుద్ధిమతి విలాసంలో బుద్ధిమతి, రుక్మాంగదలో మోహిని వేశేవారు. ఆయన గొంతు బంగారు తీగతీసినట్లు ఉంటుంది. సరేగాని నీవు వద్దన్న గయోపాఖ్యానం దగ్గరికి వచ్చాము. లోపలికివెళ్దామంటే ఒక్కసారి వెళ్లివద్దాము.

* * * *

నీలకంధరమహానిశితశూలముధాటి
కోర్చిన నొకవేళ నోర్వవచ్చు
ప్రళయకాల పయోద భయద నిర్ఘాతాతి
సైచిననొకవేళ సైపవచ్చు
మృత్యుదేవతనోట రెండు కోఱల జిక్కి
బ్రతికిన నొకవేళ బ్రతుకవచ్చు
బాడబావలిశిఖాజ్వాలికావలి మ్రోల
నిల్చిన నొకవేళ నిలువవచ్చు
గాక సైరింపవచ్చునే కదనమందు
శివున కైనను శారదా ధవునకైన
గుహున కైనను శతకోటివహునకైన
జండతను సాటిలేని నా చక్రధాటి.

* * * *

గిరి : ఎవరయ్యా. అంత రమ్యంగాపద్యం చదువుతున్నాడు!

హరి : ఆయనపేరు మంజులూరి కృష్ణరావుగారు.

గిరి : సరేగాని. మనం చాలాదూరం ప్రయాణంచేశాం. అసలు వాళ్లని వదలిపెట్టాం. ఇక్కడికి వచ్చాం.

హరి : ఇది నాటకోత్సవంగా. అన్నినాటకాలు ఆడతారు. వరుస వెంటనే వస్తున్నాము.

గిరి : కొక్కొండ వేంకటరత్నంపంతులుగారు మహామహోపాధ్యాయుడుగదా. మా నాయనగారు ఆయన్నిచూచాడట. పొట్టిగా బక్కపలుచగా ఉండేవాడట. మెడలో నల్లని కోటుమీద ఒకవ్రరపట్టు డవాలా వంటిది వేసుకుని వాటిపైన జరీచేసిన బెండుతలపాగా పెట్టుకొని సభలలోకివచ్చేవాడట. ఆయన వ్రాసిన నాటకమేమీ ఆడటంలేదా?

హరి : బాగా చెప్పావు? ఆ నాటకాలని వేంకట్రాయ శాస్త్రిగారు చంపారు. నీతిచంద్రికలో మిత్రలాభం, మిత్రభేదం చిన్నయసూరి వ్రాయగా, కొక్కొండవారు విగ్రహము వ్రాశారు. దానిని వీరేశలింగం పంతులుగారు చంపారు.

గిరి : వీరేశలింగం పంతులుగారు సంధివిగ్రహాలు వ్రాశారు. అవిమాత్రం ఏమినిలిచినయ్.

హరి : చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ.

గిరి : అయితే వీరేశలింగం పంతులుగారు నాటకాలు వ్రాయలేదా?

హరి : సరిగ్గా అక్కడికేవచ్చాం. మైలవరం కంపెనీవారు, వారు తెలుగుచేసిన శాకుంతల నాటకమాడుతున్నారు. యడవల్లి సూర్యనారాయణగారు దుష్యంతుడు వేస్తారు. పద లోపలికి.

* * * *

చల్లనివై శ్రమంబుడప
జాలిన తామరపాకు వీవనల్
మెల్లన గొంచు వీచుదునొ
మిక్కిలి శీతలమైన వాయువుల్
నల్లలి తారుణాబ్జ సదృ
శంబగు నీచరణ ద్వయంబు నో
పల్లవపాణి నాతొడల
పైనిడి హాయిగ పట్టువాడనో.

*　　*　　*　　*

హరి : దుష్యంతుడు శకుంతలతో అంటున్నాడు.

గిరి : కవిత్వం మహాసొగసుగా ఉన్నదే.

హరి : ఆయనవ్రాసిన గ్రంథాలన్నింటిలో శాకుంతలానికే గొప్పపేరు వచ్చింది. అంతబాగా ఉంది గనుకనే వచ్చింది.

గిరి : వేదం వేంకటరాయశాస్త్రిగారు ఈయనకి విరోధి అంటివికదా. వారేదైనా గొప్పనాటకం వ్రాశారా?

హరి : అల్లా అడుగు. ఆయన రెండుమూడు నాటకాలువ్రాశారు. వాటిలో ప్రతాపరుద్రీయమన్న నాటకమున్నది. ఆ నాటకం చండప్రచండమైన నాటకం. అటువంటి నాటకం ఇంకో భాషలో ఉండదం టేనమ్ము.

గిరి : నువ్వు నమ్మమంటే నమ్మకచస్తానా? సరేకాని ఆయన కవిత్వం రాళ్ళు రప్పలల్లే ఉంటుందంటారే?

హరి : భావముయొక్క సొగసు తెలియనివాళ్లలాగే అంటారు.

*　　*　　*　　*

ఆయన గాలిని బేనును
తోయమతోనరకు
పొగలతో గోడలిడున్,
ఆయన ప్రయోగ మభినవ
తోయజభవసృష్టి పెంపది దుస్స్వప్నమగున్
నెట్టియొకడు నేను చెకుముకిశాస్త్రియు
కాలరుద్రుమూడు కనులభంగి,
ఏము ముప్పురమును మేల్కొనియుందుము
ప్రభువు సౌఖ్యనిద్ర బడయుగాక.

*　　*　　*　　*

గిరి : బాగానే ఉన్నయే పద్యాలు, ఎందుకు అల్లాఅంటారు?

హరి : అబ్బాయి, ఈ వీరేశలింగం యుగంలో తెలుగు కవులల్లో ఒక పెద్ద జాడ్యం పుట్టింది. ఒకళ్లంటే ఒకళ్లకి పడదు. అదే సంప్రదాయసిద్ధంగా వస్తూ౦దనుకో. రాజమహేంద్రవరంపో, వడ్డాది సుబ్బారాయుడుగారు తప్ప ఇంకొకడు కవి అంటే ఆ వూళ్లో నిమీదబడి కరుస్తారు. మచిలీపట్టణంలో తిరుపతి వేంకటేశ్వర కవులు కాక ఇంకొకర్ని కవులను నీ పీపు తాషామరపా మ్రోగిందే. నెల్లూరులో వేంకటరాయశాస్త్రిగారి మీద ఈగ వాలకూడదు. వారి నేమన్నా అన్నావా, పెన్న దాటితే పెరుమాళ్లసేవ .... అని ఉండనే ఉన్నది గదా, ఆ సేవ జరుగుతుంది.

గిరి : మన మావూరు వెళ్లడ మెందుకు, ఆ సేవ చేయించుకోవడ మెందుకు ? ఆ వూళ్లోనే అభినవతిక్కన శ్రీ దుర్భాక సుబ్రహ్మణ్యశర్మగారు ఉన్నారట.

హరి : బాగా జ్ఞాపకం చేశావు. ఆ సుబ్రహ్మణ్యశర్మగారి శిష్యులు బయలుదేరారయ్యా. ఏమి మధురమైన కవు లనుకుంటున్నావు. వేంకటరాయశాస్త్రిగారు గొప్పవారేగాని అంతమంది శిష్యులు ఆయనకు లేరు.

గిరి : మరి తిరుపతి వేంకటేశ్వరకవులు నాటకాలు వ్రాయలేదా ?

హరి : ఓయి బాబోయి, బలేమాట అన్నావు ? అదిగో పద పాండవోద్యోగవిజయా లాడుతున్నారు.

*　　*　　*　　*

అదిగో ద్వారక ఆలమంద లవుగో
అందందుకోరాడు న
య్యదియే కోట యవే యగడ్త లవె ర
థ్యల్ వారలే యాదవుల్
యదుసింహుండు వసించు మేడ అదిగో
ఆలోన దంతావళా
భ్యుదయంబై వరమందురాంతర తురం
గోచ్చండమై పర్విడున్.

*　　*　　*　　*

గిరి : ఆయన ఎవరోయ్. గొంతుక అంత గిరగిర తిరిగిపోతున్నది.

హరి : ఆయనపేరు బుర్రా రాఘవాచార్యులుగారు. ఆ నాటకాలల్లో ఆయన అర్జునుడు వేస్తాడు. ముంజులూరు కృష్ణారావుగారని సాక్షాత్తు భరతముని అని చెప్పాలి. సూత్రధారుడు అంటే ఆయననే అనాలి. అతనివంటి నటకుడు ఉంటాడో ఉండడో చెప్పలేము. ఎవరేనా ఒకటి రెండువేషాలు వేసి మెచ్చింప చేస్తారేమోకాని ఆయన ఈ వేషంవేసి మెప్పించగలడు. ఈ వేషంవేసి మెప్పించలేడు అని లేదు.

గిరి : ఆయన అంత మంచి సంగీతం పాడతాడా ?

హరి : అభినయించాలంటే సంగీతం కావాలా ?

గిరి : నాకేం తెలుసు ? నువ్వు నాటకాలచుట్టూ తీసుకవెళ్లుతూ పద్యాలు వినిపిస్తుంటే నేను సంగీతం కావాలను కున్నాను.

హరి : ఆ రోజులయిపోయినవోయ్. సాంఘిక నాటకాలు వస్తవి. వట్టి అభినయంమీదనే ఆధారపడి ఉండాలి. ఈ సంగీతాలు గింగీతాలు పనికిరావు .... సరే ఇంకొక చోటికి పోదాం.

హరి : వీళ్లు పిఠాపురంవాళ్లు. పానుగంటి లక్ష్మీనరసింహా రావుగారి నాటకాలాడుతున్నారు. ఆయన చాలా నాటకాలు వ్రాశాడు. రామాయణం ఐదు నాటకాలుగా వ్రాశారు. అనేక సాంఘిక నాటకాలు వ్రాశారు. కంఠాభరణమని ఒక నాటకం వ్రాశారు. ఆ నాటకా లొక ఎత్తున్నూ, ఆయన వ్రాసిన సాక్షి ఉపన్యాసా లొక ఎత్తున్నూ. శ్రీ వీరేశలింగం పంతులుగారి సాహిత్యమంతా సంఘసంస్కారాభిముఖంగా సంఘంలో ఉన్న దోషాలు నిరూపించడంకోసమే వ్రాయబడితే, లక్ష్మీనరసింహారావుగారి గ్రంథాలు సంఘంలో ఉన్న దోషాలు హాస్యరసం క్రింద మార్చడంకోసం చేయబడ్డవి.

మెఱుగు గుండలముల మిసమిసల్ గండ భా
గములపై నట్టిట్టు గంతులిడగ
రంగారు కటినుతిఢి బంగారు పుట్టంబు
చిరుబొజ్జనుండి కొంచెముగ జాఱ
బవనపూరణమున జవుజవ్వమని లేత
బుగ్గలు బూరెలై పూరడిల్ల
నిగనిగల్ గల గుజ్జుసిగనున్న శిఖిపింఛ
మొయ్యారమునఁ దలయూపుచుండ
నుత్తమోత్తమ జన్మమై యొప్పు మురళి
నధరమున మోప జలుజల్లు మనగ జగతి
గానమునుఁ జేయు కల్యాణ కాంతు లొలుకు
నీదు వదనంబుఁ జూపింపు నీరజాక్ష.

* * * *

హరి : ఇది రాధాకృష్ణనాటకంలోని పద్యము. వారితోపాటు కూచి నరసింహం పంతులుగారని ఉండేవారు. వారు గౌరాంగ చరిత్రము ప్రబంధంగా వ్రాశారు. గౌరాంగుడంటే చైతన్యస్వామి. నరసింహం పంతులుగారు గూడ నాటకాలు వ్రాశారు. వా రిద్దరూ ఒకరి నాటకాల కొకరు ప్రస్తావనలు వ్రాసుకునేవారు.

గిరి : వారేం నాటకాలు వ్రాశారేమిటి ?

హరి : రూపలత అని ఒక నాటకం వ్రాశారు. అది ఒక ఆశ్చర్యమైన నాటకం.

గిరి : నే నెప్పుడూ వినలేదే.

హరి : అబ్బాయి, అందరూ పుడతారు. తెలివిగల పిల్లలే కొందరు చిన్నప్పుడు చచ్చిపోతారు. ఒక సమర్థుడు పెరిగి లోకాన్ని సముద్ధరిస్తాడు. ఒక అసమర్థుడు పెద్దవాడై అదృష్టం బాగా ఉండి పెద్ద ఉద్యోగాలు చేస్తాడు. ఇంకొకడు సమర్థుడై ఉండి పేరూ, ప్రతిష్ఠలు లేకుండా పోతాడు. మరి ఒకనికి సామాన్యమైన సామర్థ్యంతోనే చాలా ప్రతిష్ఠవస్తుంది. ఈ లోకాన్ని గురించి ఎవరు చెప్పగలరు ? అల్లాగే సారస్వతంలో కూడాను. కవులకు అదృష్ట ముంటుంది. అల్లాగే వారువ్రాసిన గ్రంథాలకు కూడ అదృష్ట ముంటుంది. ఇంతకూ పెట్టిపుట్టాలి.

గిరి : పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు పిఠాపుర రాజాస్థానంలో ఉండేవారు కదా. ఆ ఆస్థానంలో ఇంకెవ్వరూ కవులు లేరా ?

హరి : ఎందుకు లేరయ్యా. దేవులపల్లి సుబ్బారాయశాస్త్రులుగారు, తమ్మన్నశాస్త్రుల్లుగారు అని ఇద్దరు గొప్ప పండితులు, మహాకవులు ఉన్నారు. వారు బహు గ్రంథములు వ్రాశారు. అందులో మణీంద్రవిజయమని ఒక గ్రంథం ఉన్నది. ఆ రచన ఆముక్తమాల్యదా రచనవలె ఉంటుంది. వారు పిఠాపురం రాజాగారిని సింహాసనంమీద నిలిపిన కవులు. ఆ వైపున ఇంకా కవులున్నారు. అనాదినుంచి అది కవులు పుట్టిన భూమి. ఆంధ్రకవితాసరస్వతి రాయలసీమను వదలిపెట్టి విజయనగర విశాఖపట్టణ ప్రాంతములలోనికి పోయింది. అడిదపు సూరకవి, తురగారామకవి, పిండిప్రోలు లక్ష్మణకవి, శిష్ట్లు కృష్ణమూర్తిశాస్త్రి మొదలైన మహాకవు లందరూ అక్కడే పుట్టారు. శ్రీ చెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అక్కడ పుట్టారు. చెల్లపిళ్లకవి బందరువాడనుకొనేవాళ్లు, ఆ సంగతినే మరచిపోతారు.

గిరి : అవైపు కవి ఇంకొకరి పేరు చెప్పు.

హరి : త్రిపురాన తమ్మయ్య దొరగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, పారనంది రామశాస్త్రిగారు, భద్రాద్రిరామశాస్త్రిగారు, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు, శృంగారకవి సర్వారాయ కవిగారు ....

గిరి : అబ్బాయి ఇంక ఆగు. నాకు తెలిసిపోయింది. అంతమంది ఉన్నారన్నమాట. ఇటువంటి సందర్భాలలో అందరి పేర్లు చెప్పడం కష్టం. కొన్ని చెప్పి కొన్ని మానేశామా నెత్తికి తెచ్చుకున్నామన్నమాటే ?

హరి : ఆ రోజులలో తెలుగుసారస్వత పరిశోధన ఇంత జరిగిందని చెప్పటానికి వీలు లేదోయ్. శ్రీ పిఠాపురం మహారాజాగారి పోషణక్రింద ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక అని బయలుదేరింది. దానికి శ్రీ జయంతి రామయ్య పంతులుగారు సారథి. గిడుగు రామ్మూర్తి పంతులుగారు వాడుకభాష కొమ్ముకాస్తుంటే, జయంతి రామయ్య పంతులుగారు గ్రాంథికభాష కొమ్మెత్తుకున్నారు. రామయ్య పంతులుగారు గొప్ప జడ్జి. అనేక తాళపత్రగ్రంథములు అచ్చు వేయించినవారు. శాసనములు మొదట అచ్చు వేయించిన్నది వారే. వానిలో ప్రధానమైనది యుద్ధమల్లుని బెజవాడశాసనము. గవర్నమెంటువా రాయనకు సాహాయ్యము చేశారు. మొదట ఏభై రెండు శాసనాలు ప్రకటించారు. ఆ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ఆంధ్రభాషకు చేసిన మేలు

మరవరానిది. ఆ పత్రికలో గొప్పగొప్ప పండితులు వ్రాసే వారు. వత్సవాయి నీలాద్రిరాజుగారు, ఆచంటసాంఖ్యాయన శర్మగారు—వారందరు గ్రంథకర్తలు. నీలాద్రిరాజుగారు శాకుంతలం తెలుగు చేశారు. ఆయన మంచి పండితులు. శాకుంతలాన్ని చాలా జాగ్రత్తగా చేశారు.

గిరి : మరి ఎవరూ చెప్పుకోరేం ?

హరి : బాబూ ప్రజానురాగం పొందాలంటే హొటలు తిండి వలె ఉండాలి. నీకొక విషయం చెప్పనా. మాది పల్లెటూరు. నేను బస్తీ చదువుకోటానికి వెళ్లాను. అచ్చంగా బస్తీలోనే పుట్టి బస్తీలోనే పెరిగిన స్నేహితు డొకడు ఉన్నాడు. ఒకప్పుడు నేను వాణ్ణి మావూరు తీసుకువెళ్లాను. రాత్రికి మా వూరు చేరాము. మా అమ్మ కందిపప్పు వేయించి పచ్చడిచేసి కమ్మని గేదె నెయ్యి వేసి పెట్టింది. రెండవ ముద్దకు గోంగూరపచ్చడి ఇంత వెన్నముద్ద వేసింది. మూడవ సారి గడ్డపెరుగు వేసింది. మరునాడు వాడికి అజీర్తి విరేచనాలు మొదలుపెట్టినవి. సాహిత్యంలో కూడ ఇల్లాగే ఉంటుంది. అరిగించుకొనడం కష్టం.

గిరి : పిఠాపురం వైపును గురించి చాలా చెప్పావు. మీది ఆవైపా ?

హరి : అన్నివైపులు నావే. అన్ని దిక్కులు నావే. ఇప్పుడు ఏ దిక్కూ లేకుండా ఉన్నాగాని. పద రాయలసీమ పోదాం.

గిరి : వాళ్లు నాటకం కూడ ఆడతున్నారా ఇక్కడ ?

హరి : అవునయ్యా శ్రీనివాస కల్యాణమని ఆడుతున్నారు. ఆ నాటకం వ్రాసినాయనపేరు కోలాచలం శ్రీనివాసరావు గారు. ఆయన బళ్లారి కృష్ణమాచార్యులుగారు ఎన్ని నాటకాలు వ్రాశారో అన్ని వ్రాశారు. ఇద్దరిదీ బళ్లారే.

గిరి : వా రిద్దరూ స్నేహితులా ?

హరి : ఇద్దరి కవులమధ్య అట్లా అడక్కు. ఈ శ్రీనివాస రావుగారు ఒట్టి నాటకాలు వ్రాయడమేకాదు. వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు అన్నిటిని గురించీ బ్రహ్మాండమైన పరిశోధనలు చేశారు.

గిరి : నాటకం చూద్దాం పద.

హరి : అందులో శ్రీనివాసుడు వేషం వేసినాయనపేరు దొర స్వామి అయ్యంగారు. వారిది నెల్లూరు వైపు. అక్కడ హరిప్రసాదరావుగా రెంతవారో ఇక్కడ దొర స్వామి అయ్యరుగారు అంతటివారు. ఈ శ్రీనివాస కల్యాణంలో శ్రీనివాసుడే లక్ష్మీదేవికి సోది చెప్పడానికి ఆడవేషం వేసుక వస్తారు. ఆ దొరస్వామి అయ్యం గారు అటు శ్రీనివాసుడి వేషం వేసి, ఇటు ఈ చెంచెత వేషం వేసేవాడు. స్త్రీ పురుష వేషాలు రెండూ వేసి అంత రక్తికట్టించే నటకుడు ఆ నాటి ఆంధ్ర నాటకరంగచరిత్రలో మరొకడు లేడు.

గిరి : ఇదేమిటయ్యా ఈ నాటకమంతా. కాళిదాసు శాకుంతలాన్ని అనుసరించినట్లుందే.

హరి : దొరస్వామి అయ్యంగారు గొప్ప పండితుడు .... అమరుక కావ్యంలో ఉన్న భావాలన్నీ ప్రదర్శిస్తాడు. రామదాసు నాటకంలో ఆయన తానీషా వేసి ఆ విచిత్రమైన తురుష్కునిలో ఉండే రామభక్తిని ప్రదర్శిస్తాడు. చూచితీరాలోయ్.

గిరి : సరేకాని, వీళ్లు పద్యా లట్లా సాగదీసి చదువుతారేమయ్యా ?

హరి : అబ్బాయి. పద్యాలదాకా ఎందుకు, మనమందరం తెలుగువాళ్లమే. అటు తెలంగాణా, ఇటు కృష్ణా గుంటూరు జిల్లాలు, ఆ వైపున విశాఖపట్టణం జిల్లా, ఈవైపున రాయలసీమ, తెలుగు మాట్లాడటంలోనే యాసలు మారుతవి. ప్రతి ప్రాంతంవాళ్లు, తాము మాట్లాట్టమే రైటనుకుంటారు. ఒకవైపు లక్షణాన్ని ఇంకొకవైపువాళ్లు వెక్కిరించకూడదు.

గిరి : అవునులే. బెంగాలీవాళ్లు సంగీతం పాడతారు. మన రాగాలే. వాళ్లసంగీతం వినేగా మనవాళ్లు గీత గోవిందం పాడుతున్నా రన్నది.

హరి : ఈ రాయలసీమలో వట్టి నాటకాలు వ్రాసినవాళ్లే కాదు. ఇంకా గొప్పవాళ్లు ఉన్నారు.

రి : ఒకరిద్దరి పేర్లు చెప్పు. నాకు విసుగెత్తుతున్నది.

హరి : ఒకరిపేరు వావిలకొలను సుబ్బారావుగారు. ఆయన వాల్మీకిరామాయణం తెలుగుచేశారు. గొప్ప భక్తుడు. వైష్ణవోత్తముడు. దేశమంతా ఆయన శిష్యు లున్నారు.

గిరి : రెండవాయన ఎవరు ?

హరి : జనమంచి శేషాద్రిశర్మగారు.

గిరి : ఆయన ఏమి వ్రాశాడు ?

హరి : ఆయన వ్రాయని గ్రంథమేమున్నది. ఆంధ్రవిశ్వ విద్యాలయంవారు ఆయనకి కళాప్రపూర్ణ బిరుద మిచ్చారు. భవిష్యపురాణం, బ్రహ్మాండపురాణం, రామాయణం, భారతం—వెరశి అన్ని పద్యాలు వ్రాసిన వాడు ఆంధ్రభాషలో ఆనాడు లేనేలేడు.

గిరి : శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులువారు. కూడానా.

హరి : వారు అట్లాంటివారే. ఆ ఇద్దరూ ఈ కాలాన్ని వీరేశలింగం యుగమంటే తెలుగుభాష నంతా పద్యాలతో నింపి పెట్టినవారు.

గిరి : సరేకాని, నువ్వు ఇలాగ చెప్పావు. నాకు మాత్రం ఇది తిరుపతివేంకటేశ్వరయుగమనే అనిపిస్తున్నది.

హరి : అవుననటానికి వీలులేదు. కాదనటానికి వీలులేదు. ఆ మహానుభావు లందరూ ఒక్కొక్కడు అతిరథుడు మహారథుడు. ఒక్కొక్కడి సారస్వతప్రజ్ఞ ఒక్కొక్క రీతిగా ఉంటుంది. ఈకాలంలో ఇంకొక చమత్కారం ఉన్నది.

ఆశుకవిత్వాన్ని కొప్పరపు సోదరకవులు దగద్దగాయ మానంగా వెలిగించారు. తిర్పుపతి వెంకటేశ్వరకవులు శతావధానాలకు ఎటువంటి ప్రాశస్త్యం తెచ్చారో, కొప్పరపుకవులు ఆశుకవిత్వానికి అటువంటి దగద్దగ తెచ్చారు.

గిరి : వారికీ వారికీ పడేది కాదట కదా ?

హరి : ఇద్దరు కవులకు పడకపోవట మనేది ఎప్పుడూ ఉండదు. వాళ్ళు ఇతర కవుల శక్తిని ఎప్పుడూ గుర్తి స్తారు. కాని మధ్యవాళ్ళు తంపులు పెడుతూ ఉంటారు. ఆ తంపులు విని ఆ కవులు కూడ ఒళ్ళు మరిచిపోతారు. యధార్థంగా సత్కవి ఐనవాడి హృదయం నవనీతపేశలంగా ఉంటుంది. ఇతర విషయ ముల సన్నికర్షచేత వాడుకూడ మనుష్యుడే అవటం మూలంగా, తాత్కాలికంగా కోపాలు, తాపాలు వస్తవి.

గిరి : సరేగాని, శతావధానం అంటే తిరుపతి వేంకటేశ్వరుల పేరే చెపుతావు. అంతకంటే గొప్పవారు లేరా ? ....

హరి : ఎందుకులేరు. మాడభూషి వేంకటాచార్యులవా రున్నారు. దానిని తిరుపతి వేంకటేశ్వరకవులే ఒప్పు కున్నారు.

చరికొండ ధమ్మదార్జనచేసె, నీ పేర
జేజె దేవేంద్రుడై యెన్నినాళ్ళ
మాడభూషికి నదివోడి వేదంబయ్యె
తిరుపతి వేంకటేశ్వరుల కబ్బె....

అని తిరుపతి వేంకటేశ్వర కవులే వ్రాసుకున్నారు. ఈ వేంకటాచార్యులవారి ధారణాశక్తి కథల్లో చెబుతారే జగ న్నాధ పండితరాయలు, కూచిమంచి జగ్గకవి అటువంటి వాళ్ల జ్ఞాపకశక్తి వంటిదట. వారు భరతాభ్యుదయము మొదలైన ప్రబంధములు వ్రాసినారు.

గిరి : సరేకాని నాకొక్క అనుమానం.

హరి : పెండలకడ వదలించుకో. అది దయ్యంవంటిది.

గిరి : నేను వదిలించుకుంటే నీకు పడుతుందేమో చూడు నువ్వు ఇద్దర్ని మరిచిపోయినావు.

హరి : ఇద్దరిని కాగోయి. రెండువందలమందిని మరచిపో యుంటాను.

గిరి : అదికాదు, చాలామందిని మరచిపోవచ్చు కాని, నేను చెప్పే ఇద్దరినీ మరచిపోకూడదు. ఒకరు నాగపూడి కుప్పుస్వామయ్య, రెండవవారు తంజనగరపు తేవప్పెరు మాళ్ళయ్య. వాళ్ళిద్దరూ ద్రావిడబ్రాహ్మణులు. వాళ్ళు తెలుగుకు భాషకు చేసిన ఉపకారం ఇంతా అంతా కాదుగదా. భారత భాగవత రామాయణాదిగ్రంథాలు అచ్చువేయించి, టీకలు వ్రాసి, స్వతంత్రంగా కూడా వాళ్ళు తెలుగులో పెద్ద పెద్దగ్రంథాలు వ్రాశారు.

హరి : వారేనంటావా ? బ్రౌన్ మొదలైన పాశ్చాత్యులు మన భాష కెంత చేశారంటావు. ఆ బ్రౌన్‌దొర సంక లించిన నిఘంటువు ఒక్కటి చాలే మన భాష నుద్ధరించాడని చెప్పడానికి.

గిరి : నిజమే. తెలుగు భాషలో ఉన్న మాధుర్యాన్నిబట్టి చేశాడు. ఆ మాధుర్యమంతా నన్నడిగితే ఆదిభట్ల నారాయణ దాసుగారు తన హరికథలో, సంగీతంలో జోడించి విరజిమ్మారు.

హరి : ఆయన అక్కడ హరికథ చెబుతున్నారు. వెళ్ళి ఒక కీర్తన వినిపోదాం.

గిరి : ఆయన కవి. మహా సంగీతవిద్వాంసుడు. సంస్కృతం, పారసీకము, ఇంగ్లీషు, తెలుగు మొదలైన బహు భాషావేత్త. భరతశాస్త్ర నిపుణుడు. ఒక అవతార పురుషు డనవలె. అదుగో పాట వినిపిస్తున్నది.

# కాళహస్తిమాహాత్మ్య పాఠపరామర్శము

## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

మహాకవి ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యము శ్రీ క్రొత్తపల్లి వేంకట పద్మనాభశాస్త్రిగారిచే పరిష్కృతమై, తొలుత 1895లో ముద్రితమైనది. పిమ్మట, 1930-లో శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి లఘుటీకతో పునర్ముద్రితమైనది. ఆ ప్రతిని సవరించి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి లఘుటీకతో— 'వేంకట్రామ అండ్ కో' వారు, 1961 లో నూతనముగా ముద్రించినారు. ఆ ముద్రణమును పరిశీలించి 'గాండీవి' అనువారు, ఒకచో ఇట్లు మూదలించినారు.

"ఈ ముద్రణములో 'లోపడని' (1—124) 'లోపడి', (2—20) 'రెణ్ణెల్లకు' (2—79), 'వేణ్ణీళ్లు' (4—11) 'భిన్నింపదయ్యె' (3—149) 'చిన్నవోయి' (3—159) 'దుండి' (3—191) మున్నగు అపరూపము లెలంతిగా మిగిలి యున్నవి. నిర్వాహకప్రయోగము లేకపోవుటచే 'డొంగ' శబ్దమును గ్రహించుటకు శ్రీ శాస్త్రిగారు సంకోచించిరి....... ధూర్జటి ప్రయోగమే 'డొంగ' శబ్ద నిర్వాహక మనదగును. (4—69)".

ఈ యపపాఠములు పూర్వముద్రణమునుండి దిగుమతియైనవి. వీటిలో 'రెణ్ణెల్లకు' 'వేణ్ణీళ్లు' అనునవి తప్ప తక్కినవి ఈ క్రిందివిధముగా సవరింపబడదగును.

'లోఁబడని'; 'లోఁబడి'; 'బిందింపదయ్యె'; 'చిన్నఁబోయి'; 'డుంఠి' 'డొంగ'—.

ధూర్జటి 'డొంగ' యను పదమును ప్రాసమున ప్రయోగించినాడు. శాస్త్రిగారు 'డొంగ' శబ్దమునకు నిర్వాహక ప్రయోగము లేదని, 'ఆ డొంగల్' అను పాఠమును 'ఆ దొంగల్' అని దిద్ది, ద—డ ప్రాససాంకర్యదోషమొకటి ఆ మహాకవికి తెచ్చిపెట్టినారు.

ప్రాసస్థాన ప్రయుక్త శబ్దమునకు నిర్వాహక ప్రయోగ మింకొకటి కావలె ననుటయే అనవసరము. అది యట్లుండగా, 'దొంగ'కు 'డొంగ' అను రూపమును కలదని బాలవ్యాకరణము లోనే చెప్పబడియున్నది.

"దక్కు లోనగువాని దా కు డకారంబు విభాషనగు. దొంగ—డొంగ" (ప్రకీర్ణ—14.)

ఆ శాస్త్రిగారికి తెనుగుతో పరిచయము తక్కువ. అందువల్ల, ఇట్లే చాల పాఠములు దిద్దబడినవి. లఘుటీకలో పెక్కు పదముల కర్థములును తప్పుగా చెప్పబడినవి.

### 'రెణ్ణెల్లకు', 'వేణ్ణీళ్లు'—

"రెన్నెల్లలోన నాకుం
జెన్నొంద నధీన గాఁగ" (భాస్క. రా. సుం. 204)

ఇత్యాదిగా కవులు నకార ద్విత్వ రూపమును వాడియున్నారు- కనుక 'రెన్నెల్లు—వేన్నీళ్లు' అని సంస్కరింపవలెనని విమర్శకుల సూచన. అట్లు సంస్కరింప నక్కరలేదని నా యభిప్రాయము. కారణములు మనవి చేసెదను.

(i) కవు లట్లు వాడినారుగాని, 'రెణ్ణెల్లు' 'వేణ్ణీళ్లు' అనియే లోకమున వ్యవహారము. ణకారద్విత్వరూపమే ఉచ్చారణ కనుకూలమును; చెవికింపును. ధూర్జటి వ్యవహారసిద్ధ భాషాప్రియుడు. కాబట్టి 'రెణ్ణెల్లకు'—'వేణ్ణీళ్లు' అనియే వాడియుండు ననుకొనుట కవకాశ మున్నది.

(ii) సంస్కృతమున, రాడ్ + నికరము—'రాణ్ణికరము' షడ్ + నవతి—'షణ్ణవతి' అగుటనుబట్టి డకారమునకు నకారము పరమైనప్పుడు డకార నకారములకు రెంటికిని ణత్వము వచ్చుట భాషా స్వభావమనియు, అందువల్లనే, రెండు + నెలలు—రెణ్ణెల్లు అను వ్యవహార మేర్పడియుండుననియు భావింపదగియున్నది.

(iii) ఆంధ్రభాషానుశాసనము (పు.112) "మూణ్ణెల్లు, ఏణ్ణాళ్లు మొదలగుచోట్ల తుది యచ్చునకు లోపము, డకారమునకు ణకారము. ఇట్లే ప్రయోగములనుబట్టి ఊహించునది" అని చెప్పి, పు. 290 లో —

"మూణ్ణెల్ల కవయవములు పుట్టు" (సానందో 4.58)

అను ప్రయోగమునే కాక, 'నెల రెణ్ణెల్లకుఁ జీర చిక్కె' (కాళ 2.97) అను ప్రకృత ప్రయోగమును గూడ చూపినది. "రెణ్ణాళ్ళు—వేణ్ణీళ్లు ఇట్టివే" అనియును తెలిపినది.

కాబట్టి "రెణ్ణెల్లకు'—'వేణ్ణీళ్లు' అను పాఠము లట్లే యుండవచ్చును. మార్చనక్కరలేదు. కాని, శాస్త్రిగార 'వేణ్ణీల్లు' అని ముద్రించినారు. అది పొరపాటు. శబ్దము 'నీళ్ళు'గాని, 'నీల్లు' కాదు. పూ. ము. లో "వేణ్ణీళ్లు' అని స గానే యున్నది.

ఇక్కడ ఒక్కమాట.—ణకార ద్విత్వముమాట అట్లుం నిండు. నెలలు—'నెల్లు' ఎట్లయినవి? అలలు—'అల్లు'; కలలు—'కల్లు' కావు గదా! 'నెల్లు' శాస్త్ర సిద్ధరూపముకాదు. రెణ్ణెల్ —అర్నెల్లు అను వాడుక లోకమున నున్నది. ఆ వాడుకనే కవు లంగీ

రించి కావ్యముల కెక్కించినారు. ఆ యెక్కించుటలో ఒకరు 'రెన్నెల్లు' అన్నారు. ఇంకొకరు 'రెణ్ణెల్లు' అన్నారు. ఎట్లున్నను పూర్వ కవులప్రయోగములను మనము మార్చగూడదు.

ఆ నూతనముద్రణములో 'గాండీవి'గా రెత్తిచూపిన అప పాఠములేకాక, అట్టివి మరికొన్నియును గలవు. వ్యాస విస్తర భీతిచేత, వాటిలో కొన్నిటిని మాత్రమే నే నీ వ్యాసమున చూపు చున్నాను.

శాస్త్రిగారి పాఠమును, (ఉన్నచోట) వారి టీకను; పూర్వ ముద్రణ పాఠమును, అందున్న టీకను చూపి, నాకు తోచిన సవరణలు సూచించెదను. జోగాములకు సహృదయులగు పండి తులు ప్రమాణము.

## 1. 'అ వ స్థ ప్ర దా న'

"తన్మయావస్థప్రదానకేళి" (1.2)

రెండు ప్రతులలోను 'అవస్థప్రదాన' అనియే పాఠము.

శాస్త్రిగారి టీకలోను, "తన్మయావస్థప్రదానకేళి = తన్మయావస్థనిచ్చుట......" అనియే యున్నది.

అవస్థాశబ్దము ఆకారాంతము గనుక 'అవస్థాప్రదాన' అని యుండనగును.

## 2. 'తత్పురము తూ చా';
## 3. 'దుర్వాసనల్'; 4. 'వచ్చునఁట';

"జనలోకోన్నతమైన తత్పురము తూ చా తప్పకుండంగ వ ర్ణన సేయన్ వశమౌనె? కీటమున కైనం, బక్రి కైనన్, మధాం ధున కైనన్, బహుజీవహంత కయినన్ దుర్వాసనంబాసి మో క్షనిధిం గొల్ల గొనంగ వచ్చునఁట!" (1.20)

ఇది పూ. ము. పాఠమే.

(1) 'తత్పురము', వర్ణనసేయన్—అను క్రియకు కర్మ గావున ద్వితీయాంతము. కనుక పాఠము, 'తత్పు రముఁ దూ చా' అని యుండవలెను.

(2) 'దుర్వాసనన్' అని యేకవచనముగా నుండుటకంటెను, 'దుర్వాసనల్' అని బహువచనముగా నుండుట యుచి తము. దుర్వాసన లనగా, దుష్టములైన పూర్వజన్మ సంస్కారములు. అవి యనేకముగాని, ఒకటికాదు. 'దుర్వాసనల్ వాసి' అని పాఠము కాదగును. 'దుష్ట సంస్కారములుపోయి' అని యర్థమగును.

ప్రాగ్జన్మవాసనలను బహువచనమున చెప్పుటయే సంప్రదాయము.—"మానునె తొల్లిటి జన్మవాసనల్" (4—21).

(3) మోక్షనిధిని కొల్లగొనవచ్చు 'నఁట' అని ఆశ్చర్యార్థము గానో, వృత్తాంత కథనముగానో చెప్పుటకంటెను, 'అట = ఆచోట, మోక్షమును కొల్లగొనవచ్చును' అని చెప్పుట యుచితము.

'ఆ పురము, అటువంటి గొప్పమహిమ కలది గావున తూ. చా. తప్పక వర్ణనసేయ వశముగాదు.' అన్న సమంజసార్థ మువపన్నమగును. కాబట్టి 'అఁట'లోని అరసున్నను తొలగించుట మంచిది.

## 5. 'ఁబోటులకు'; 6. 'గీర్తింపని';

"తాల్మి దూలని వధూటిం, గౌగిలింపం దలం పని శంపాలలితాంగిఁ బోటులకుఁ జెప్పంబోని పంకేరు హా నన గీర్తింపని తేమ మందునకు నైనం గానము" (1.32)

పూ. ము. లోను 'లలితాంగిఁ బోటులకు' అనియే పాఠము. శబ్దము 'బోటులు' గాని, 'పోటులు' కాదు. కావున 'బో' కు ముందు అరసున్న ఉండరాదు.

'పంకేరుహాననన్' అని ద్రుతాంతముగావున 'గీ' కు ముందు అరసున్న ఉండవలె. పూ. ము. లో ఉన్నది.

## 7. 'త ని వు ప డు'

"తనివు పడనొల్ల విజిత కందర్ప యనుడు" (1.35)

రెండు ప్రతులలోను 'తనివుపడ' అనియే పాఠము.

'తనివు=తృప్తి' అని వావిలికొలనువారి టీక.

సూ. ని. 'తనివుపడు = తృప్తిపడు' అని చెప్పి, ఈ పద్య మునే ఉదాహరించినది.

"తనివి పడనొల్లను = తృప్తిపడఁజాలను' అని శాస్త్రిగారి టీక. 'తనివు' అను పదమును 'తనివి'గా మార్చి అర్థము చెప్పుట పొరపాటు.

## 8. 'ప్ర స ం గ ము ల'

"తానుఁ గుమార జంగము సుధాకరమౌళియుఁ గూడిమాడియుం పైన రతిప్రసంగముల నర్ధనిమీలిత నేత్రపద్మముల్ మానని చుంబనంబులును మాటల చొక్కులు వీడి వీడి పో వీని కవుంగిలింతలు ననేక విలాసములుం జెలంగఁగన్" (1—42).

రెండు ప్రతులలోను 'ప్రసంగముల నర్ధ' అనియే యున్నది.

పద్యములోని తక్కినవిశేష్యములవలెనే 'ప్రసంగములు' ప్రథమలోనే యుండవలెను. లేకున్నచో అర్థము సరిపడదు. కాబట్టి 'ప్రసంగములు నర్ధ' అని మార్చవలెను.

## 9. 'విశ్వాధిక! యనఁగ'

"విశ్వజనిస్థితిలయకర!

విశ్వాధిక! యనఁగ నిన్ను విందు మహేశా!" (1.78)

పూ. ము. లోను ఇట్లే యున్నది.

'విశ్వాధికుఁ డనఁగ విందు' అని యుండినగాని వాక్యమర్థ వంతము కాదు.

## 10. 'ఉడ్డీన'-'ఉఢ్యాణ'

"జాలంధరోడ్డీన బంధంబులం బట్టుచున్" (1.146)
అని పూ. ము. పా—'జాలంధరము, ఉడ్డీనము లోనగు యోగ బంధములు' అని వావిలికొలనువారి టీక.

'జాలంధ రోఢ్యాణ.....! అని సూ. ము. పా.—టీక లేదు.

'ఉడ్డీన—ఉఢ్యాణ' పాఠములు రెండును తప్పే. 'ఉడ్యాణ' అని యుండుట ఒప్పు.

శబ్దార్థ కల్పతరువు 'ఉడ్యాణః—బంధవిశేషే' అని చెప్పి, ఉడ్డియాణః; ఓడ్యాణః; ఓడ్డియాణః—అను రూపములను గూడ చూపినది.

సూ. ని. లో 'ఓడ్యాణము' మాత్రమే యున్నది. శ. ర. 'ఓఢ్యాణము' అన్నది. కాని, అది సాధురూపము కాదనియు, 'ఓడ్యాణము' అనునదే సాధు రూపమనియు శబ్దార్థ కల్పతరువును బట్టియే కాక, ఈ క్రింది ప్రయోగములను బట్టియు ఊహింపదగియున్నది.

"ఓడ్యాణ పీఠ నిలయా బిందుమండల వాసినీ"
(లలితా—83.)

"ఓడ్యాణ జాలంధర యోగబంధై
రున్నిద్రితాయా మురగాంగనాయాం
ప్రత్యఙ్ముఖత్వా త్ప్రవిశ త్సుషుమ్నాం
గమా గమౌ ముంచతి గంధవాహః"
(యోగతారావళి—6.) సూ. ని.

ధూర్జటి రచనకు ఈ శ్లోకమే మూలముగా కనబడు చున్నది. అందువల్ల అతడు వాడినది 'ఓడ్యాణ' శబ్దమనియు, అతని పాఠము 'జాలంధరౌడ్యాణ బంధంబులన్' అని యుండు ననియు నా యభిప్రాయము.

అతడు 'ఉడ్యాణ' శబ్దమును వాడియున్నచో, పాఠము 'జాలంధరోడ్యాణ' అని యుండును. 'జాలంధరోడ్డీన'—'జాలంధరోఢ్యాణ' అను పాఠములు మాత్రము సరియైనవికావు.

## 11. 'ఢాకిని'

"శాకినీ ఢాకినుల కలకలంబును" (2.62)
రెండుప్రతులలోను 'ఢాకినుల' అనియే ముద్రితము. శబ్దము 'డాకిని'గాని, 'ఢాకిని' కాదు.

## 12. 'చింతయున్ వేకి'; 13. 'తనలోను'

"చింతయున్ వేకి దనలోను చేసికొనియె" (2—124)

ఇది సూ. ము. పా.—'చింతయన్ వేకి' అని పూ. ము. పా. —ఆ పాఠమే సాధువు. 'చింతయనెడి వేకి = చింతాజ్వరము' అని యర్థము.

"చింతయున్ —వేకి=చింతయును—జ్వరము" అనుట సరిపడదు.

పూ. ము. లోను 'తనలోను' అనియే పాఠము. సరికాదు. 'తను లోనుచేసికొనియె' అని యుండనగును. అపుడు 'చింత యనెడి జ్వరము, తనున్=నన్ను, లోను చేసికొనియెన్= లోబరుచుకొన్నది, ఆక్రమించినది' అని యర్థమగును.

చింతను జ్వరముగా చెప్పుట కలదు—
"ప్రత్యహంబు నవత్వంబు వడయు నెద్ది
యట్టి చింతాజ్వరంబు త న్నలముకొనియె
నేమి సేయుదు నింకనే నెచటఁ జొత్తు" (కాశీ 1.111)

## 14. 'వ్రేళ్యాతి'

"విపులా వాలము నిండి శైలగుహలన్ వ్రేళ్యాతి...... దట్టపుఁ బెం జీఁకటిచెట్టు" (2—130)

ఇది శా. పా.—చెట్టున కుండునవి 'వేళ్లు = వేరులు'గాని, 'వ్రేళ్లు = అంగుళులు' కావు. కావున ఈ పాఠము తప్పు. పూ. ము. లో 'వేళ్యాతి' అనియే యున్నది.

## 15. 'ధరధ్వాంతము'

"ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి ధరధ్వాంతము ధూపధూమము" (2—132)

పూ. ము. లోను పాఠమిట్లే యున్నది. —'ధరధ్వాంతము = నేలమీఁది చీకటి' అని శాస్త్రిగారి టీక.

'నేల' అను నర్థము నిచ్చునది 'ధరా' శబ్దము గాని, 'ధర' శబ్దముకాదు. ధరము = కొండగాని, నేల కాదు. కాబట్టి 'ధరధ్వాంతము=నేలమీది చీకటి' అను టీక సరికాదు. చీకటి నేల మీదపడియుండు వస్తువుకాదు. కనుక 'నేలమీది చీకటి' యనుటయే సరిపడదు.

శాస్త్రిగారు 'ధర'ను, 'దర'గా మార్చి, పీఠిక XXV లో ఇట్లు వ్రాసినారు.

"దరధ్వాంతము—అను పాఠముండుటయే భావ్యమని పించును. చంద్రోదయ వర్ణన ప్రస్తావముగావున, చంద్రుని శివ లింగముగా భావించినపుడు, వెన్నెలమాటున నల్పమయిన చీకటి యుండిన నది ధూపధూమముగా నేర్పడుట సమంజసము. 'ధరధ్వాంతము' అను పాఠమునే యంగీకరించి, నేలమీఁది చీకటి యనినచో, అపు దర్థసమన్వయము సమాససమన్వయము కూడ శ్రమసాధ్యమే యగును. ఈ పాఠము నంగీకరించినచో నర్థము పొసగుటయేగాక, దధప్రాస సాంకర్యముకూడ తొలఁగును. కావున నిచట దరధ్వాంతము అను పాఠమును గ్రహించుట యుక్తము."

'ధర' పాఠమున అర్థము పొసగియున్నచో, దధప్రాసము కారణముగా 'ధర' 'దర'గా మార్చనక్కరలేదు. దధప్రాసము లాక్షణికులనుమతించినదే. అర్థము పొసగుటలేదు గావున 'ధర' పాఠము గ్రాహ్యము కాదు.

'దర' పాఠమున ప్రాసము—అర్థము గూడ సరిపడు చున్నట్లు శాస్త్రిగా రనుకొన్నారుగాని, ప్రాస మొకటే సరిపడు నది. అర్థము సరిపడదు. ఎందువల్ల ననగా:

వెన్నెలమాటున చీకటిగాని, చీకటిమాటున వెన్నెలగాని ఉండుట అసంభవము. తేజస్తిమిరములు ఒకదానిచాటున నొకటి యుండవు. కనుక, వెన్నెలమాటున నల్లనైన చీకటి యుండు ననుటయు, ఆ చీకటి ధూపధూమముగా నేర్పడు ననుటయు— పొందుపడనిమాట. అందువలన 'దరధ్వాంతము' అను సవరణ సరిపడదు.

చీకటి గుహలయందుండుట సహజము గావున, కవిపాఠము 'దరీధ్వాంత'మై యుండవచ్చునని నా యూహ.

## 16. 'ముక్కుంగూండ్లు'

"శుండాలంబు కరంబు సాచ ఫణిరాజు న్మెచ్చి నా పూజ భ ర్గుం డీ వేళ ననుగ్రహించె నని ముక్కుంగ్రోళ్లలో నెక్కి" (2—146) అని. పూ. ము. పా.—'క్రోళ్ల=క్రోవులు' అని వావిలికొలను వారి టీక.

'ముక్కుంగూండ్లలో' అని సూ. ము. పా.—'ముక్కుం గూండ్లలోన్=నాసారంధ్రములలో' అని శా. టీ.

'ముక్కుంగూండ్లు' అనుట తప్పు. 'ముక్కుంగ్రోళ్లు' అనుటయే ఒప్పు. (ముక్కు+క్రోళ్లు)—క్రోలు=క్రోవి. (చూ. సూ. ని. 'ముక్కుఁగ్రోలు').

"అప్పు డమ్మావునకు ముకుగ్రోళ్ల నెక్కి చరమధాతు ద్రవంబు......స్రవించె" (కాశీ—4. 272)

## 17. 'ఉ య్యే ల'

"చాలుఁ బూఁ దీఁగ యుయ్యాల లనరు" (3—6.) అని పూ. ము. పా. "చాలుఁ బూదీఁగ యుయ్యేల లనరు" అని సూ. ము. పా.

'పూదీఁగ'—తప్పు. 'పూఁదీఁగ'—ఒప్పు. పూవు తీఁగ. 'వు' లోపము. నుగాగమసంధి.

'ఉయ్యాల'ను 'ఉయ్యేల'గా దిద్దనక్కరలేదు. 'ఉయ్యాల' పాఠమే సముచితము. ధూర్జటి 'ఉయ్యాల'ను వాడియున్నాడు.

"ఉయ్యాలలు గట్టియాడ నవి యల్లన దవ్వుగఁ బోయి నన్" (1.106)

"ఉయ్యాలో జొంపలో యంచుఁ బాడుదురు బిల్లాంభోజ పత్రేక్షణల్" (చాటువు)

## 18. 'మ సిఁ బూ సి'

"మృగనాభిన్ మసిఁబూసి" (3.7) అని రెండు ప్రతుల లోను పాఠము.—"మృగనాభిన్=కస్తూరిని, మసిఁబూసి= మసిగాబూసి" అని. శా. టీ.

'మసిగాపూసి' అను నర్థమున 'మసిపూసి' అని యుండ వలెగాని, 'మసిఁబూసి' అని యుండగూడదు. 'మసినిపూసి' అని యర్థమగును. కాబట్టి పాఠమును 'మసిపూసి' అని మార్చవలెను.

## 19. 'గిం ౦ టె న'

"తెల్ల దింటెనపువ్వుఁ దెచ్చి తద్రసమిడి" (3—110) అని పూ. ము. పా.—సూ. ని. ఈ పాఠమునే గ్రహించినది.

'గింటెన' అని శా. పా.—వారు 'గింటెన' ను పద్యమున ముద్రించి, 'దింటెన' (ముద్రి)' అని అడుగున సూచించినారు.

గింటెన, దింటెన రెండును ఒకటే—

"గింటెన యనఁగను దింటెన యన
గిరికర్ణి చెలువొందు" (ఆం. భా. 2—56)

'దింటెన' యనుపదము, "దింటెన పూవువంటి...... దేవతకున్ పదివేల దండముల్" అని యతిస్థానమునను ప్రయుక్తమై యున్నది. 'దింటెన' అను ముద్రిత పాఠమును 'గింటెన' అని అకారణముగా మార్చుట సరిగాదు.

## 20. 'వె ల్లిఁ గ లి సి న'

"మాటి మాటికిఁ జేసిన మందులెల్లఁ
జెల్లెఁబో వెల్లిఁ గలిసిన చింతపండు
నీట వ్రాసిన వ్రాలునై నెరయ వఱదఁ
బోవుఁ గాకేమి, నెత్తురు పుట్టనేల?" (3.111)

'చెల్లెఁబో = పోయినపోవుఁగాక, నెరయన్ = సంపూర్ణముగా, వఱదఁబోవు=ప్రవాహములోఁ బడిపోవు, నెత్తురు = రక్తము' అని శా. టీ.

(1) 'పోయిన పోవుఁగాక'; 'ప్రవాహములోఁ బడిపోవుఁ గాక' అనుటలో అర్థపునరుక్తి యున్నది. 'చెల్లెఁబో' అను పాఠము తప్పు. పూ. ము. లోను, సూ. ని. లో, 'నీరు' అనుపదము క్రిందను 'చెల్లెఁబో' అను పాఠమే యున్నది. కాని, 'చెల్లఁబో' అని యుండుట యుచితము. చెల్లఁబో = అయ్యో—అని అర్థము.

"చెల్లంబో! యిట్టి మగఁడు చేకుఱె ననఁగన్" (భోజ. 5—326).

(2) 'వఱదఁ బోవుఁగాక—ప్రవాహములోఁ బడిపోవుఁ గాక'—అను టీక సరికాదు. 'వఱద .... గాక = వ్యర్థమై పోవుఁగాక' అని సరియైన అర్థము.

(3) 'వెల్లిఁ గలిసిన' అను పాఠము తప్పు. 'వెల్లిఁ గలిపిన' అని కవిపాఠము. పూ. ము. లో ఉన్నది. సూ. ని. లోను ఉన్నది.

'వెల్లిఁ గలిపిన చింతపండు' అనునది 'వ్యర్థప్రయత్నము' అను భావమును దెల్పు లోకోక్తి. ఏటిలో వేసి పిసికిన చింతపండు రసము—ఏట గొట్టుకొనిపోవునే గాని,

పులుసుగా మన కుపయోగింపదు. శ్రమయే గాని ఫలము శూన్యము.

> "చింతింప వఱిదఁ గూర్చిన చింతపండయి
> నీటఁ గూడె హిమాంశు నేర్పులెల్ల."
>
> (చంద్రభాను. 2—168)

'నేను చేసిన మందు లన్నియు, చెల్లఁబో=అయ్యో !, వెల్లిఁ గలిపిన చింతపండువలెను, నీటిమీద వ్రాసిన అక్షరముల వలెను, వఱిదఁ బోవుఁగాకేమి=వ్యర్థమై పోయిన పోవుగాక; నెత్తురు పుట్టనేల = కంటినుండి నెత్తురు కారుటకు కారణమేమి ?'—అని పద్యార్థము.

## 21. 'అంగయ కన్యక జను లెంచఁగ'

> "తనపేళ్ళం దనసేవయుఁ
> దనదు ప్రసాదంబు నొసఁగి దయ నంగయ క
> న్య యుగజ పెంపఁగఁ బరి మను
> వనితల వైభవముఁ బొగడ వశమే వసుధన్" (3.136)

అని పూ. ము. పా.—ఇందు మూడవ పాదమున ప్రాస భంగము. "అంగయకన్యన జను లెంచఁగ" అని నూ. ము. పా.; టీకలేదు.

ఈ పాఠమున ప్రాసము కుదిరినది గాని, అర్థము భ్రష్టమైనది. 'అన జను లెంచఁగ' అనుటలో అర్థములేదు. (కన్య=అని—) కన్యని జను లెంచుగ' అని సవరించినను, 'జను లెంచఁగ' అని సవరించినను, 'జను లెంచఁగ—వనితల వైభవముఁ బొగడ వశమే' అనుటలో అన్వయము లేదు.

పూ. ము. లోని 'యుగజ' ను, 'నగజ' గా మార్చినచో అర్థము సరిపడును. మరియు, 'అంగయకన్య' ను, 'అంగయకణ్ణి' గా సవరింపవలెను. 'అంగయక్కణ్ణి' అసలు రూపమనియు, 'అంగయకణ్ణి' అని వాడినను తప్పు లే దనియు 'గాండీవి' గారు తెల్పియున్నారు.

కాబట్టి 'అంగయకణ్ణి నగజ పెంపఁగ' అని పాఠమును సరిపరుచుట సమంజసము.

అప్పుడు, 'నగజ = పార్వతియైన, అంగయకణ్ణి = విూనాక్షి దేవి, పెంపఁగన్ = యోగక్షేమములు విచారించుచు పెంచుచుండగా, మను = సుఖముగా జీవించుచున్న, వనితలవైభవము పొగడ వశమే'—అని యర్థమగును.

## 22. 'గోచరాంకుఁడు'

> "యోగిహృదయ, గోచరుని గొల్వఁగా శివగోచరాంకుఁ
> డొకఁడు వచ్చె శివబ్రాహ్మణోత్తముండు" (3.94)

ఇది సూ. ము. పా.—"శివగోచరాంకుఁడు=శైవ చిహ్నములు గలవాఁడు" అని శా. టీ.

"…. గోచరునిఁ గొల్వ శివచిహ్న గోచరాంకుఁ
డొకఁడు వచ్చె"

అని పూ. ము. పా.—

'శివచిహ్న గోచరాంగుఁ డొకుడు' అని యుండుట యుచితమని నా యభిప్రాయము. 'శివ చిహ్నములు కనుపించు అంగములు కలవాఁడు' అని యర్థమగును.

## 23. 'ధా ర ణ'

"కుముదాప్తధారణకొమ్ము దఱిఁగె" (3—149)

అని పూ. ము. పా.—'కుముదాప్త ధారణకొమ్ము' అని సూ. ము. పా.—ఈ రెండు పాఠములలోను తప్పున్నది.

'ధారణకొమ్ము = అర్ఘమును జెప్పుకొను' అని శా. టీ.; 'ధారణ' అనుట తప్పు. 'దారణ' సరియైన రూపము. ఇది తెనుగుమాట. 'వెల' యని అర్థము.

'దర దారణ యనంగ మనును గ్రయము"
(1ఆం. భా. 2—267)

'దారణ' యను మాటకు 'అర్ఘము' అని యర్థము చెప్పుట,—'రంపము' నకు 'క్రకచ' మనియు, 'చీమ' కు 'పిపీలిక' యనియు—అర్థము చెప్పుటవలె నిరుపయోగము.

'దారణకొమ్ము' ధాన్యాదుల వెల హెచ్చు తగ్గులను సూచించును గాని, చెప్పదు. కావున 'చెప్పుకొను' అను టీక సరికాదు.

తఱిగినది 'దారణకొమ్ము' గాని, 'దారణకొను' కాదు. 'కొమ్ము' అనగా శృంగము.

సూ. ని. 'దారణకొమ్ము = ధాన్యాదుల వెలను తెలియఁ జేయు (చంద్రుని) శృంగము' అని చెప్పినది. అట్లే చెప్పవలెను.

## 24. 'ప ద క్ర మ'

"పరిహృత సంతతభ్రమణభార పదక్రమ భాను ఘోటమున్" (3—184)

"పదక్రమ' అనియే రెండు ప్రతులలోను పాఠము.

"పరిహరింపఁబడిన, ఎల్లప్పుడు తిరుగుటచే భారముతో గూడిన పాదముల యలసటగల సూర్యాశ్వములు గలది" అని శా. టీ.

'తిరుగుటచే భారముతోఁ గూడిన పాదములు' అనగా అర్థమేమి? పాదములేవిు భారముతో కూడినవి?—

'పాదముల యలసట'—ఇదియొక వింతతెనుగు.— అలసట కలుగునది శరీరమునకు గాని, పాదములకు గాదు. తిరుగుటచే పాదములకు కలుగునది తీపు. దీనినే 'కాళ్ల తీపు' అందురు.

'బంతులఁ దిరుగ నీ పదములనే తీపు
బూరెలం దనుప్పాట బూటకంబు"
(పార్వతీ. 2—180)

"తలనొప్పి కడుపుకుట్టుం
బలుగుఱుపుం గాళ్లతీపు పాటించుచు"
(శుక. 2—205)

ఎందు కెక్కువ చర్చ : శాస్త్రిగారి టీక సరియైనదికాదు. దానికి కారణము 'పదక్రమ' అనుపాఠము 'పథ క్రమ' అని సవరించినచో అర్థము దారికి వచ్చును.

'పరిహృత = తొలగింపబడిన, సంతతభ్రమణభార = ఎడతెగనిప్రయాణమువలని, పథక్రమ—మార్గాయాసముగల, భానుఘోటము=సూర్యాశ్వములు కలది' అని యర్థము.

'పథక్రమ' అనుట తప్పుకాదు.

"తానును నేను నియ్యెడఁ బథక్రమ ఖేదముఁ బొంది" (దశ. 11.75) ఇత్యాదిగా ప్రయోగములు కలవు.

## 25. 'అలక;' 26. 'వలువ;' 27. 'బాలింత'

"తలఁ బంకించిన నూనె, పుక్కిట సదా
తాంబూలమున్ నేత్ర క
జ్జలమున్, గంధరఁ గట్టుకొన్న వసపూ
సల్, గబ్బిపాలుబ్బు గు
బ్బలు, నేకాంగుళికార్పితాలక ల
స ద్భస్మంబు, జిడ్డైన దు
వ్వలువం జెల్వుగ బిడ్డకాన్పు నడిపెన్
వామాక్షి బాలింతయై" (4.11)

రెండుప్రతులలోను పాఠమిదే.—

(1) 'అలక లస ద్భస్మంబు'—తప్పు. 'అలిక….' అని యుండదగును. భస్మమును ధరించునది అలికము నందుగాని, అలకలయందు కాదు. అలికము = నొసలు. అలకలు = కురులు.

(2) 'వలువన్'—తప్పు. 'వలువున్' (—వలువయును) అని యుండుట ఒప్పు. 'వలువన్' అను పాఠమున సముచ్చ

యార్థము రాదు. వలువను—అని యర్థమగును. ఆ యర్థము పరిపడదు.

వలువు = వలువ.—

"వలు వెడలన్ బయల్పడియె వల్గు కుచంబులు"
(అది. 4.44)

"పదియార్వన్నియ బంగరు వలువును
మెదలెడి తళుకుల మేలిమి చెలువును."
(కళా. 8—282). శ. ర.

(3) 'బాలింత'—తప్పు. ఇది యీనాటి వాడుక. 'బాలెంత'—గ్రాంథికము.

"ఏటవాలైనయది యీ యరఁటి బాలెంత
చేటునకె యగు చూలుచేఁ గలుగు మే లెంత"
(మను. 3—84)

## 28. 'కట్టినుప్పు;' 29. 'చల్లు'

ఎత్తుగీతము.—

"తోట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టి
నుప్పు వేపాకుపైఁ జల్లు నిప్పు లతివ
త్రిప్పి యిడు దృష్టి దోషంబు తీర వీథిఁ
బ్రేమ మీఱంగ బిడ్డలఁ బెంచునపుడు" (4—11)

ఇది శాస్త్రిగారి పాఠము.—'కట్టి + ఉప్పు = కట్టియుప్పు' అగును గాని 'కట్టి నుప్పు' కాదు. ఈ పాఠము తప్పు. 'కట్టు నుప్పు' అని సరియైన పాఠము. పూ. ము. లో నున్నది.

రెండుప్రతులలోను 'ఉప్పు వేపాకుపైఁ జల్లు' ననియే యున్నది. అట్లుండరాదు. 'ఉప్పు వేపాకుఁ బైఁ జల్లి' అని యుండనగును.—'దృష్టి దోషంబు తీఱన్—అతివ —ఉప్పున్ — వేపాకున్ — నిప్పులపైన్ — చల్లి — త్రిప్పి, —వీథిన్—ఇడున్' అని అన్వయక్రమము.

దృష్టిదోషము పోవుటకు ఆమె, ఉప్పును, వేపాకును నిప్పులమీద చల్లి, ఆ నిప్పులను బిడ్డ చుట్టును త్రిప్పి, వీథిలో పారవేయునని—అర్థము.

శ్రీ శాస్త్రిగారు ఈ గీతమునకు టీక వ్రాయలేదు. 'నులిగాయ' అను పదమున కైనను అర్థము చెప్పియుండ వలసినది. అది అందరికిని తెలిసినమాట కాదు. వారికిని తెలిసియుండకపోవచ్చును. దానికేమి ? సర్వజ్ఞు లెవరు ? టీకాకర్త తనకు తెలియని పదముల కర్థమును నిఘంటు సహాయమున తెలిసికొని, పాఠకుల కందియ్యవలె.

సూ. ని., "నులిగాయ=దృష్టి దోషము గాలిసోకు మొద లగునవి కలుగకుండుటకు చంటిపిల్లలకు పురుటాండ్రకును గట్టెడికాయ, దిష్టిపూస" అని వివరించి, ఈ పద్యమును, ఇంకొకపద్యమును గూడ ఉదాహరించి యున్నది. వారా నిఘంటువును చూచుకొని, అర్థము చెప్పియుండవచ్చును. కాని చెప్పలేదు.

లఘువుగా నైనను అర్థము చెప్పకయే, పద్యములోని తప్పులను సవరింపకయే, పద్యము క్రింద—"ఈ పద్యమున ధూర్జటినాఁడు బాలింతలు బిడ్డలను సాకు విధము చిత్రిత మైనది" అని వ్రాసినారు. పాఠకుని కేమి ప్రయోజనము? ఇట్టి వ్రాతలు వారిటీకలో చాలా తావులలో నున్నవి.

## 30. 'పనిలేదా?' 31. 'శరణార్థిఁ జేసి'

"అని యక్కన్యలఁ జేరఁగాఁ బిలిచి యేలా తల్లితోఁ బోరఁగాఁ?
బనిలేదా ? తిరుకాళహస్తిపతిఁ జూప న్మాది భారంబు, మా
వెనువెంటం జనుదెండు, ....రం, డన భక్తిన్ శరణార్థిఁజేసి"
(4—53.)

'పనిలేదా ?' అని శాస్త్రిగారు ప్రశ్న చిహ్నముతో ముద్రించినారు. 'మీ కింకేమీ పనిలేదా ?' అను నర్థము ప్రకరణోచితము కాదు. 'పనిలే—దా తిరుకాళహస్తిపతి' అని పూ. ము. పా.—

"పనిలేదు = మీరు తల్లితో వివరింపనక్కరలేదు, ఆ కాళహస్తిపతిని మీకు చూపు భారవు మాది" అను నర్థ ముచితము. కాబట్టి, పూ. ము. పాఠమే గ్రాహ్యము.

'అర్థిఁజేసి' అనుట సరికాదు. 'అర్థిసేయు' అని క్రియ.—కనుక, పాఠము, 'భక్తిన్ శరణార్థిచేసి' అని యుండదగును. అప్పుడు—భక్తిన్ = భక్తితో, 'శరణార్థి చేసి = శరణుకోరి' అని అర్థమగును.

## 32. 'రెండ రామడన్'

"అద్దమరేయి పోయిరి శివా ! యని పల్కుచు రెండ రామడన్." (4—55)

రెండు ప్రతులలోను 'ఆమడన్' అనియే పాఠము.

'ఆమడన్ పోయిరి' అనుట సరికాదు. "కాలాధ్వము లకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు" (బాల. కారక. 25) అను సూత్రము ప్రకారము, 'ఆమడ'—'ఆమడలు' అని ప్రథమలోనే యుండవలెను. కాబట్టి పాఠము 'రెండ రామడల్' అని యుండనగును.

### 33. 'కాలగంట'

"మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు కాలఘంటయై" (4—97)

అని పూ. ము. పా;— 'కాలగంటయై' అని నూ. ము. పా.—

'గంట' తెనుగు పదము. కాలశబ్దముతో సమసింపదు. కావున పూ. ము. పాఠమే సాధువు.

### 34. 'వేయుచున్'

"కోదండంబుల నిట్టు లొండొరు .... సక్రోధంబునన్ వేయుచున్" (4—189)

రెండు ప్రతులలోను 'వేయుచున్' అనియే యున్నది.

'కొట్టు' అను నర్థమునిచ్చు ధాతువు 'వ్రేయు' గాని 'వేయు' కాదు.

శ. ర. లో,—'వ్రేయు = కొట్టు', 'వేయు=1. వైచు. 2. దిగవిడుచు (బావిలో చెంబు వేసినాఁడు) 3. ఉంచు' అని చెప్పబడి యున్నది.

### 35. 'భుస్సు'

"పై దుమ్ము భుస్సునఁ బోనూఁది" (2—117)

రెండు ప్రతులలోను 'భుస్సునఁ' అనియే యున్నది.

'పాము బుసకొట్టి శివలింగముమీఁద దుమ్మును పోఁగొట్టెన' దని యర్థము. ఊఁదుటయం దగు ధ్వని కనుకరణము, పాము ఘూత్కారమున కనుకరణము 'బుస్సు' గాని 'భుస్సు' కాదు.

"కడియంపుఁ బాములు కకపాలలో నున్న
భూతిమైఁ జిలికిన బుస్సు రనఁగ" (హర. 5—16)

'బుస్సు' నుండి పుట్టినదే 'బుస'. 'భుస్సు—భుస' అనుటలేదు. కాబట్టి, పాఠము 'బుస్సునఁ బోనూఁది' అని యుండుట యుచితము.

పూర్వ ముద్రణములోని యిట్టి సామాన్యప్రమాదములను నూతనముద్రణమున సవరింపబడలేదు. అందలి అపపాఠము లన్నియు నిందు చేరినవి. సాధు పాఠములు కొన్ని చేరలేదు. కొన్ని యసాధువులుగా రూపొందినవి.

నా స్థూలదృష్టికి గోచరించినవి మాత్రమే యిచట చూపబడినవి. సూక్ష్మదృష్టితో పరిశీలించి పరిష్కరింపవలసిన పట్టులు చాలగలవు. సాహిత్యసంపత్తియు, పాఠపరిష్కరణానుభవమును, ఆ రెంటిని మించినశ్రద్ధయు గల భాషాప్రియులు పూనుకొన్న గాని అవి చక్కబడవు.

శ్రీ శాస్త్రిగారైనను కొంచెము శ్రద్ధవహించి యున్నచో పై దోషములలో కొన్ని యైనను తొలఁగి యుండెడివి. మొత్తముమీద గ్రంథ మంతయు పునఃపరిష్కరణము నపేక్షించుచున్నది. శ్రీ శాస్త్రిగారి లఘుటీకయు ప్రమాదభూయిష్ఠముగా నున్నది. ఆ విషయమును మరియొకవ్యాసమున మనవిచేసెదను.

నే నీ విమర్శలో సూచించినసవరణలలో పొరపాటు లుండవచ్చును. అభిప్రాయభేదములును ఉండవచ్చును. విచక్షణులు విచారించి సవరింతురుగాక.

# సౌందర్య శిఖ

శ్రీ మాదిరాజు రంగారావు

ఉజ్వల తర సంగీత తరంగ
స్పందనల కదలికతో
వచ్చింది ఆమె కాంతిమతి
నీడ ఎరుగని దీపశిఖ !

అంధకార శిలాపంక్తుల నకస్మాత్తుగా
చందన శీతల ఛాయాగ్ని వృక్షసమితిగా
స్వర్లోకానికి ప్రతిబింబంగా, జీవితశకలం
ఒక దివ్యదశగా, పరిణమింపజేయు కాంతిపుంజం

ఉదయం వేసిన మొదటి పాదవిన్యాసంలో
అనంతకోటి ఆశాపతాకల ఉత్సాహదీప్తి
తెరచిన కళ్ళనుండి చిందు అమృతకాంతి బిందువులు
ముఖంలో అలలు అలలుగా సాగు స్వర్ణకాంతిహాసం

వర్షాగమవేళా శీతల సుకుమార వాయువువలె
లిప్తల మెట్లపై అడుగుల చప్పుడుతో వస్తున్న
ఆమె పాదాలముందు బారులుగా విచ్చిన వెలుగులు
దృష్టిపథంలో గుత్తులుగా ప్రబ్బికొన్న నీలిమబ్బులు

హృదయంలో పల్లవించి పెదవులపై కుట్మలించి
వాక్కులో సుమించిన ఒక మహాదివ్యానుభూతి
బహువర్ణకాంతి సమ్మిశ్రిత వాయు ప్రసార వలయం
లిప్తలు పరిమళ భరితంచేయు సౌందర్యశిఖ

ఝంఝానిల తీవ్రత్వం నైశిత్యం
అణగిన మొదటి క్షణంవలె
పరిమళ దళ వదనంపై రోచిర్హాసంతో
నిల్చిన హిమబిందువువలె;

సర్వధ్వనులు సంగీత స్వరవిశేషాలవలె తనలో
ఆనందంతో లీనీకరించుకున్న అఖండ శాంతి వలె;
ఆవిష్కృతమైన అవ్యక్త నాద ప్రతిబింబం
మూర్తీభవించిన అమృతభర సౌందర్యలహరి

ఆశావలయ పరివేష్టితమైన అఖండశాంతి
ఆమె వెంటనంటి పరుగెత్తి వచ్చింది మూర్తి కట్టి -
ఇతరులకభేద్యమై అగోచరమైన నా అంతఃకరణంలో
ఆమె కదలిక, కాలచక్రంయొక్క లయాత్మక గమనం

రవికిరణం భూమిపై అడుగిడకముందే
ఒక పల్చనిగాలి తెరపై ఊహాచిత్రపరంపర
సృష్టించుకున్న, ఆకాశ శతపత్రంవలె—ఆమె.
గగనభాగంపై మేఘపంక్తి అవతరించగనే
స్వాదుతర సంగీత మాధురీస్విన్నమై తనలో తా
పరవళ్ళుత్రొక్కు రోచిరుదార సముద్రంవలె—నేను.

# స్థలపురాణములలో వస్త్వైక్యము

శ్రీ వేదాంతం గోపాల కృష్ణమాచార్యులు

స్థలపురాణములందలి వస్త్వైక్యమును బరిశీలించుటకుఁ బూర్వ మీ పదమున కర్థమేమో నిరూపితము గావలెను గదా! శోకాంతరూపక స్వభావ వివేచనాత్మకముగా నారిస్టాటిలు వెలయించిన Poetics గ్రంథమును వ్యాఖ్యానించిన ఇటలీ, ఫ్రాన్సు దేశములకు జెందిన విద్వాంసు లైక్యత్రయ సిద్ధాంతమును నెలకొల్పిరి. ఆరిస్టాటిలు రూపకములలో 1. Unity of Action, 2. Unity of Time, 8. Unity of Place తన్నిర్మాతలు పాటింపవలెనని శాసించినాఁడని వారి వాదము. ఈ మూఁడిటిలోఁ దొలి పదమునకు వస్త్వైక్యమను పదము తెలుఁగున సమానార్థకముగా లోకమున వ్యవహృతమగుచున్నది.

ఆరిస్టాటిలు 'Unity of Place' లేక 'Unity of Time' ను రూపకములలో ననివార్యముగాఁ దన్నిర్మాతలు పాటింపవలెనని శాసించినాఁడను టాతని గ్రంథమందలి క్రింది వాక్యము నాధారపఱుచుకొని వ్యాఖ్యాతలు ప్రవర్తింపఁజేసిన వాదము.

"They differ, again, in length: for Tragedy endeavours as far as possible, to confine itself to a single revolution of the sun, or but slightly to exceed this limit, where as the Epic ation has no limits of time. This, then, is a second point of difference, though at first the same freedom was admitted in Tragedy as in Epic poetry." (Aristotle's Theory of Poetry and Fine Art—By S. F. Butcher p. 21.)

ఎపిక్ (Epic), ట్రాజెడీ (Tragedy) యను భిన్నసాహిత్య ప్రక్రియలకుఁగల సామ్యవైషమ్యములను నిరూపించుచుఁ బూర్వోక్త వాక్యముల నారిస్టాటిలు రచించినాఁడు. ఈ వాక్యములు శాసకములుగావు. నాఁటి గ్రీకు రంగస్థలమునం దనుసరింపఁబడుచున్న పద్ధతిని మాత్రమే సూచించును. అదియు సార్వత్రికము గాదనుటకుఁ దుదివాక్యమే నిదర్శకము. ఈ నియమ మనేక గ్రీకు శోకాంత రూపకములలో నుల్లంఘింపఁబడినది. Unity of Place ఆతనిచే నభిలషింపఁబడిన దనుట కాధారము గ్రంథమున మృగ్యము.

ఆరిస్టాటిలు గ్రంథమున విపులముగాఁ దొలుత శోకాంత రూపక వస్తు నిర్మాణ శిల్పము పరామృష్టము. తరువాత మహాకావ్య రచనా శిల్పము విషాదాంత రూపక శిల్పమునుండి యెట్లు భిన్నముగా నుండునో సంగ్రహముగా సూచింపఁబడినది. శోకాంత రూపకముయొక్క ప్రధాన ప్రయోజనము ద్రష్టలలో శోక భయముల నుద్దీప్తమొనర్చుట. ఈ ఫలము సాధారణులకంటె నున్నతుఁడుగా నిరూపింపఁబడదగి కేవలాచ్ఛశీలిగాని, దుష్టుఁడుగానిగాక యొకానొక స్వాభావిక లోపము గలిగిన[1] నాయకుఁడా కళంకము హేతువుగా నత్యున్నతదశనుండి పరిభ్రష్టుఁడైనట్లుగా నిరూపించినచో సాధితమగునని యతని వాదము. శోకాంతరూపకము సమగ్రమగు నొక సంఘటనమునకు నియమిత పరిమాణముగల యనుకృతి యని నిర్వచనము. నాయకుఁ డున్నత దశనుండి పరిభ్రష్టుఁడై, సామాజికులలో శోకముద్దీప్తమగుట కుచితములగు సంఘటనములు సంయోజింపఁబడుటకుఁ గథాగతిచే నవకాశముండునట్లుగాఁ దద్వైపుల్యము నియమితము గావలెనని వివక్ష. వస్తువును బ్రారంభము, మధ్యము, అవసానము నుండునట్లుగాఁ దీర్చవలెను. ప్రారంభమనఁగాఁ దదవగతికిఁ బూర్వవృత్తానపేక్షమైనది. తరువాత గథ ప్రవర్తిల్లుటకుఁ దగినదియును. మధ్యము పూర్వ పరకథా సాపేక్షమై యుండవలెను. అవసానము పూర్వకథానుసారియై పరవృత్తానపేక్షమై యుండవలెను. అంతటితోఁ గథా నిర్వహణము ఫలవంతమై సమాప్తము గావలెనని భావము. ఈ నిర్వచనములకు సారాంశముగా నాతఁడు రెండు లక్షణములను దుదకు వక్కాణించినాఁడు.

1. కథ యాకస్మికముగాఁ బ్రారంభింపఁబడక ముగింపఁబడక యందలి సంఘటనములన్నియు హేతు హేతుమద్భావ సూత్రితములై యున్నచో నా వస్తువును సుసంఘటితమని చెప్పఁదగును.

2. కథావస్తువు మానవ శరీర సదృశ్యము. వస్తువుగా సంయోజింపఁబడిన యనేక సంఘటనములలో దేనినిగాని స్థలాంతరమునకు మార్చినను బరిహరించినను కథా సౌమస్త్యము

---

1. Hamartia యను పదమునకు స్వాభావికలోపమని యర్థము చెప్పరాదని Humphry House యను విమర్శకుని నిరూపణము.

A clear warning is needed against the tendency of Critics to use Aristotle's phrase 'Hamartia' as a general inclusive phrase to cover moral faults and failings. 'Hamartia' is not a moral state, but a specific error which a man makes or commits.
(Aristotle's Poetics, By Humphry House, see pp 93-96)

నకు భంగము వాటిల్లవలెను. అనఁగా సంఘటనము లాధారా ధేయభావము గలవిగా నుండవలెననుట.

మహాకావ్యమును (Epic), శోకాంత రూపకమును భిన్నసాహిత్య ప్రక్రియలు. మహాకావ్యమందు వృత్త మాఖ్యాతము. శోకాంత రూపకములం దట్లుకాక, సామాజికులకు వర్తమానకాల మందు జరుగుచున్నట్లుగా వివిధ సంఘటనములు నిపుణముగాఁ బ్రదర్శితములు గావలెను. ఈ భేదము గ్రంథముల స్వభావము నకు సంబంధించినది. మహాకావ్యము శ్రవ్యము. రూపకము దృశ్యము. ఇది హేతువుగా నేకకాలికములగు ననేక సంఘటనము లను మహా కావ్యమందు వర్ణింపవచ్చును. అవి ప్రధాన కథా సంబంధానపేతములుగారాదు. తదుపేతములైననే గ్రంథము నకు వైపుల్యమును, గాంభీర్యమును సాధించును. ఈయొక్క భేదమును మాత్రమే నిరూపించి రెండవభేదమును ఛాందస మని యారిస్టాటిలు వచించుటచే మహాకావ్యమందును వర్ణింపఁ బడిన వివిధ సంఘటనములకు హేతు హేతుమద్భావ మపరి హార్యమనియే తేలుచున్నది. శోకాంత రూపకములలోఁ బలు తెఱఁగుల ఛందస్సుల నుపయోగింపవచ్చును. మహాకావ్యములలో మాత్రము Hercoc Metre నుపయోగింపవలెనఁట! గ్రీకు మహా కవులందరు నీ నియమమును బాటించుటచే నా ఛందస్సు తదుచితమని యాతని నిరూపణము.

వస్తు నిర్మాణమునకు సంబంధించి భాషా ప్రక్రియా భేదముల నాశ్రయించి నిరాకరింపరాని విశ్వజనీనములగు రెండు నియముల నారిస్టాటి లేర్పఱిచినాఁడని పూర్వ పరిశీలన మాధార ముగా నంగీకర్తవ్యము.

1. ఇతివృత్త నిర్మాణ ప్రకారము తదుద్దిష్ట ఫలముచే నియమింపఁబడును.

2. వస్తువు నానా సన్నివేశ సంయోజనముచే నేర్పడును. వానికి సంగతి యావశ్యకము.

వాక్య మర్థబోధన క్షమము గావలెనన్నచో నాకాంక్షా సత్తి యోగ్యత లెట్లపరిహార్యములో లౌకికాలౌకిక కార్య ములకు నారంభ ప్రయత్నా ద్యవస్థ లె ట్లపాకరింపఁదగనివో (అలౌకిక కార్యమనఁగా దృశ్య శ్రవ్య కావ్యగత నాయకులచే నిర్వ హింపఁబడు కార్యమని భావము. ఈ కార్యముయొక్క పంచావస్థ లగు నారంభ ప్రయత్న ప్రాప్త్యాశాదుల కర్త్రప్రకృతులని వ్యవ హారము) యట్లే పూర్వోక్త నియమములు సర్వత్ర వర్తించు సామాన్య లక్షణములు. ఈ నియమము లుపేక్షింపఁబడినచో నానా సన్నివేశము లేక వాక్యతను బొరయక ప్రయోజన విరహిత ములగును. కావున నీ దృశమగు వస్త్వైక్యము స్థల పురాణము లందును గానవచ్చునని నిశ్చయము.

ఈ విషయమును నిరూపించుటకుఁ బూర్వము స్థల పురా ణములకు ఫలమేమి యను ప్రశ్నమును సమాధానింపవలెను. పాండు రంగ మహాత్మ్యము నుపలక్షకముగా గ్రహించినచోఁ దదర్థ ప్రవర్తనమునకుఁ బార్వతి పరమేశ్వరు నీ క్రింది ప్రకారముగాఁ బ్రార్థించుట బీజము.

"విజ్ఞానమయ! మహాప్రాజ్ఞ! యో సర్వజ్ఞ
ప్రార్థింతు నిన్నొక్క యర్థ మేను
నిర్వాణ ఫలదమై నీ కున్కిపట్టైన
క్షేత్రంబు దేవతా సింధు ముఖ్య
తీర్థంబుల జయించు తీర్థంబు సత్యుత్క
ట ప్రభావంబుల దీప్రమైన
దైవతంబును గూడి దర్శన స్నాన పూ
జనములఁ గలుష భంజన మొనర్పఁ
జాలు నిమ్మూఁడు నొకచోట మేళవించి
యుండునో కాక వేర్పడియుండు నొక్కొ
దీని చందంబు సకలంబు తేటపడఁగ
హృదయ గమ్యంబు చేసి నన్నేలు మనుడు"

అ1—ప 193

ఈ ప్రశ్నమునకు గ్రంథమంతయు సమాధానము. నీ విట్లు ప్రార్థింపఁగా 'నానా కథానిధానంబగుదాని, నిఖిలోన్నతములగు దైవతక్షేత్ర తీర్థముల మేళనం బెఱిఁగించితి' (అ 5—ప 320) యని గ్రంథోపసంహారము. ఈ యుపసంహారముచే నీ కావ్యము నానాకథా నిధానమనియు దీనఁ బ్రతిపాదింపఁబడినది నిఖిలోన్నతములగు దైవతక్షేత్ర తీర్థముల మేళన మని యును స్పష్టమగుచున్నది. ఈ గ్రంథమునకు సంబంధించి నంతలో క్షేత్రమనఁగాఁ బౌండరీక వసుధాతలము. దైవత మనఁగాఁ బాండురంగ విఠ్ఠలుఁడు. తీర్థ మనఁగా భైమి. ఈ మూఁడును సర్వోత్కృష్టము లనియును భోగాపవర్గదాయ కము లనియు శ్రోతల కెఱుక కలిగించుట గ్రంథోద్దిష్ట ఫలము. ఈ ఫల నిర్వహణార్థమే యిందలి భిన్న కథలు ప్రవర్తించిన వని నిరూపిత మగుచో నీ గ్రంథమున వస్త్వైక్యము సాధిత మగును. పద్మపురాణము గూడఁ దీర్థముల మహిమాతిశయము నకు భూమియొక్క విస్మయావహమగు ప్రభావము, సలిల తేజము, మునిపరిగ్రహమును హేతువులని వ్యక్తీకరించినది. ప్రకృత కావ్యమునఁ దొలి రెండాశ్వాసములలో సంక్షేపతః వాక్రుచ్చఁబడిన విషయములే శేషించిన మూఁడాశ్వాసములలో విస్తరింపఁబడి యుండుటచే వానియందలి విషయములను దొలుత పేర్కొని సమన్వయము గావింతును. పుండరీకుఁడను సన్ముని తపస్సునకు మెచ్చి సాక్షాత్కరించిన శ్రీవత్సాంకుఁ డాతని కోర్కె నంగీకరించి పాండురంగాహ్వయమున నా నెల వును దన్నామ చిహ్నితము గావించి యట నెలసెను. నా తపస్సు చేసిన నెలవు నీ కర్తృత్వ నియతి నేక్షేత్రము నెట్టి తీర్థమును జెందనియున్నతిని బొందుగాత మని పుండరీకుని యభి లాషము. ఆ కోరిక నీ క్రింది ప్రకారమున వచించి భక్త జనసులభుఁడగు మురారి నెరవేర్చెను.

# స్థలపురాణములలో వస్త్వైక్యము

"ప్రకట గుప్తాకారంబునం బశ్చిమాభిముఖుండనై సర్వోత్తమత్వంబు నిర్వహింపుచు నే నిచ్చట ముచ్చటం దవిలి వర్తించెద. సకలక్షేత్ర తీర్థోత్తమంబులగు నీ క్షేత్ర తీర్థంబులుం బౌండరీకంబులై పాండురంగాహ్వ యుండవగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీప సుధాసాగ రంబుల కంటెం బ్రియంబులై నిత్య నివాసంబులై యత్యంత విభవంబుల నభిరామంబు లయ్యెడు, నీ కోరిన యట్ల యిచ్చితి." ఆ 2—75.

ఈ వచనమునం బౌండరీక వసుధాతల సర్వాతిశాయిత్వము సుష్ఠు ప్రతిపాదితము. పినాకికిం ద్రిపురాసుర సంహారవేళం గలిగిన శ్రమచే స్వేదజలము జాలువారి నదీత్వ మొందెను. భీమాహ్వయ మున వర్తిల్ల నాతని మేనం బుట్టుటచే దానికి భైమియను పేరు గలిగెను. ఆ నది పౌండరీక క్షేత్రమును సమీపించి భీతిచేతం బ్రవేశింపలేక గిరిరుద్ధగతియైన కరణి ఘూర్ణిల్లెను. జగ న్నాథుం డది యెఱింగి దానిని బ్రవహింపవలసినదిగా నాజ్ఞా పించెను. ఆ యానతి నది యుబ్బి పౌండరీక ప్రదేశ మను చాపమున నారియై నిగిడెను. దాని శరము తాకిన జగజ్జన జన్మ లక్ష్యములు ఛిన్నము లగును. అట వెలసిన తీర్థములలో నిది శ్రేష్ఠము. దీనికే నృసింహతీర్థ మనియు నామాంతరము. క్షేత్ర వల్లభుండే భైమి సర్వోత్కృష్టతనె 'ప్పాట భవత్సమానమగు పాటి సరిన్నికరంబు లేదు' (2—135) 'గంగ కంటెం బావని వగుచున్ భస్మీకరింపు లోకాపస్మారప్రాయ దురిత బాధా శతము' (5—142) నను వాక్యములచే స్థాపించెను. ఇక విష్ణునితో నభిన్నుడగు పాండురంగని మహిమ నిఖిలోన్నత మనుట స్థితస్థాపకము. ఈ ప్రకారముగా నపూర్వమగు దైవత క్షేత్ర తీర్థముల మేళనమును బరమేశ్వరుండు మీకుం జెప్పిన వడువున రోమహర్షణుం డెఱింగింప శౌనకుండు సంతుష్టు డయ్యెను. ఈ మేళనమును సాధించిన కృతియందలి వస్త్వై క్యము నీ క్రింది పద్యముచే నెలుంగెత్తి చాటినాడు.

'దమనిధి ! విట్ఠలేశ్వరుండు
దైవతరత్నము భైమితీర్థ ర
త్నము నల పౌండరీక వసు
ధాతల మున్నది క్షేత్రరత్న మీ
త్రిమణులు సూక్తి సూత్ర విత
తిం గుదిగుచ్చితిమచ్ఛవోవిధే
య మగుచు నుర్కి నక్షవల
యాకృతి నీ కృతి యొప్పు నెప్పుడున్.'

2—166

తక్కిన మూఁడాశ్వాసములలోఁ బైవిషయములే కథా ముఖమున మనోహరముగాఁ బ్రతిపాదింపఁబడినవి. అది హేతు వుగా ద్వితీయాశ్వాసమున ప 3–75 లలోఁ గానవచ్చు పుండరీక మహాముని చరిత్రము, తృతీయాశ్వాసము ప 135—176 లలోఁ జతుర్థాశ్వాసము ప 46—116 లలో విస్తరింపఁ బడినది. అట్లే ద్వితీయాశ్వాసమున నాలుగు పద్యములలో సూచితమైన ముక్తకేశి యను గోపిక వృత్తము పంచమా శ్వాసము ప 148—158 లలోఁ బునరావృత్తము. నారదుని ప్రార్థనము నంగీకరించి మాధవకథాశ్లాఘాసక్తుఁడగు పరమే శ్వరుఁ డాతనికిఁ బౌండరీక క్షేత్ర దైవత తీర్థ చారిత్రము నెఱిఁగించుట తృతీయ చతుర్థ పంచమాశ్వాసములందలి విష యము. తృతీయాశ్వాస ప్రారంభము సందలి నిగమశర్మోపాఖ్యా నము నృసింహునికి నెలవగు సంగమతీర్థ వైభవమును వ్యక్తీక రించుట కుపక్రమింపఁబడినది. పీఠికాపురమున వసించు సభా పతి యను సత్తమ విప్రున కుదయించిన నిగమశర్మ సర్వ దుష్కృత్యములు నాచరించి తుదకుఁ దనకుఁ బ్రియతమ యగు వృషలియు నిష్టలగు తనయులును జచ్చిన మరణించుట చేతఁ బారములేని నిర్వేదమును బొంది పూర్వసంస్కార తపః ఫలమునఁ బాండురంగ వల్లభుని దర్శించి సంగమతీర్థమం దాడి కాలము గడవ విగతజీవుఁడై విష్ణు సాయుజ్యమును బడసెను. ఈ విస్మయావహమగు వృత్తాంతమును విని (ఆ 3—ప 3—113) నారదుఁడు మృడునితో నీ క్రింది ప్రకారముగా వచిం చెను.

'దేవ భవత్కృప నరమృగ
దేవ మహాక్షేత్ర మహిమఁ దెలిసితి నస్మ
ద్భావము ప్రమోద మేదుర
భావముఁ గైకొనియెఁ జనియె భ్రమమున్ దమమున్.'

(ఆ 3—ప 119)

తరువాత క్షేత్రగుణ కీర్తనము కానవగును. (ఆ 3—ప 114—134) ఏతద్వైభవ ప్రస్తుతి ద్వితీయాశ్వాసమున ప 76–240 లలోఁ జతుర్థాశ్వాసమునఁ ప 116–136 లలోఁ గూడ దర్శింపవచ్చును. పౌండరీక క్షేత్రమున మాధవుఁడు వెలసిన ప్రకారమును వివరించుటకుఁగాను రాధాదేవీ పుండరీక చరిత్రములు తరువాతఁ బ్రసక్తములు. రాధాదేవీ చరిత్రము క్రింది వాక్యముతో నుపసంహరింపఁబడుటచే నది యెల్ల ఋణ విమోచన తీర్థవైభవ ప్రకాశకమని స్పష్టమగుచున్నది.

'ఇట్లు నిజజల నిమజ్జ జ్జంతుజాలంబులకు ఋణత్రయవిమోచన హేతువగు నా ఋణ విమోచన తీర్థంబునం దపంబు సేసి రాధ కృతార్థయయ్యె.'

ఆ 4—45.

తరువాతఁ బుండరీకుని భక్తికి మెచ్చి సాక్షాత్కరించిన కడారపటుఁడు తత్ప్రియార్థము తన్నామ చిహ్నితమగు నేల వెల యుట వర్ణింపఁబడినది (ఆ 4—ప 46—113). ఈ వృత్తాం తమున కీ క్రింది పద్య ముపసంహారము.

'త్వన్నామ చిహ్నితంబగు
నిన్నేలయె తెల్లదీవి, యేనుండుటకున్

మన్నించి భక్తవాంఛా
భ్యున్నతు లొసఁగుటయె నాకు యుక్తవ్రతమున్
4—114.

అనంతరము జ్ఞానవిరహితములును జడములు నగు ధేనువు కాకము, హంస, చిలుక, పాము, తేనెటీగయు సర్పనాభాసముల వలన నుత్తమ జన్మములను బొంది యా తనువులఁ బౌండరీక ధాము నిశ్చలభక్తి నారాధించి నిశ్శ్రేయసమును బొందుట వర్ణింపఁబడినది. (ఆ 4—వ 137—285) పంచమాశ్వాసము నందలి సుశర్మోపాఖ్యానము పద్మతీర్థ వైభవ ప్రకాశకము. (ఆ 5 73—100). సుశర్మ వృత్తాంతము నీక్రింది పద్యముచేతఁ దీర్థోత్కృష్టత ప్రతిపాదకముగాఁ బరమేశ్వరుఁడు నిర్వహించెను.

"విను మఖిల దురితకులభం,
జనమజ్జన మమృతనిధి వశం బగుటకుఁ గా
వున సర్వ జనోపాస్యం
బనూన మత్తీర్థరాజ మనుపమ మనఘా."
5—100.

ఇఁక నద్భుత రసైకపాత్రమగు ప్రయుత నందను చరిత్రముతో గ్రంథము సమాప్తము. ప్రయుత నందనుఁడు వాధూలు లునిచే శపింపఁబడి కప్పయై గృహస్థాశ్రమము నిర్వహించి పూర్వ జ్ఞానమున సంగమ తీర్థాదులఁ బ్రతిదినము నాడుచుఁ బౌండరీక తలమున నెలకొన్న నృసింహు నారాధించుచు శాపావధియగు నపత్య లాభమును బొంది వెంటనే మోక్షపదవిని బ్రాపించెను. ఈ ప్రకారముగా సర్వోపాఖ్యానములకు స్రవంతులకెల్ల సముద్రమే గమ్యమైనట్లు దైవత క్షేత్రములలో నేదే నొక దాని వైభవమును బ్రకాశింపఁజేయుటయే లక్ష్యము. తల్లక్ష్య సాధనముచే నీ యుపాఖ్యానములు సంగతము లగుచున్నవి. వాని సమీకరణము ఫలవంత మగుచున్నది. ఈ యుపాఖ్యానములకుఁ గవులచే నుపశ్లేషము కల్పింపఁబడిన ప్రకారమును బూర్వ ప్రకరణముల సోదాహరణముగా నిరూపించితిని. దైవతక్షేత్ర తీర్థముల ప్రభావ వ్యక్తీకరణమునకుఁ గవిచే సమప్రాధాన్యము వివక్షిత మగుచో నా స్థలపురాణము ఫల నిర్వహణమున సామగ్ర్యముఁ బొరయును. అట్లుకాక దేని నుపసర్జనీభూత మొనర్చినను నవి పై లక్షణమునకుఁ బ్రకృష్టోదాహరణములగు పాండురంగ మాహాత్మ్య కాశీఖండ సేతుమాహాత్మ్యాదుల కంటె ఫలసాధనమునఁ గించి దూనములగును. నృసింహపురాణమున (ఎఱ్ఱయ) క్షేత్రమూర్తి వైభవ వ్యక్తీకరణము ప్రధానము. అనఁగా స్థల తీర్థము లప్రధానములు గావింపఁబడినవని స్పష్టము. పినుగు లక్ష్మణకవి రామేశ్వర మాహాత్మ్యమునందా మార్గమునే యవలంబించెను. నృసింహపురాణమున నాలుగాశ్వాసములలో నృసింహావతారమే వర్ణితము. అట్టిఁడహోబలము నెలవుగా నెగడుచున్నాఁడను పంచమాశ్వాస మందలి సంబంధ కల్పనముచే స్థలమునకు మహత్త్వము ఘటిల్లుచున్నది. శ్రీనివాస విలాస సేవధి (శేష్మ లూరి వేంకటార్యుఁడు); చొక్కనాథ చరిత్రము (పచ్చుకప్పురపు తిరువేంగళనాథకవి) మున్నగువానియందు క్షేత్రవల్లభుని లీలలకుఁ బ్రాధాన్యము వివక్షితము. ఇఁక స్వతంత్రములుగా నిర్దేశింపఁబడిన యక్షగానాదుల స్థలతీర్థములు విస్మృతములై క్షేత్రవల్లభుని శృంగార లీలావర్ణనమే ధ్యేయమైనది. ఇవి నిశితముగాఁ బరిశీలించినచో స్థలపురాణాభాసము లనఁదగినవి. ఈమాట తాత్త్విక సత్యమే గాని వ్యవహార సమ్మతముగాదు. ఈ వర్గమునఁ జేర్పఁబడిన భావనారాయణవిలాస శ్రీపాదరేణు మాహాత్మ్యములు దైవతక్షేత్ర తీర్థములను త్రితయములో దైవత మహిమను వ్యక్తీకరించుచుండుటచేతను, శేషించిన గ్రంథములు నొక ప్రత్యేక స్థలము నాశ్రయించిన యర్చావతారము యొక్క శృంగారలీలలనే వర్ణించుచుండుటచేతను, దత్సదృశ్యములగు కథలు నిశ్చయముగా స్థలపురాణములుగా గ్రహింపఁబడుచున్న చొక్కనాథచరిత్ర శ్రీనివాసవిలాససేవధులందుఁ గానవచ్చుచుండుటచేతను వానికిఁ బ్రకృత పరిశీలనమునఁ బ్రవేశము సమర్థనీయము. ఇవి స్థలపురాణాభాసము లనుట వ్యవహార విరుద్ధ మనుటను గొంచెము వివరింతును. చొక్కనాథ చరిత్రమున మధుర నెలకొన్న పరమేశ్వరుని యరువదినాలుగు లీలలు వర్ణింపఁబడినవి. స్థల తీర్థ వైభవ ప్రకాశనము గ్రంథమునఁ గానరాదు. ఈ లీల లన్నియు క్షేత్రవల్లభుఁడు భోగాపవర్గదాయి యను నర్థమును సమర్థించుచున్నవని స్థాపించుటయు దుర్లభము. తటాతకా పరిగ్రహాదుల లపవాదములు గాక తప్పదు. కాని యీ గ్రంథము స్కాందపురాణాంతర్గత హాలాస్య మహాత్మ్యము ననుసరించి వ్రాయఁబడినది. దీనికి మధురాపురాణ మనియు నామాంతరము. శ్రీనివాస విలాస సేవధిని వేంకటాద్రి మాహాత్మ్య మిరవొంద రచించితినని కవి యవతారికలో ననుచున్నాఁడు. ఈ గ్రంథమును గీర్వాణ వేంకటాచల మాహాత్మ్యమున కనుసరణము. వీనిని స్థలపురాణము లనక తప్పదుకదా!

స్థలపురాణములందు వస్త్వైక్యము గలదని పూర్వ విచారముచే సిద్ధాంత మొనర్పవచ్చునుగాని యొక యవరోధము మిగిలిపోయినది. దానిని బరిహరించినచో నది నిరాక్షేపమగు సిద్ధాంతముగా నిలుచును. ఈ గ్రంథములందు స్థూల దృష్టికిఁ బూర్వాపర విరోధము గానవచ్చును. ఈ విరోధము పరిహృతము గానియెడ గ్రంథలక్ష్యమునకే ముప్పు వాటిల్లును.

# స్థలపురాణములలో వస్త్వైక్యము

వస్త్వైక్యము ఛిన్నమగును. ఏనుఁగు లక్ష్మణకవి రామేశ్వర మాహాత్మ్యమునందలి క్రింది పంక్తులను బరిశీలింపుఁడు.

జ్ఞానము వలనం జెడు న
జ్ఞానము, కర్మమునఁ జెడదు, జ్ఞానమునాఁ బ్ర
జ్ఞానిలయ ! పరబ్రహ్మ
జ్ఞానము వేదాంతవాక్య జనితంబునుమీ.
ఆ 3—వ 25.

అట్టి యెఱుక విరక్తుఁ డౌనట్టి మాన
వునకు నుదయించుఁగాని యన్యునకుఁ గాదు.
3—26.

ఈ పంక్తులచే గ్రంథమునఁ బ్రతిపాదితమైన యర్థమంతయు భంజింపఁబడు ననుట వివరణానపేక్షము. అట్లే కాశీఖండమునఁ బ్రతిపాదింపఁబడిన తత్త్వాల సర్వాతిశాయిత్వమంతయు నగస్త్యుఁడు లోపాముద్రకుఁ గావించిన క్రింది వివరణముచే విచ్ఛిన్నము గాకతప్పదు.

జ్ఞానమునఁ గాని మోక్షంబు సంభవింప
దతివ! జ్ఞానంబనంగ వేదాంతవాక్య
సంభవంబైన దదియపో జ్ఞానమంద్రు
తరుణి విజ్ఞాన మీ సూక్ష్మమెఱిఁగికొనుము. 3—69.

తీర్థములు మానసములు ముక్తిప్రదములు
తరుణి యివి మేలు బాహ్యతీర్థములకంటె
మానవుం డివి యేమఱి మధురవాణి!
బాహ్యతీర్థంబులాడ నిష్ఫలము సూవె 3—71.

తీర్థంబు సత్య మింద్రియ నిగ్రహము తీర్థ
మనసూయ తీర్థంబు వనరుహాక్షి!
తీర్థంబు దానంబు తీర్థంబు సంతోష
మనుకంప తీర్థంబు కనకగౌరి !

బ్రహ్మచర్యంబు తీర్థంబు తీర్థము ధృతి
యమము తీర్థము విద్రుమాధరోష్ఠి
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుఁబోఁడి

తీర్థములు మానసంబులు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివి యాడకాడినట్టి
పంచజనులకుఁ గలహంస పక్షిగమన
బాహ్యతీర్థావలులు తీర్థఫలము నీవు. 3—72.

బిసరుహపత్ర లోచన! కృ
పీటములందు మునింగియాడవే
మొసళులు మీలు కర్కటక
ముల్ గమఠంబులు వాని కబ్బునే
యనదృశమైన తీర్థఫల
మట్టి విధంబు సుమీ తలంప మా
ననమగు తీర్థమాడని జ
నంబులకుం బహుబాహ్య తీర్థముల్. 3—73.

సుదతి! యేటికి నంతర్విశుద్ధి లేని
బాహ్యసంశుద్ధి బహుతీర్థ పరిచయమున
వేయుఁగడవల జలమున వెలిఁ గడిగినఁ
గలుగునే శుద్ధి వారుణీ కలశమునకు. 3—74.

రాగదోషమలాపహారక్షమంబు
మానసంబైన తీర్థంబు మందగమన!
యవనిఁ బంకరజోవ్యపాయక్షమంబు
బాహ్యతీర్థంబు మేచకోత్పలదళాక్షి !

జ్ఞానసంపదగాని మోక్షంబులేదు
కర్మశతముననేని యో నిర్మలాత్మ!
జ్ఞానమనఁగ వేదాంత విజ్ఞాన మబల !
యితర విజ్ఞాన మజ్ఞాన మెంచిచూడ—
భీమఖండము. 5—186.

ఈ పద్యములు సమూలకములు. స్కాందపురాణాంతర్గత కాశీఖండ మందలి క్రింది శ్లోకములను బరిశీలింపుఁడు.

న జలాప్లుత దేహస్య
స్నాన మిత్యభిధీయతే
స స్నాతో యో దమస్నాతః
శుచిః శుద్ధ మనోమలః
యో లుబ్ధః పిశునః క్రూరో
దాంభికో విషయాత్మకః
సర్వతీర్థే ష్వపి స్నాతః
పాపో మలిన ఏవ సః
న శరీర మలత్యాగాత్
నరో భవతి నిర్మలః
మానసేతు మలే త్యక్తే
భవత్యంతః సునిర్మలః
జాయంతే చ మ్రియంతే చ
జలేష్వేవ జలౌకసః
నచ గచ్ఛంతి తే స్వర్గం
అవిశుద్ధ మనోమలాః

చిత్త మంతర్గతం దుష్టం
తీర్థ స్నానాత్ న శుద్ధ్యతి
శతశోఽథ జలై ర్ధౌతం
సురాభాండ మివాశుచి2.

ప్రకృతోదాహరణములచేతఁ దీర్థసేవనము మోక్షదాయక మను విషయమే విమర్శనీయమై గ్రంథములందుఁ బూర్వాపర విరోధము గానవచ్చి తత్ప్రచనాసర్వస్వమగు నాయా క్షేత్రముల ప్రాశస్త్య ప్రతిపాదన మను ఫలము విచ్ఛిన్నమగు చున్నది. అదియునుగాక యీ పంక్తులయందలి ప్రతిపాదనము శ్రుతి స్మృతి సిద్ధమగు నర్థము. 'జ్ఞానదేవహి కైవల్యమ్' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే' అని ప్రమాణములు. ఈ విరోధము నీ క్రింది విధముగాఁ బరిహరింప నగును. తపస్సు కాయికము, వాచికము, మానసికము నని మూఁడు విధములు. ఇందుఁ జాంద్రాయణాదులు, తీర్థ సేవాదులు కాయిక తపస్సు. వేదాధ్యయన ప్రణవ జపాదులు వాచనిక తపస్సు. విష్ణు భావనాదులు మానసిక తపస్సు. వీనిలోఁ బూర్వ పూర్వముల కంటె నుత్తరోత్తరములు శ్రేష్ఠములు. ఫలితములును దదనుగుణములు. ఈ సమన్వయమువలన బాహ్యతీర్థములకంటె నాభ్యంతరతీర్థము లుత్తమము లను ప్రతిపాదన ముపపన్న మగుచున్నది. పైఁ జెప్పిన త్రివిధములగు తపస్సుల వలన నుత్తమ లోకములు ప్రాప్తించును. ఈ యుత్తమ లోకము లన్నియు నిత్యములు గావు. పునరావృత్తి రహితములు గావు. అందువలననే పరాశరుఁడిట్లు వచించెను.

భూర్భువః స్వర్మహః జన
స్తపః సత్యం తథైవచ
సప్తైతే స్వర్గలోకావై
సత్యాదూర్ధ్వం నవిద్యతే
తస్మాల్లోకాత్ పరాముక్తి
రర్వాచీనా దపేక్షయా
తస్మా ద్వర్జయేత్ కర్మ
స్వర్గాదేరపి సాధకమ్
సంసరేత్ స్వర్గతః కర్మ
క్షయే సతు పునర్యతః

లోకము లన్నింటిలో సత్యలోకము చరమమనియు నచ్చటి నుండి పునరావృత్తి కలుగదనియుఁ దద్భిన్నములగు లోకములలోని ముక్తి సాపేక్షకమనియు శ్లోక తాత్పర్యము. ఈ ప్రమాణముల నాధారపఱచుకొని తీర్థసేవనమువలన బ్రహ్మలోకప్రాప్తి కలుగకపోయినను నుత్తమ లోకములు సంభవించునని యంగీకరింపవచ్చును. ఉత్తమ లోకములు కలుగుట స్థలపురాణములఁ బ్రతిపాదితము. కావుననే నారదుఁ డుమావల్లభుని

"సమ్మార్జనమునధ్వాంక్షము నుపలేపనం
బునమరాళము రంగమున విచిత్ర
శుకము, దీపాంకుర ప్రకటనంబునఁ బాము

2. ఈ యర్థమునే మధ్య యుగమున నుద్భవించిన కబీర్, నానక్ ప్రభృతులును బోధించిరి. పుణ్యతీర్థములలో స్నాతుఁడవు గమ్మని యుపదేశించిన బ్రాహ్మణున కొకనికిఁ గబీ రీ క్రింది విధముగా సమాధానము చెప్పినాఁడు.

He who is foul within will not go to Heaven by bathing at a place of pilgrimage

Nothing is gained by pleasing men, God is not a simple fun

Worship the Lord, the only God;

Serving the Guru is the true ablution

If salvation be obtained by bathing in water, the frogs which are continually bathing will obtain it;

But as the frogs, so the pilgrims ; they shall be born again and again

If a hardened sinner die in Banaras, he cannot escape hell,

If a saint of God die in Haramba, he saveth a whole multitude

Where there is neither day nor night, Vedas norShastras there dwelleth theFormless one saith Kabir, meditate on him, ye foolish denizens of the world.

See—The Sikh Religion, pp. 214-15 It's Gurus, Sacred writings and Authors Vol. IV, By Max Arthur Macanliffe

దాదూ తీర్థయాత్రాచరణము నిరుపయోగమని వచించినాఁడు. అతని సంప్రశ్న మీ క్రింది తెఱఁగున నున్నది.

In vain do people go on pilgrimage to holy places

The actions attached to thy body, to the holy places thou goeth to wash

But the actions that thou doeth there, how will thee be rid of

See—The Nirguna School of Hindi poetry p. 110, By Pitambardatta Barthwal.

# స్థలపురాణములలో వస్త్వైక్యము

సదవద్మ తీర్థానుభవము కతన
సరఘుయు నూథన్య పరి షేచనంబున
ధేనువు మోక్షంబు తెరువుఁ గనియె.''

పాండురంగ మాహాత్మ్యము 4—137.

వని యాతఁడు వచింపఁగా నీ క్రింది ప్రకారముగాఁ బ్రశ్నిం చుట. కవకాశమును, వాని కుత్తమలోకప్రాప్తి కలిగెనను నర్థమును సమర్థనీయము లగుచున్నవి.

అనిన నారదుఁ డిట్లను నభవ ! జ్ఞాన
విరహితంబులు జడములు వీనికెట్లు
మనుజకృత్యంబు చేకూరె మధువిరోధి
యెట్లు వరమిచ్చె నని వేడ నీశుఁ డనియె.

ఆ 4—ప 137.

వాని కుత్తమలోకప్రాప్తి యనఁగా నుత్తమ జన్మములు సంభవించుటని సమన్వయించుకొనవలెను. శుకాదులకుఁ బాండురంగ మాహాత్మ్యమునం దుత్తమ జన్మములు కలిగి నట్లే వర్ణింపఁబడినది. అందాఁక నేల ? సుశర్మకుఁ గూడ పద్మ తీర్థవారిమజ్జనమున నాకావాసమే కలిగినది. ఆతఁడు మరు ద్భోగములను గాంచి పుణ్యక్షయముచే ధరయం దగ్రాన్వయమున జన్మించి సాక్షాద్బ్రహ్మమగు పౌండరీకపతి నారాధించి చంద్రావాసమును గాంచి తిరిగి సుకీర్తియను పేర ధాత్రీపతిగా నుద్భవించి సన్యసించి భక్తియోగమున లక్ష్మీరమణుని గలిసెను. ఈ సమన్వయములు మార్మికుల కుద్దిష్టములు. సాధారణులకు సంశయమే సంభవించుచోఁ గలివేళ భక్తియుఁ దీర్ఘసేవనమును గైవల్య ప్రాపకములను సాధారణమగు సమాధాన ముండనే యున్నది.

కృతయుగమున ముక్తి దొరుకు నెఱుకచే జనాళికి

—రామేశ్వర మాహాత్మ్యము 1—40.

కలిఁదేఁ జాలు మదీయభక్తి రుచి భక్తశ్రేణికత్రాంతమున్.

—పాండురంగ మాహాత్మ్యము 4—98.

రామేశ్వర మాహాత్మ్యము నందలి క్రింది వాక్యములుఁ బ్రకృత సమన్వయావష్టంభకములై ధర్మసూక్ష్మజ్ఞుల మదికి ముద మొదవించు చున్నవి.

''గగనగతుండగు తపనుండు పెక్కు జలఘటంబులం బెక్కు మూర్తులు వహించి చూడంబడు వడువున నీ వొక్కరుండవయ్యు నభోవాతాగ్ని సలిల పృథ్వీ దేవ నర తిర్యగాది నానోపాధుల ననేక ప్రకారంబులం గనుంగొనం బడుదువు. జపాకుసుమాది సంయోగంబున శుద్ధ స్ఫటికంబు నానాత్వంబు భుజించు తెఱంగునం బ్రకృతి సాంగత్యంబునంజేసి బహుప్రకారంబులం గానంబడుదువుగాని నీ వొక్కరుండవు. ధ్యానంబునం గొందఱు, జ్ఞానంబునం గొందఱు, కర్మయోగంబునం గొందఱు, సంకీర్తన స్మరణ వందన పూజన దాస్యంబులం గొందఱు నిన్నారాధించి నిత్యాభియుక్తులై సిద్ధి వడయుదురు. సమలోష్టాశ్మకాంచనులు, నిందాస్తుతి తుల్యులు, సంగవివర్జితులు, నిశ్చలచిత్తులు, హర్షామర్ష భయోద్వేగ ముక్తులు, యదృచ్ఛాలాభ సంతుష్టులు, నిర్మత్సరులు నగు భక్తులు నీకుం బ్రియతములై వెలుంగుదురు.''

ఆ 4—129.

ప్రకృత విచారముచేత గ్రంథముల స్థూలదృష్టికి గోచరమగు పూర్వాపర విరోధము పరిహృత మగుచున్నది.

స్థలపురాణముల వస్త్వైక్యము గలదని సిద్ధాంతిత మగుచున్నది. 3

---

3. ప్రకృత వ్యాసము 'స్థలపురాణ స్వభావ పరిశీలనము—చరిత్రము' నను పేర నా వ్రాసిన గ్రంథమందలి 'కవిత్వ స్వభావమను' నధ్యాయమందలి యారు శీర్షికలలో నొకటి. అది హేతువుగా నీ వ్యాసమం దొకచో పూర్వ ప్రకరణముల ప్రసక్తి కానవచ్చును.

మీ చిన్ని సుకుమారుడు **ఇంజనీరు** కావచ్చు

## అతడి చదువుకు డబ్బు నిచ్చే సులభమార్గం యిదిగో!

మీ కుమారుడు 5 సం॥రాల ఇంజనీరింగు డిగ్రీ పొందుటకు (హాస్టల్ ఖర్చులు మినహా) అధమం రు. 6000 లు కావాలి. ఆ సమయానికి యింత డబ్బు చేతికి రాకపోవచ్చు. అందువల్ల, అతడి కొరకు యిప్పుడే జీవిత భీమా విద్యా వార్షిక పట్టా తీసుకుని అవసరమగు డబ్బును సమకూర్చండి. ప్రీమియాలు చెల్లించుట అతి సులభం. చూడండి మీకు 25 ఏళ్లు, మీ కుమారునికి రెండేళ్లు వున్నచో నెలకు రు. 26.32 లు మాత్రమే మీరు చెల్లించాలి. అతనికి 18 ఏట నుండి 5 ఏళ్ల వరకు అర్ధ సం॥రానికి రు. 600 ల చొప్పున వస్తుంది - (వయస్సునుబట్టి రేట్లు మారును). ప్రీమియములు పూర్తిగా చెల్లించేవరకు మీరు బ్రతికి వున్నా లేకపోయినా పూర్తి భీమా మొత్తము అర్ధ సం॥ వాయిదాలలో 5 ఏళ్లలో మీ కుమారునికి చెల్లించబడును. మరే విధమైన పొదుపు మార్గము మీకే సౌలభ్యాన్ని కలిగించదు.

ఈనాడే మీ కుమారుని కొరకు జీవిత భీమా విద్యా పట్టా తీసుకోండి. ఆలోచన ఆచరణకు శత్రువు. ఆలస్యం చేయవద్దు. మీకు వయస్సు ఎక్కువైనకొద్దీ ఎక్కువ ప్రీమియములు చెల్లించాలి. అంతా అదృష్టానికి వదలవద్దు — ఎల్. ఐ. సి. కి వదలండి.



**జీవిత భీమా**
సురక్షిత హస్తాలలోనే మీకు భద్రత

ASP/LIC-80

# దోదమ్మ



శ్రీ మల్లాది
రామకృష్ణశాస్త్రి

ప్రన్నాయి మళ్లిన,— మూడునొక్క పొద్దున,—తొలిజామున తళుకేసిన కెంపు చుక్క,—రిమరిమ,సున్నలో కెక్కి— శూన్యం లోకి ప్రాకి,—కానరానంత మేరకమ్ముకునివున్న మొయిలుతుంపరలో,ఒకమినుకు వల్లమాలిన వెలుగై పోవంగా,—రవరవమంచులు చిమ్మి— ఉహుహూలు ధారలుకట్టి,—ఏడుపాయలై ఏక రాశిని,—పాలవెల్లిమీద తొణికిపోగా,—పరుచుకున్న ముత్తెపుచుక్కలు,ఓవాసి కదిలి,—వెలుగని వేడికి తీగెసాగి,—చుక్కలదారిలో సుడి తిరిగి,—నీడలున్న మేరల్లో, చిగురేసి,—తళుకు వాగులో,—మారాకు వేసి,—బెళుకు వాగులో,— మొగ్గతొడిగి,—ఏక మొయిని జారి, ఒంటి రేక విచ్చి,—గాలి తెరకంది,—మరింతవిచ్చుకుని,— మరో అలమీద,—పక్వానికొచ్చి,— పాకానికొచ్చి,—నివ్వరిముల్లంత వెన్నేసి,—అంత వెన్నలోనూ ఓ రెమ్మ, పైరలో మరగిపోకుండా,— నేలమీద,—కానరాక వాలంగా,—

కోనలో నాయకుడికి,— కంటిమీద మెరుపు మెరసి, ఒంటికి సత్తువొచ్చి,— ఒక్క గుక్క, కుశేలొచ్చి,—గురువింద పొదమీద పులుగు పొరెట్టగా,— పుట్టినబిడ్డ పొరెట్టగా,— ఆ చేత అందుకుని,—అమ్ముఁవిడిచినట్లు,—ఎగరేసి,— ఓ చేత అందుకుని,— ఔరకూనా,— సత్తువుంది, సంబరముంది, — గొంతులో బిగువుంది,— చూపులో పదునుంది: కోన ఏలుకునేవులే— అని,—ఓ కన్నె చేతి కెగురవేసి,— కోనదేవరా, వాకిలి పండంత పుట్టి,—తీయమామిడంత తేరుకోవాలి: పగవాడి కంటికి పనసముల్లు, కావాలి,— బైరుకున్న వడిచ్చి,— సింగం కోరకున్న వాడిచ్చి,—నాగంత పగుగిచ్చి,—అలుగంత పదునిచ్చి,—ఆదుకోరా! ... అని, మాట వేసారించి,— ఒంటిరెక్కన గుబురు మొదల,— ఓచెయి విదిలించి,— మంచుకు మల్లె, కెంపు చుక్కలుబుకంగా,—చుక్క నేలరాలకముందే,— కూనకు నుదుర్రద్ది ... ఇది,—నీ వెన్న కాపురా కూనా,—అని, అని,— మొయిలు దేవుడా,—నీవు చినికితే, ముత్తెం దొరికింది ... నీ సత్తెం జూపరా,—అని కొండాడి ... కనులుమూసి,— మూడు అంగలేసి,—ఒకకన్ను తెరిచి, మూడు పరుగులుతీసి,— రెండుచూపులుకలిపి,—మూడు ఉరుకు లురకంగా,—ధగధగమనే గరపవెంపలి మీద,—పచ్చని, కాడ,—రంగుకోచిగురు—చిటారున కెంపంత పువ్వు,—అల్లంత చిటిమాను కానరాగా ... యిదే సత్తెమని,—తోడుగా పెరిగేవని,—చికిలి చికిలింత మండలు తెచ్చి, మానుతేనె పాదుకట్టి,— కడిమిపూల నీరోసి గోగుపుప్పొడి చల్లి,— మూడు పొద్దులకు గుబురుకట్టించి,—గుబురిచ్చిన నీడలో కూనను సాకమనంగా,—

వెల్ల మొయిలు వెలుగేయంగా,— కొండ గోగు పూసినట్టు,—కొణిదెన చిగురేసినట్టు,

ఇరులునిటారోయినట్లు..పున్నమిపున్నమికీ,-ఒక్క-పిడికిలి,-ఒక్క అల్లైతాడు,-రెండు అలుగులు,-ఒక్క-బరిసె, ఒక్క సెలగోల...అంత ఉద్వేత్తుకువచ్చి,— కూనఎదిగి,— కోనకు సిరొచ్చి,-ఏడునిలువులు ఎదిగి,-చిటారుపూవు తోవున్న పచ్చమాను,—వయసొచ్చినట్టు,— 'ఎవరినో కోయని పిలిచినట్లు,— ఊగులు పోవంగా,—

ఆ ఊగున,-కోనవాగుకు వెల్లువొచ్చి... వెల్లువ రెచ్చి వరదొచ్చి,-కాలూన తావులేక ఏకమయం కాగా,- జీవాలన్నీ,-మరో కోనకు ఈదులాడుకుపోగా,-కోనసిరి,-తాపుట్టిపెరిగిన కోనకు వెన్నిచ్చుకోలేక,-మానికి ఎగబ్రాకి,-చిటారుకుపోయి,- కెంపుకొడిపూవును,- గోటితోగిరి,—మాను ఏకం-దీసి,-పదిలంగా చుట్టి,-అమ్ముకు లగించి,—ఆకాశంలోకి అంతరిక్షంలోకి విడువంగా...అలా దూసుకున్న పూవు, దారినిపట్టి..గాలిపొరమీద తేలుకుపోయి,— పుప్పొడి రగులంగా,-బరువెక్కి-, భారమెక్కి-,-తామరల మడుగులో,—మారాజుసీమలో,-సీమ ఏలేవాడి, గారాబాలకూన,- జలకాలాడంగా,—సరసను రాలె:

పూవుసోకినమేర,-బుగబుగలాడి,-బుగబుగలాడినమేర, ముదురుపచ్చదేరి,-వేయినొక్క-చుక్క-, ఒక్క-మొయిని మిడిసినట్లు,- చందమామ దూగర రేగినట్లు,-పాలవెల్లి నేలకూలినట్లు, వెలుగులు చిటపటలాడి,-రంగులు సుడికట్టి,- మడుగునీరు వడిపట్టి,- హంస కదిలినట్టాడంగా,—

రాలినపూవు, రంగు ముదిరి, రేక ముదిరి,-పుప్పొడి పూసకట్టి,-పూస బుడగంత కెదిగి,-గాలిసోకిళ్ల,చిటుకు చిటుకుమనంగా,-పుప్పొడిమంచు కమ్ముకోంగా,-రాచకూనకు,-మాయదార్లి మరులొచ్చె...మనసుకు రెక్క-లొచ్చి నట్టనిపించె,-వినని ఎలుగు వినిపించె,-చూడని చోద్యాలు కనిపించె...

ఇదేమా అనుకున్నది,-రాచకూన,— నిలువలేకపోయె, నిదురగాకపోయె,- వెనుదిరిగి చూడంగ చీకటే అయిపోయె,— తానెవ్వరై నదీ తెలియకనెపోయె... కనుమలపి చూడంగ మునుముందు వెలుగాయె- తనకు అంది నట్లనిపించె - తానంది నట్లగుపించె,-

అలా నిలువలేకపోయిన రాచకూన,- తనకు తెలియక, పలుకులేక,- పట్టు తప్పిన తీవెలాగా,- తీండ్రం మానిన సింగం జూలులాగా,- తమ్మిని విడిచిన తుమ్మెద ఝుమలాగా,- చంద్రుడు సోకిన చెంగల్వలాగ,- సొమ్మసిల్లి సోలిపోయి,- అదేమా అని ఆదుకునేవారు ఎవరూలేన్ని ఏకాంతమాయెనేమో,- మడుగున మల్లెలు కమ్మినట్టు పైన జాజులు పర్యేద సవరించినట్లు,- మందారలు వల్లెవాటు వేసినట్లు,- పూపచిగురులు మేలిముసుగు నిమిరినట్లు,- కానరాని చేతులు,- తనకేమో ఆభరణా లిచ్చినట్లు,- అంగరాగ మలదినట్లు,- చిలిపిసేతలు చేసినట్లు,- లీలగా అనిపించంగా,- బిడియం వసివాడించంగా,- తమకాలూ తబ్బిబ్బులుగా,-

దొంతరవిడియ మందుకున్న మంకెన వాతెరతో,- కాముని చూడబోయే కన్నులతో మోమున నిండిన పున్నముతో,- విన్నాణపు వేడుకతో,- వింత వేదనతో,- అణిముత్తె మంత మురిపెముతో,- చేర్చుక్కంత చెలువంతో,- నివ్వెరిమొనవాసి కలలో,- నిదురంత కాపురంచేసి,- మెలకువంత మగతా మమతా కుదురకోంగా,- రాలిన పువ్వునందుకుని,- దాని నిగ్గులు నిమిరి,- కొనగోర కాటుక దీసి,- ఒక రేకను చికిలించి,- మరో రేక,- కెమ్మోవి కద్ది,- అన్ని రేక లలా నెమ్మోమున హత్తించి,- రాలిన పూవును, రాజసంగా,- పయ్యెద కొత్తులిచ్చి,- చేపట్టిన వాని చెక్కిలి పుణికినట్లు,- వింతమనసు పోయి,- ఏమని పలికేనో-

గాలి పొరమీద తేలివచ్చి,- కాన రాని వలపుతెచ్చి,—అలసిపోని ఆనంద మిచ్చి,- కాంతుడు లేని కాపుర మిచ్చి,- మిన్నంత కలలో కన్నతల్లిని చేసి,- బాలను ప్రోడను చేసినావు, యిది,- ఏ సీమ పట్టిన వానిపంతమే!- తానందుక నన్నందుకుంటి ననుకున్నాడా,- నేలను నడిచేవాడు, నన్ను తేరిచూడరాదు., కొండకొమ్మున ఉన్న వాడైతే,- నన్ను కోరుకోరాదు,- మా నెక్కిన వాడైతే,- తనకు మనసైనా,- మక్కువ తీయలేనని పలుకవే... గాలిని పడిపోc-

రాలినపూవు,- వెల్లగొడుగై విచ్చుకోగా,- విచ్చుకున్న పూవు,- గువ్వలాగ పైన తేలగా,- తనకు తెలియక తానూ కదిలి,-. నీడను అడుగులు వేసి,- ఎదురయే చోద్యాలకు ఎడమోమై,- కంటి కందిన,- వింతలకు పెడమోమై,- సూటిచూపున,- శూన్యంలో వెన్నెల కమ్మినంత మనసున,- అలా అలా,- వాగులు దాటెనో ఏరులు దాటెనో,- గుట్టలు దాటెనో గుబ్బలి దాటెనో,- లెక్క లేకపోయి,-

అలా,-అడుగు కదిలి పోతూండగా,—

తామర మడుగులో, రాచకూన తల పోసినప్పుడు, మానినున్న కోనసిరికి,— కొమరుతనం హెచ్చి,- కన్నె కలలో,- కాంతుడైనప్పుడు,- మానుకూలి నేల పాదం పెట్టి,-తానో తామర మడుగై,- కానరాని, తల్లితనానికి,-నూటొక్క హంస,- కూనలై, కనులబడగా,- సొమ్మసిల్లే ఆనందమొచ్చి,- హంస రెక్కలు అలసటలు తీర్చగా,- ముసి ముసి నవ్వు ముసలితనానికి, ముదిరే వేళ,-

తానెక్కిన మాని తావున,- కలయ దిరిగిన కన్నెలేడి,- కూనను విడిచిపోగా,- లేడికూనకు పుప్పొడి అద్ది,- తామర రేకులు తేనె దొన్నెలు చేసి,- వావిలి పూవులు మెదిపి,- ఆ ఉక్కెర్ల మెక్కించి పెంపకం చేయగా,- కూనకు గుజ్జు సింగమంత, వెన్నొచ్చి, వేటొచ్చి, హంసలతో అన్న దమ్ముల పోలికను,- కోనసిరి కనుల నీడను గువ్వింత లాడుతూ ఉండగా,—

వెల్లగొడుగు నీడ కదలి వచ్చిన రాచ కూన,- తాను ఆ తావుకు చేరుకోగా,-

చూడని తల్లిని చూసిన సంబరాన,- హంసలు కమ్ముకోగా,- ఒక్క హంస గుసగుసపోయి, కోనసిరితో గుసగుస లాడంగా,- తక్కిన హంసలు, బారుతీరి, బరాబరుల నడకలు నడిచి,- కోనసిరిని తల్లి కనులముందుకు తరలించుకురాగా,- లేడికూన సింగం సీటున విద్దెలు చూపించగా,- చోద్యాన ఉన్న రాచకూన,- కోనసిరిని చూసిందై,- కనులు అరమోడ్చిందై,-తల వంచుకున్న దామెను,-

ఒక్క ఎగురున అందిన లేడికూనను, సందిట పట్టిన కోనసిరి మనసు ఎన్నడూ లేని మరులోయింది,-

రాచకూన, ఆకసాన, వెలుగు పొంగినట్లు పొంగిపోయి,- వేయినొక్క చుక్కతళుకాడినట్లు, కదలిపోయె,- అంతలో ముత్తెమంత మోము చేసుకొని,- కనులతో ఏమన్నదనగా‌ను,-

కన్నెతనాన కలవచ్చింది,- మొలకువ లేకనే ఫలించింది,- వెలుగు రాపాడగా పుటక ఎత్తినవాడు,- నన్నేలుకున్నాడు: నేలకు రాలినవాడు,- నా వయసు నిదర పాల్జేసినాడు ... నీవు తెలియక చేసినతప్పు,- నిదురలో నాకు మెప్పయింది ... కాన రాకుండ కాపురం చేశాము,- కలలు హంసలై పుట్టినవి: నాబిడ్డలు, నాకుచాలు; కోనంత కోరికుండి,- లేడికూన నెత్తి పెంచి సింగాన్ని చేసినావు,- దానితో ఆట- ఆపైన నీ బతుకు,- అని,- తనదారిని తాను పోగా,- హంసలు అనుసరించిపోయె ...

నాలుగు గిరులు కట్టి,- మడుగు చేసిన కోనలో కోనంత తామరల మడుగులో- ఆ హంసల పెంపకమాయె ...

గిరుల కొమ్ముల మీద చెంగలించే కూన పరుగందుకోలేక- కోనసిరి,- తాను పెరిగిన చికిలింత నీడనే తానో నీడగా నిలిచిపోయె...













# అమరావతీ శిల్పాలలో స్త్రీల అలంకారాలు




శ్రీమతి యర్రంసెట్టి పద్మావతి

ఆంధ్రదేశము అనాదినుండి వృత్తివ్యాపారములలోను, సాహిత్యములోను, లలితకళల యందును మిక్కిలి ప్రాభవము కలిగియుండి భాగ్యభోగ్యము లనుభవించినది. శిల్ప చిత్రలేఖనములనుండి ఆనాటి సాంఘిక జీవితము కొంతవరకు వ్యక్తమగుచున్నది. శాతవాహనుల నాటి బౌద్ధ శిల్పములనుండి నాటిస్త్రీలకు అలంకారముల ఎడల గల అభిరుచి ఎట్టిదో తెలుసుకొనవచ్చును. అమరావతిలోని బౌద్ధశిల్పములను పరిశీలనగావించినయెడల పై విషయమువిశదము కాగలదు. ఆనాటి శిల్పులు స్త్రీరూపకల్పనలోను అలంకారప్రదర్శన యందును ప్రత్యేకప్రతిభను ప్రదర్శించినారు.

ప్రాచీనశిల్పములలో భావవ్యక్తీకరణ సమగ్రముగ నుండెడిది కాదు. (చూ. చిత్రం 1). అట్లే అవయవములు బిగువుగను, ముఖము భావరహితముగను, పెదవులు దళసరిగను వ్రేళ్లు మోటుగను చూపబడెడివి. ఆ కాలపు శిల్పములలో ఆభరణములు తక్కువ, ఆడంబరము శూన్యము. ద్వితీయ దశయందు మానవరూపకల్పనము కొంతవఱకు పురోగమించినది. (చూ. చిత్రం 2). అంతకు పూర్వము శిల్పములలో ఉండిన మాంద్యత, మొరటుతనము ఈ కాలమున కన్పించవు. ఈ శిల్పములలో జీవకళ స్ఫుటముగా కనుపించుచున్నది. తృతీయ దశయందు ముఖములలో భావ స్ఫోరకత్వము, అంగములలోజీవకళయు విశేషాంశములుగ పరిణమించినవి. (చూ. చిత్రం 3). నాల్గవదశయందు నాజూకు తన ముద్ధ్రవించినది. ఈకాలపు శిల్పములలో మానవ జీవితము బహుముఖములుగ ప్రతిబింబించినది. (చూ. చిత్రం5).

అమోఘమైన ప్రజ్ఞాప్రతిభలకు అమరావతీ శిల్పకళ యొక చక్కని దర్పణము. అమరావతీ శిల్పసుందరుల అంగవిన్యాసములతో లేదీగ వంపు సొంపులు, వళుల విభ్రమము, వక్షోజముల నిండుదనము, రేఖావలయ సంపద వ్యక్తమగుచున్నవి. ఆ సుకుమారదేహములు ఆభరణములను కూడ భరింపలేక అలసట చెందుచున్నవేమో ! అనుభావము చూపరులకు కలుగుచున్నది. కాంతలు సహజముగ అలంకార ప్రియులు. అందువలన అమరావతీశిల్పులు సౌందర్య సామగ్రిని, సాధనములను తమశిల్పములలో విరివిగ ప్రదర్శించిరి. నాయిక తన శిరోజములను సరిదిద్దుకొనుట, హొయలుగా అద్దముచూచుట, సుందరముగ కుండలములను ధరించుట, వయ్యారముతో శయ్య నలంకరించుట, చెలులు తనను ఆభరణములతో నలంకరించుట, పాదములకు 'అలక్తత' (పారాణి వంటిది) పెట్టుట మొదలగు ఘట్టములు అతిరమ్యముగ నిరూపింపబడినవి. వస్త్రాభరణముల ద్వారమున అబలలవర్గ భేదము అతినేర్పుగా సూచింపబడినది.

స్త్రీ పురుషు లిరువురును ఉత్తరీయమును, అంతరీయమును ధరించిరి. అందు కొన్ని పుష్పములు పక్షుల బొమ్మలతో కూడిన అంచులు కలవి, మరికొన్ని వస్త్రమంతయు పూలగుత్తులు కలవి. స్త్రీధరించు ఉత్తరీయమును స్తనోత్తరీయమందురు. ఒక్కొక్కప్పుడు వీటి అంచులలో అమూల్యమైన రత్నములు పొదగబడి యుండినట్లు తెలియుచున్నది. స్త్రీపురుషు లిరువురును అంతరీయమునుగోచిపోసి కట్టెడువారు. (చూ. చిత్రం 5). గోచీకట్టు ఎక్కువ కుచ్చులు కలిగి చూచుటకు అంద

ముగా కన్పించును. దీనిమీద నీవీబంధమనునది చుట్టబడి నట్లు తెలియుచున్నది. (చూ. కటిభూషణములు 1). వీరు ధరించిన వస్త్రములు పాదముల వఱకు వ్రేలాడుచుండెడివి. (చూ. చిత్రం 4). దీనినే అప్రపాదీన లేక పూర్ణోరుక మందురు. 'అర్ధోరుకము' కూడ వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. స్త్రీలుధరించు 'కచ్చా' — 'పంచకచ్చా', 'తాలవతక', 'మత్స్యనాలక', 'శతవల్లిక'ములను విధములుగా నుండెడిది. 'అర్ధోరుక' లేక 'చందాతక'మును ఉత్తమ కులములకు చెందిన స్త్రీలు ధరించుచుండిరి. నాట్యకత్తెలు అర్ధోరుకమును ధరించుచుండిరి. స్త్రీలు మేలిముసుగు ధరించు సాంప్రదాయము నాడు కలదు. శిల్పములలో అవయవములు స్పష్టముగా కనిపించుటవల్ల ఇవి నగ్నశిల్పములు అనే భ్రమ కల్గును. కాని ఆ శిల్పములలోని స్త్రీపురుషులు చాల సన్ననివస్త్రములు ధరించడమువలన ఈ భ్రాంతి కల్గుచున్నది.

అమరావతీ సుందరీమణుల శిరోజాలంకరణ చాల ఆకర్షణీయముగా నుండును. ఈ శిరోజాలంకరణలు వివిధములైనవి. అందు ఒకరకము 'ప్రవేణి' (చూ. శిరోజాలంకరణలు 11). అనగా పిఱుదుల వఱకు వెంట్రుకలను జడగా అల్లి వదలివేయుట. (చూ. చిత్రం 13). కొన్నివారులు అల్లిక లేక ఆభరణములతో కూడియుండునట్లు శిరోజములను వదలివేయుట. (చూ. చిత్రం 14). ప్రవేణికి చివర ముత్యములు రత్నములతో కట్టబడిన బంగారు కుచ్చు లున్నట్లు తెలియును. (చూ. చిత్రం 13). జుట్టు నొక్కునొక్కులుగను, కురులుగను చక్కగా అమర్చబడెడిది. (చూ. చిత్రం 7). మరియొక రకము 'కేశపాశము' లేక వదులుగా ముడి వేయుట. ఈ ముడి తలకు దగ్గరగా గాని, దూరముగా గాని ఉండును. (చూ. 1, 2). ఒక్కొక్కప్పుడు ఈ ముడి పూలు చుట్టినట్లుండును. (చూ. 7). ఇంకొకరకము 'కబరీ బంధము'—ఇందు శిరోజములు వలయాకారముగ చుట్టబడి యుండును. (చూ. 5, 8). ఇంకొకరకము 'ధమ్మిల్లము'. ఇది శిరస్సుపై గుండ్రముగా చుట్టవలె యుండును. (చూ. 10). మరియొకవిధము పింఛాకారము కలిగినది. (చూ. 4).

ఆ నాటి స్త్రీలు శిరస్సుపైన చటులాతిలకమణి, చూడామణి, మకరిక, అను వాటిని ధరించెడివారు. (చూ. 14, 8). మకరస్వరూపము కలదానికి మకరిక అని పేరు. ఈ మకరికకే చూడా మకరిక అని యింకొక పేరుండెడిది. ఆ నాటి స్త్రీలు అనేక రకములైన కుండలములను ధరించెడివారు. వారి చెవితమ్మి రంధ్రములు చాలా పెద్దవిగా కన్పించుటవలన ఆకుండలము చాలా బరువుగ ఉండెడివని ఊహించవలసివచ్చుచున్నది. కుండలములలో చంద్రవంక, వృష్ప, మకర, పత్రములనే భేదము లుండెడివి. (చూ. కుండలములు చిత్రం). ఇవికాక అప్పటివారు కనకకమలములు, కర్ణికములు, పద్మాకార కుండలములు కూడా ధరించెడివారు. త్రికంటక, బాలిక, అనునవి కూడా వాడుకలో ఉండెడివి. హారములలో ముత్యాల సరాలు ఎక్కువగా వాడుకలో ఉండెడివి. ఒకే సరము కలది



1 వరుస—కుండలములు. 2 వరుస—వలయములు. 3 వరుస—హారములు. 4 వరుస—రక్షాబంధములు.

'ఏకావళి'. దానికే ఒక మేలిరత్నము లేక చాలా పెద్ద ముత్యము తగిలించబడిన శీర్షకహారము అనే భేదములు ఉండెడివి. ఇవిగాక కొన్ని రత్నహారములు కూడ వాడుకలో ఉండెడివి. అవి ముత్యములు, మణులు, బంగారు గుండ్లు మొదలైన వాటితో చుట్టబడెడివి. ఇదికాక ఫలకాహారముల వరుసలకు పైభాగమున 'కంటె' వంటి గ్రైవేయకము ధరించబడెడిది. దానిలో అనేకరకములైన మణులు మాణిక్యాలు పొదగబడి యుండెడివి. (చూ. హారములు). ముంజేతులకు పలకవలయములు, రత్నవలయములు ధరించబడెడివి. నాలుగు మంజీరములు ధరించినట్లు తెలియుచున్నది. ఇవి బహుశా చాలా తేలికగాను, బోలుగాను ఉండి ఉండవలెను. అంగుళీయకములు చాలా అరుదుగా కనబడుచున్నవి. స్త్రీలు 'ఛన్నవీరమును' (చూ. ఛిత్రం 5), యజ్ఞోపవీతమును కూడా ధరించెడివారు. (చూ. చిత్రం 4). తరువాతికాలపు విగ్రహశిల్పములలో ఈ ఛన్నవీరము ప్రాయికముగా కనిపించుచున్నది.

ఆనాటి స్త్రీలు అంగరాగావలేపనము (Cosmatics) ఎడలను, శిరోజాలంకరణలోను, ఆభరణముల యెడలను ఎక్కువ ఆసక్తి గలిగియుండిరి. వారు పూలహారములు,




శిరోజా లంకరణలు.

కనకదోరములు, జాలవలయములు ధరించబడెడివి. ఫలకవలయములు, పెద్దపెద్ద ఫలకాకారమణులతోను, రత్నవలయములు ముత్యములతోను, కనకదోరములు మెలికలు తిరిగిన బంగారు తీగెలతోను, జాలవలయములు అల్లికొన్న తీగెఆకారముతోను చేయబడినవి. (చూ. వలయములు). వంకీలు మరియొక ఆభరణ విశేషము. వీనిలో కొన్ని మకరాకారమును, కొన్ని లతాకారమును కలిగిఉండెడివి. (చూ. రక్షాబంధములు). కటిభూషణములలో సాదా వడ్డాణము, జాలరులతో కూడినవి, చిన్న మువ్వలతోను, మణులు, ముత్యములతోను కూర్చబడినవి ఉండెడివి. (చూ. కటిభూషణములు). ఈ వడ్డాణముక్రింద 'వేతక'మను పట్కాను వేసుకొనెడివారు. శిల్పములలో అనేకరకములైన కడియములు, మంజీరములు కన్పించుచున్నవి. వీనిలో మెలి దిరిగినవి చిన్న చిన్న కింకిణులు కలవి ఉండెడివి. శిల్పములలో ప్రతిస్త్రీ మూడు, మాలలు విరివిగా ధరించెడివారు. దువ్వెనలు, అద్దములు, తైలపాత్రలు వాడుకలో ఉండెడివి. ఇదికాక నృత్తసంగీతములందు వారు శ్రద్ధవహించిరి. స్త్రీలు అన్నివాద్యములు మేళవించుటయందును ప్రావీణ్యము కలిగియుండిరి. శిల్పములలో వేణువు, మృదంగము, మర్దలము, వీణ (Guitar) మొదలైనవి సుందరీమణుల చేతులలో కన్పించుచున్నవి. ఇందు మూలముగా ఆనాటి స్త్రీలు ఎంత సంస్కృతి కలిగియుండిరో తెలియవచ్చుచున్నది. వారి జీవితములు కళామయములు. ఉత్సాహవంతమైనవి. ఆనాటి శిల్పములలోని ముఖకవళికలవలన, భావస్ఫురణవలన మనకు వారి జీవితముల్ ఎంత ఆనందమయముగా ఉండేవో తెలియవచ్చుచున్నది. ఈనాటికినీ నాటి ఆభరణములు, కట్టు, బొట్టు, శిరోజాలంకరణలలో కొన్ని వాడుకలో నున్నవి. మనము ప్రస్తుతము స్త్రీల వేషభాషాదులను చూచి అవి చాలా నవీనమైనవని అను

కొనుచున్నాము. కాని ప్రాచీనశిల్పాలను జాగర్తగా పరిశీలించినచో షుమారు 1600 సం॥ ములకు మునుపే మనము నవీనములు అనుకొనే వేషభూషణాదులు ఉండేవి అని స్పష్టము అవుతుంది. త్రికంటక, బాలిక అనేవి మనవార్ను ధరించే 'జుమ్కికి' లేక 'లోలకు' వంటివి. పేర్లలోను, నాజూకులోను మాత్రమే మార్పుకాని ఆకారము ఒకటే. వలయములు, కుండలములు, హారములు, కంటెవంటివి ఇప్పటికిని వాడుకలో నున్నవి. చీరను గోచీపోసి చాలా సుందరముగా ధరించు అలవాటు ఇప్పటికి అనేకులలో గలదు. నాజూకు హెచ్చిన కొలది కడియములు, అందెలు, వడ్డాణములు, వంకి మొదలైనవి వాడుకలో నుండి తొలగిపోవుచున్నవి. కాని గ్రామవాసులు ఇప్పటికి వాటన్నిటిని ధరిస్తూనే ఉన్నారు. అంగరాగము, అలక్తకము—ఈనాడే కాదు, అనాడు కూడా వాడుకలో నుండెను. ఇప్పటికి ఆంధ్రబాలికలు జడకుప్పెలు, పెట్టుకొనుచున్నారు. పూలతో వంకీజడ, మొగలిరేకుల జడ, బంతిపూలజడ మొదలైన అనేకరకములైన జడలు వేసుకొనుచున్నారు. కాని పూలు ముడుచుటలో ఆనాటివారే నేర్పరులేమో ! ఇక శిరోజములను అనేక విధములుగ ముడులుగను, జడలుగను ధరించుటలో వారే ఈనాటివారిని మించిరి. నాటి స్త్రీలు మతమునందు పరమాదరముకలిగినవారని శిల్పములనుండి గ్రహింపగలుగుచున్నాము. అమరావతీ శిల్ప చైత్యము, లోకోత్తర శిల్పసంపదకు ప్రసిద్ధి గాంచినది. అమరావతీశిల్పసంప్రదాయము, విలక్షణ శిల్ప సృష్టి, ఆనాటి సుందర శిల్పములు—బహు ప్రశంసనీయములు.

ఆధారములు :—

1. శాతవాహన సంచిక—శ్రీ మారేమండ రామారావు.
2. అమరావతీ శిల్పములు—శివరామమూర్తి.
3. బుద్ధజయంతి సంచిక 1956—శ్రీ మారేమండ రామారావు.
4. బుద్ధజయంతి సంచిక (1956 Supplement)—శ్రీ మారేమండ రామారావు.
5. ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి—ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం.




1 వరుస_కటిభూషణములు. 2 వరుస_పాదభూషణములు.

యర్రంశెట్టి పద్మావతి.

# నేను

### తెనుఁగులెంక

ఒకతిమ్మఁదనము త్రిక్కన్
సకలశ్రీ లొసఁగె నాకు సర్వేశ్వరుఁ; డా
యొకటియు నొసఁగిన గర్వా
ధికతన్ జెడి యుందునేమొ ధిక్కృతవిధినై.

పప్పు, పెరుఁగు, దుంప పడ, దావ, గుమ్మడి
యెదురుదిరుగు, దీని కేమిగాని
వింగడించు నాకు గోంగూరముద్దయుఁ
బంతగించి 'శూల' యొంతచేసె!

అకట! తెన్గునేల, నందును గుంటూరు
మండలమునఁ బుట్టు మానవుండు
కొసరి కొసరి యింత గోంగూర దిననిచో
నేమి బ్రతుకు వాని దేమి మెతుకు?

కవిత నాకు మందు, కవిత నా కాపోక
నొసఁగువిందు, పద్య మొకటి వ్రాసి
మంచిరచన యని తలంచితినా నన్నుఁ
గదియు నపుడు భద్రగజబలమ్ము

నాకవితారీతిం గని
లోకము తలయూఁపినా విలుప్తం బగు నా
చీకుం జింతయు నొక్కట
వ్రేఁకన లన్నియును వెంటవెంటన సడలున్

కవితాసృష్టి నిరంతర
నవతాసంధాత్రి యగుట నవఁతం గన; నీ
భవమున నా కజుఁ డిచ్చిన
భవికమ్ముల నిదియ మేలుబంతిగ నిలుచున్

సరసోక్తులతో నెయ్యురఁ
గరఁగించెద బుడుతవోలె గంతుల నిడెదన్

మఱపెఱుఁగను విధివీడను
జరకోడను గైతబలిమి సమకుఱి యుంటన్

ఎట్టు లుండుఁగాక యేను వృద్ధుండన
కాని మామకీనకవిత ప్రౌఢ;
యెనిమిదేండ్లమాత్రమే యిది నాకంటెఁ
జిన్న దైన నేమి చెన్ను విడదు

నాపాలిదేవి, మత్పరి
తాపమ్ముల నణఁచుమలయతరు విది యగుటన్
రేపవలు దీని విడువక
ప్రాపించెదఁ బుష్టి బుధసభాసుమవృష్టిన్

కవిత నుజ్జగింపఁ గాని గంటకు నొక
వందపద్యములను వ్రాయ నొల్ల
నిలిపి నిలిపి కూర్తు నెల కొండు రెం డైన
వాపు గాదు బలుపు వలయు నాకు

ఆశుధార నైన నవధానముల నైనఁ
జప్పచప్పకైత కొప్ప నేను
గుంటువడనినడక దంటల రంజించు
పద్యమే వచింతు బ్రాహ్మికరుణ

"వ్రాసినది సవరించు నభ్యాస మెపుడు
లేదు నా"కను కవి నెట్టు లాదరింతు ?
గణము లిమిడిన యంతన కైత యగునె
యౌచితీశౌచముఖదీప్తు లమరకున్న

కోఁతి కొండముచ్చు కుప్పిగంతులు వోయి
ప్రాణి మానుషత్వ మూనుకరణి
మాఱి మాఱి కవిత మహనీయతన్ గని
వాసికెక్కు నమరవాణి యగుచు

మాటమాటయు వాగ్దేవికోట గాఁగఁ
గోటలోఁదాపులెగఁ జిమ్ముతోఁటగాఁగఁ
దోఁట నురలెడి క్రొందేనె తేట గాఁగఁ
దీర్చినది కైత మెఱుఁగుదిద్దినది కైత

# మాలపల్లి

## (ప్రథమ భాగం)

### శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

### నాటకీకరణం : శ్రీ గోపీచంద్

రామదాసు మాలదాసరి కులస్థుడు. గురువుల్ల కారణం పొందిన మనిషి. అతని పెద్ద కొడుకు వెంకటదాసు వ్యవసాయపు పనులు చూసుకొంటూ ఉంటాడు. రెండవ కొడుకు సంగదాసు నల్లమోత చౌదరయ్యగారి పనిలో ఉంటాడు. జ్యోతి పిల్ల అందరిలోకీ చిన్నది. ఇంకా పెళ్లికాలేదు. అతని మేనల్లుడు అప్పదాసు అతని యింట్లోనే ఉంటున్నాడు.

రామదాసుకి ఒకరిమీద ఆధారపడవలసిన అవుసరంలేదు. అతని పూర్వీకులు భాగ్యవంతు లనడానికి వీలు లేకపోయినా పది డబ్బులు యిచ్చి పుచ్చుకుంటూ ఒక అరక వ్యవసాయముతో కాలం వెళ్లబుచ్చుకుంటూ వచ్చారు .... ఆ సాయంకాలం రామదాసు అరక తోలుకొని ఇంటికి వచ్చాడు.

:—గొడ్లచావిడి. గంటలు దూరంగా వినబడు తుంటాయి. రుబ్బురోలు ధ్వని స్పష్టంగా వినిపిస్తుంటుంది. :—

రామదాసు : అప్పడూ.

అప్పదాసు : ఏం మామా ?

రామ : రుబ్బడం గాంగనే చొప్ప నరుకుతావా ?

అప్ప : అట్లాగే నరుకుతా.

రామ : బావ యింకా పొలమునుంచి రాలేదా ?

అప్ప : వచ్చి నీళ్లు తెస్తున్నాడు.

రామ : నీళ్లు తేవడం యింకా కాలా ?

అప్ప : అప్పుడేనా. ఊర జెరువు మాలరేవు దగ్గరనుంచి యిక్కడికి మన పడమటి చేనంత దూరముంది. రెండు గావళ్లు తెచ్చి రాతి గాబులో పోశాడు. ఇంకా మట్టి గాబూ, మూడు బానలూ వట్టినే ఉన్నవి.

రామ : పొద్దుగూకుతున్నదే, ఎన్నడు నీళ్లయ్యేది. రుబ్బడం యింకా యెంతసేపు పట్టేను.

అప్ప : కావచ్చింది. పత్తిగింజలు రెండు వాయిలు రుబ్బా. కాసిని పత్తిగింజలు మిగిలితే మళ్లీ రోట వేశా. లిద్ది కదులుతూ ఉంది. గానిగె తిప్పుతుంటే గతుక్కు మంటున్నది. అయింది, ఇగ తీస్తున్నా.

(అని గబగబ గానిగె నాలుగు చుట్లు తిప్పి పైకిదీసి పిండి కుండలోకి తోడి రోలు కడుగుతున్నాడు.)

రామ : నీవు పయటన్నం తిన్నావా ?

అప్ప : ఆ .... అత్త తెచ్చెగా ?

రామ : చొప్ప నేనైనా నరుకుతాను. చిన్న బుంగలు కావట్లో వేసుకొని బావతోపాటు నీవూ రెండు కావిళ్లందుకో.

అప్ప : అట్లాగే.

(అప్పదాసు కావిడి వేసుకోటానికి రెండడుగులు వేస్తాడు. రామదాసు చొప్ప నరుకుతుంటాడు. కావిడి కడవ గుమ్మానికి తగిలిన ధ్వని.)

వెంకటదాసు : (కావిడి మోసుకుంటూ ప్రవేశించి) చొప్ప నువు నరకాలటే. మేము నరక లేమూ.

రామ : చొప్ప నరకడ మెంత పని గాని యింకా యెన్ని కావిళ్లు పడతవి.

వెంక : ఎన్ని పట్టకేమి ? రెండు కావిళ్లు యిప్పుడు ఆడ పశువులు తాగడానికి కావలెనా ? అయిదు కావిళ్లు రెండు గాబుల్లోనూ, మూడు కావిళ్లు బానల్లోనూ పడతవి.

రామ : సరే కాని, అప్పుడూ నీవూ కావిళ్లు వేసుకొని ఒక జత తెచ్చి యీపూట గడిపి రెండోజత యింటిదగ్గర దింపండి. వులవపిండి, పత్తివిత్తుల తొక్కూ సగం యీపూటకు వేసి, పొద్దుటికి తక్కిన సగం వుంచండి.

తెల్లవారుజామున మన మిద్దరమూ కావిళ్లు వేసుకొన్నామంటే తెల్లవారేవరకూ అన్నీ బర్తీ చేయవచ్చు.

వెంక : ఆఁ. మోకాళ్ల కలకలతో తెల్లవారుజామున వూరజెరువు నుంచి కావిళ్లు మోస్తావు. అప్పడిని నీళ్లకు అలవార్చవలసిందే. మధ్యాహ్నం మన ఆవు పెయ్య కట్టింది.

రాము : అట్లాగా, గేడిపెయ్యేనా ?

వెంక : కాదు, బట్టది. ఆ గేడిది నక్కోడు బోయినట్టు అట్లా ఉన్నదేమి ?

రాము : నక్కోడు బోవడం గాదు. దాని చాలే అంత. ఒక్క నెల పాటు తియ్యకుండా అంటిపట్టి రోజూకు చారెడు ఉప్పు నీళ్లల్లో కలిపి తాగించు. యేట్లా కట్టదో చూస్తాను.

(వాకిట దగ్గర చప్పుడు అవుతుంది. సన్నగా ఏడుపూ, మూలుగూ వినపడుతుంది.)

రాము : ఎవరది ?

కొత్తమనిషి : (తలుపు నెట్టుకొని కొంచెం తల వంచుకొని గడపదాటి లోపలికి వచ్చి) యేమన్నా, నేను సుబ్బలక్ష్మిని.

రాము : ఏమమ్మా, ఇటు వచ్చావు ?

సుబ్బ : (లోపలికి తిరిగిన మడిమెలతో చాచి కొంచెం అడ్డడుగులు వేస్తూ, బిగుతయిన పూర్ణీల పట్టెడలను యెడమ చేతితో సవరించుకుంటూ) చూడన్నా, వాడి చెయిబడ, మునసబుగారి బసివిరెడ్డి కఱ్ఱ తీసుకొని యెట్లా కొట్టాడో .....

(అని ఎడమచేతిమీద జారివున్న పమిటకొంగును పైకి లాగి శుష్కించి తోళ్లు వేలాడే రవికె లేని దండమీద గట్టి కదుము చూపును.)

రాము : ఎందు కట్లా కొట్టాడు ?

సుబ్బ : వట్టి అభాండం వేశాడు. నేను గరువులకు పోయి గడ్డి కోసుకొని మూటెత్తుకొని సావరాల మీదిగా వస్తూవుంటే తా నెక్కడినుంచో బూతులు తిట్టుకుంటూ మా చేలన్నీ నీకు మాన్యాలయిపోయినవా, అని కఱ్ఱతో మూట కిందబడ నెట్టి యీ దెబ్బ కొట్టాడు.

రాము : మాలమాదిగలంటే అంత చౌక ?

సుబ్బ : మొన్న మట్టసానికి సామినేడివారి చేనికాడ వడి డొంకలో చిప్పెరనట్టుంటే డోక్కుంటున్నా. వాండ్ల కోడలు వానా మాటలని అట్లా పార పెట్టనీయక పోయింది. పొద్దుకూకిందాక తిరిగి వంచెడు గడ్డితో వచ్చా. ఆసాములు యింత కట్టెనా, కంపనా కాలకపోతే యెట్లా గబ్బా; యీ అలగాజనం బతికేది. యేకాడికో పోకడ పెట్టవలసిందే తప్ప యీ బత్తెను యిక భరించలేను.

రాము : దాన్నమ్మి యెట్లా బతుకుతావు. అట్లాగే తంటాలు పడుతుండు. కాకపోతేమట్టుకు యెండిపోవచ్చిన గొడ్డున్ను యిప్పుడు యెవరు కొంటారు.

సుబ్బ : ఏమి తంటాలు పడతానో అబ్బా. గడ్డిగుడ్డా, తిక్క ఆ బసవయ్యే వూడబెరుక్కున్నాడు. అవయినా యియ్యమను.

రాము : పొద్దున చూతాం పద.

సుబ్బ : గేదె పొలంబోయి వచ్చినప్పటినుంచి నిలువున కట్టివేసి ఉన్నది. అందులో అది మలపగొడ్డు. కాస్త మలుముకైనా వేయకపోతే ఆ గుక్కెడూ రాల్చదు. అందుకోసమని యిట్లా వచ్చా.

రాము : రెండు యెండు కట్టలూ కాస్త పచ్చి దంటూ తీసుకో. ఇదుగో మాట, నీవు మళ్లీ పొగాకు వేసుకొంటున్నావు. సంగడు చూస్తే చీవాట్లు పెడతాడు.

జ్యోతి : (ప్రవేశించి) అయ్యా, అయ్యా.

రాము : ఏం అమ్మా ?

జ్యోతి : అమ్మ మిమ్మల్నందర్ని తీసుకురమ్మంది.

రాము : ఏమి దాచబెట్టిందేమిటి మీ అమ్మ.

జ్యోతి : అమ్మెందుకు ? నేనే దాచబెట్టా.

రాము : ఏమిటది ?

జ్యోతి : బావతో చెప్పనంటే ....

రాము : చెప్పనులే.

జ్యోతి : (రహస్యంగా) పొలంనుంచి తెచ్చిన దోసముక్కలు.

రాము : మరి మీ బావను కూడా పిలువు.

జ్యోతి : బావా ?

అప్ప : (కొంచెం దూరంగా) ఏం ?

జ్యోతి : అమ్మ మిమ్మల్నందర్నీ పిలుచుకు రమ్మన్నది.

అమ్మ : ఎందుకు ?

జ్యోతి : అన్నాలకి.

## 2

(భోజనాలు జరుగుతుంటవి)

జ్యోతి : అమ్మా. యిటు రా. మాట. (చెవిలో) అందరికీ నా దోసకాయ ముక్కలు పెట్టవూ ?

మాలక్ష్మి : ఇప్పుడు కాదు, అన్నం తిన్న తరువాత.

జ్యోతి : అందాకా చెప్పవద్దు.

రాము : ఏమిటా రహస్యం.

జ్యోతి : వొట్టు, చెప్పేవు.

మాలక్ష్మి : చెప్పనులే, మీ కెందుకూ మా సంగతి.

రాము : చెప్పకపోతే మానెలే.

జ్యోతి : చూడమ్మా, యీ మొద్దు కంచం నాకు కదలదు, బుల్లికంచం కొనిపెట్టమంటేనూ.

మాలక్ష్మి : ఈతడవ కంచంవాండ్లు వస్తే కొందాంలే.

జ్యోతి : అయ్యోయ్, అమ్మే—నాకే—వయిటాల—రోజా ఆ బియ్యపు అన్నమే—పెట్టమంటే—పెట్టదు.

మాలక్ష్మి : ఏమే అమ్మా, సూకరాలు పోతావు, యీపూట వండింది నీకు చద్దెన్నానికి మిగిల్చి పెడుతూనే వుంటిని. ఎటువచ్చి నీవు మధ్యాహ్నమేగా జొన్నన్నం తినేది. కాక పోతేమట్టుకు పండిన గింజలు పారబోసుకుంటారూ ?

వెంక : మూడు పూటలా వరెన్నం తింటే వ్యవసాయం చేసి నట్టే. తూర్పున అసలు మెట్టే లేదు. వాండ్లకేమి వ్యవసాయముంది ? నాట్లు వేయడమూ, నురుచు కోవడమూ, మనుష్యులు పూద పాట్టలూ, వాండ్లూనూ.

మాలక్ష్మి : మధ్యాహ్నం మీకు అన్నం తీసుకొని రావడానికి నానా యిబ్బంది అయింది. మీ రిద్దరూ చెరొక కోసకూ పోతిరి, నేను యింట్లో ఉంటే బయటికి, బయటికిపోతే యింట్లోకి లేదాయె. ఆఖరుకు వెట్టి వున్నన్న మేనత్తను బతిమాలి పిల్లాడి దగ్గిర కూర్చోబెట్టి ఆదరాబాదరా లగువులుతీసి వచ్చేవరకు పిల్లవాడు చేతుల్లో నిలవకుండా యేడుస్తున్నాడు. అస లాబిడకు పిల్లవాణ్ని పట్టుకోనే చేతగాదు.

వెంక : అసలు పుట్టు కుంకాయె.

మాలక్ష్మి : నిరుడు యీరోజుల్లో మునలమ్మ బాగా వోపి గ్గానే తిరుగుతున్నది. ఏదీ ఆమె మంచాన బడి వడ పారం ఆరు నెలలు కూడా కాలేదు. ఆమె రోజులు వెళ్లబుచ్చుకుని పోయింది మారాజు. ఎప్పుడూ గడిచిన రోజులే మంచివి.

రాము : కాలం వచ్చినప్పుడు పోక మన కిబ్బందని మాను కొంటుందా. రేపు మన కాలము వస్తే మనము మాత్రం బోమా, పిల్లలు నాదార్లంటే వదలిపెట్టి వూరుకుంటారా.

జ్యోతి : అమ్మా, రే పెక్కడకే అయ్యా, నీవు పోవడం.

అప్పు : (పగలబడి నవ్వుతున్నాడు.)

వెంక : ఎక్కడికా ? దేవుడి దగ్గిరకు.

జ్యోతి : దేవుడు తన దగ్గిరకు మిమ్ములను రానిస్తాడా ?

మా : ఆఁ ఆ దేవుడు రానిస్తాడు.

జ్యోతి : ఇక్కడికి దేవుడి గుడిలోకి మన్ని రానీయరేమి ?

మాలక్ష్మి : రానీయకపోతే వాండ్లే చెడ్డారులే. మీ అన్న సంగన్న మనకు దేవుడిగుడి కట్టిస్తున్నాడుగా.

జ్యో : మన గుడిలోకి వస్తాడా దేవుడు ?

మాలక్ష్మి : ఆహా, యెవరు కట్టించుకొన్నా వస్తాడు. ఆయన కంట్లులేదు.

రాము : పెద్ద దేవుడు మనలోనే ఉంటే యీ రాతి దేవు ళ్లెందుకు? రాళ్లు దేవుళ్లయితే రాసులు మింగవా అన్నాడు.

వెంక : నీదంతా అద్వయితం. అంతా నీ అంతవాండ్లయితే దేవుడిగుళ్లక్కరలేదు. మేమంతా ముక్కులు పట్టు కొని కూర్చుంటామా యేం ?

రాము : ఎందుకు కూర్చోకూడదు ?

వెంక : బువ్వక్కరలా యిగను.

రాము : పెట్టివుంటే అదే వస్తుంది.

వెంక : చాకిరి చేసుకుంటే వస్తుంది.

రాము : చాకిరి చేసుకొన్నా రానిరోజులు వస్తయ్యోయ్. అప్పుడు మన తెలువులేమీ అక్కరకు రావు. లక్ష్మి యెటువంటిదంటే తాటికాయల్లో నీళ్లు చూడరాదూ అవ్వే వస్తవి, అవ్వే యెండిపోతవి.

సిరిదా వచ్చిన వచ్చును,
సలలితముగ నారికేళ సలిలముభంగిన్
సిరిదా బోయిన బోవును,
కరి మ్రింగిన వెలగపండు క్రమమున సుమతీ.

జ్యోతి : అమ్మా మొద్దు కంచాన గుజ్జు తీసుకుంటే రానే రాదు.

మాలక్ష్మి : అమ్మాయీ, నీకు పొద్దుగూకులూ గునుపేనేమే.

జ్యోతి : చూడమ్మా నాచేతిన యెంత గుజ్జు అతుక్కున్నదో. గీస్తే అట్లాగే ఉంది. ఎప్పుడమ్మా చిన్న కంచం గొనిపెట్టడం ?

మా : నీవు యే పట్టు పడితే అదే పట్టు. కొనిపెడతా నంటిగా.

వెంక : అయ్యకు కాస్తే పెరుగు వెయ్యమ్మా.

మాలక్ష్మి : అందరికీ వేస్తేనేగాని ఆయన వేయించుకోడట.

వెంక : అందరూ పెరుగు తాగవలెనంటే నాలుగు బర్ల పాడి కావాలె.

మాలక్ష్మి : సరే నాయనా. ఈ ఒక్క బర్రెతోనే తెమలడం లేదు. రెండో బర్రె కూడా యీనితే యెట్లాగా అవి

చూస్తున్నా. ఇప్పటికి ఉన్న గొడ్లను నగరొప్పుకుంటే చాల్లే. ఈయేడు మా పెద్దబ్బాయి పెండ్లయి కోడలు వస్తే అప్పటికి చూచుకుందాం.

(చేతులు కడుక్కుంటూన్న ధ్వని)

జ్యోతి : (రహస్యంగా) అన్నాలు అయినయిగదా, ముక్కలు పెట్టవద్దా.

మాలక్ష్మి : అమ్మాయి తియ్యదోసముక్కలు పెడుతుందట. తీసుకోండి. పెట్టేదాకా నిలవడంలేదు.

రామ : ఇందాకటి రహస్య మదేనా.

అప్ప : ఇటదే యిటదే. (అని ఒక కుప్ప తీసుకున్నాడు.)

జ్యోతి : అయ్యా ఇయి నీకు .... ఇవి నీకు.

రామ : (తింటూ) బాగున్నాయమ్మా .... ఆ బొక్కల దస్తరం ఇట్లా పట్టుకురా.

వెంక : ఈయేడు పొగతోట మానుకుండేటట్లేనా అయ్యా.

రామ : సంగడు అందరిచేత పొగాకు మాన్పిస్తుంటే మనము పొగాకు పండించడమా. అంతేనా, సావరాల్లో తాటి చెట్లు తెగ కియ్యనన్నాడట.

వెంక : ఈ ఉన్న ఒక్కటయినా యేకాడికో పోకడ పెట్టు కుంటే మంచిది. వాడు యిదంతా తగలబెడతా నంటాడేమో. ఎంత హీనమైనా వంద రూపాయల సొమ్ము.

రామ : అంతమాత్రపువాడు కూడాను.

వెంక : రేపు పొద్దున్న బేరమిచ్చి తోలిపెడతా.

జ్యోతి : (వొచ్చి) ఇదుగో అయ్యా దస్తరం.

రామ : (వెతుకుతూ) నీ యిష్టం. ఇందులో ఒక్క బొక్కు లేదేమిరా ?

వెంక : లేకేమవుతుంది ? బాగా చూడు.

రామ : చూశా. వెంగమ్మగారి రాజయోగసారమూ, శేషాచల నాయుడుగారి పరమపద మార్గమూ, సిద్దప్పగారి తత్వాలూ, కోటయ్యగారి గురు కీర్తనలూ, శివరామ భాగవతులవారి తత్వకందార్థాలూ, వీరయ్యగారి యేలలూ, సీతారామాంజనేయమూ, బుచ్చయ్యగారి సాధన చతుష్టయమూ. అంతే శ్రీరామశాస్త్రులవారి భక్తియోగం లేదు. అది నా పారాయణ గ్రంథం.

మాలక్ష్మి : (లోపల నుంచి) పొద్దున సంగడూ మరొకాయనా వచ్చి ఒక పుస్తకం తీసుకొనిపోయినారు. రెండో ఆయన యెవరో తుంగదుర్తి బుచ్చయ్యగారట, మన అయ్యగారూ, వారూ గురుపుత్రులుటే ?

రామ : బుచ్చయ్యగారా, మన యింట్లో అడుగు పెట్టారా ? ఎంత సుదినం. అయ్యో, నే నింట్లో లేకపోతినే అప్పుడు. ఆయన మహా తపశ్శాలి, యెన్నాళ్లనుంచో దర్శనం చేయవలె ననుకొంటున్నా, వారు యెక్కడ దిగారో ?

మా : ఎక్కడ దిగిందీ నాకు తెలియదు. రేపల్లా ఉంటారట.

రామ : అయితే సరే. రేపు దర్శనం చేయవచ్చు.

# మహత్తర పరివర్తనము - V

## [ చైనా కుందేలు; భారతదేశం తాబేలు ]

### శ్రీ జాన్ స్ట్రాచీ

ఇంతకుముందు లాఫొంటిన్ నీతికథను పేర్కొన్నాను. అభివృద్ధిచెందని దేశాలకు ముఖ్యంగా ఆసియాలో బృహద్దేశాలైన చైనా, భారత దేశాలకు ఆ కథను వర్తింపచేసి మాట్లాడుతాను. చైనా ఆ కథలోని కుందేలని, భారతదేశం తాబేలని మాట్లాడుతాను.

మీకు జ్ఞాపకం ఉంటుంది. ఆ కథలో కుందేలుకు, తాబేలుకు జరిగిన పందెంలో కుందేలు బాణంలాగా ముందుకుపోయి కాసేపట్లో కంటికి కనపడకుండా పోతుంది. తాబేలు వెనక నెమ్మది నెమ్మదిగా కాళ్లు ఈడ్చుకుంటూ వెళుతూ ఉంటుంది. ముందు వెళ్లినకుందేలు మధ్యలో పడుకుని పందెం సంగతే మరచిపోతుంది. తాబేలుమాత్రం నెమ్మదిగా దొర్లుకుంటూ కుందేలుపడుకున్న చోటుకు చేరుతుంది. కుందేలు మళ్లీ పరుగెత్తి మధ్యలో పొదలో ఇరుక్కోటమో, లేకపోతే నదిలో పడటమో జరిగి అనేక అవాంతరాలను ఎదుర్కోనటం జరుగుతుంది. చివరికి, అతి మందగొడి దనుకున్న తాబేలు పందాన్ని గెలుస్తుంది.

చైనా, భారతదేశాల అభివృద్ధి ఇలాగే జరుగుతుందని నా భావంకాదు. ఇద్దరూ గెలవటానికి వీలున్న పందెం. ఎందుకంటే ఇద్దరూ అభివృద్ధి చెందగలరు. అభివృద్ధి చెందుతారని కూడా నాకు గట్టి నమ్మకము. చైనా, భారతదేశాలు పారిశ్రామికంగా పెద్దవైతే గత వెయ్యి సంవత్సరాలలో జరిగిన ప్రతి ఒక్క సంఘటన దానిముందు చీమంత చిన్నదిగా కనబడుతుంది. మనం రష్యా, అమెరికాలను చాలా పెద్ద దేశాలనుకొంటాము. కాని, జనాభానుబట్టి చూస్తే, ఇవి చైనా, భారత దేశాల కంటే చిన్నవి. ఈ ఉభయుల జనాభాను కలిపితే వెయ్యి మిలియనులపైగా ఉంటారు. మొత్తం మానవజాతి మొత్తంలో మూడవవంతు అవుతారు.

ముందు కొద్ది నిమిషాలపాటు చైనాను గురించి మాట్లాడుతాను. నేను చైనా వ్యతిరేకిగా ధ్వనించవచ్చు. కాని నన్ను ఆ మాట అంటే ఒప్పుకోను. నేను ఇక్కడనుంచి వెళ్లే రోజు దగ్గరకు వచ్చింది. ఇక్కడి ప్రేక్షకుల తత్వం తెలిసిన సమయంలో నేను చైనాను గురించి ప్రతికూల ప్రసంగాలు చేయుటం జరుగుతోంది. చైనా ఛాయ, ఊతము, సింగపూరు దాకా వ్యాపించి, దానిమీద పడుతున్నవి. ప్రపంచంలో పెద్ద రాజ్యాలలో చైనా ఒకటి. నేను అది కాదనటంలేదు. ఆసియాలో అభివృద్ధిపొందుతున్న రెండు పెద్ద దేశాలలో చైనా ఒకటనే విషయాన్ని కాదనటంలేదు. కాని, ఆసియాలో అభివృద్ధి చెందుతున్న దేశము అదొకటేకాదని మాత్రము గట్టిగా చెబుతాను. ఈ అంశాన్ని సింగపూరు సభికులకు తెలియచేయటం అవసరమనుకుంటాను.

కథలో చెప్పిన కుందేలు, తాబేలుతో పోల్చి చెప్పాలంటే చైనా కుందేలు మొన్నటిరు మొదటి అడుగును గంతుతోనే మొదలుపెట్టింది. చైనా ప్రభుత్వం ప్రకటించిన లెక్కలను సంశయించటానికి నాకేమీ కారణం కనబడటంలేదు. చైనా జాతీయ ఉత్పత్తి 1952—1958 సం.ల మధ్య ఏడాదికి 12 శాతం పెరిగినట్లు ఆ లెక్కలు తెలియబరుస్తున్నాయి. ఇది అతి శీఘ్రం జరిగిన పెరుగుదల. ఈ లెక్కలను నేను ధృవపరచలేను. కాని, కాదనటానికి కారణము కనపడదు. ఆ రోజులలో చైనా వెళ్లినవారందరూ అక్కడ సాగుతున్న అభివృద్ధివేగాన్ని చూచి మెచ్చుకున్నారు. కాని ఈ అభివృద్ధిని అతిశ్రద్ధతో గమనిస్తున్నవారు మాత్రము ముఖ్యంగా భారత ప్రణాళికా నిర్మాతలు అంత ధాటీగా మెచ్చుకోరు. నేను ఒక నెల్రకితం ఇక్కడికి వచ్చేటప్పుడు దోవలో వారిని కలిసికొని ఈ విషయమై మాట్లాడి ఉన్నాను. వారు చైనా ప్రగతిని నిష్పాక్షిక దృష్టితోనూ, శ్రద్ధాసక్తులతోనూ పరిశీలించేవారు. కమ్యూనిజానికి కేవలం వట్టి విముఖులుకారు. వారిలో కొందరు అతివాద అభిప్రాయములు కూడా గలవారు. తోటి ఆసియా దేశస్థులు. 1958 సం. తరువాత చైనా అభివృద్ధికి సంబంధించిన నమ్మకమైన లెక్కలు ఏవీ సేకరించటం సాధ్యంకావటంలేదని వారు చెబుతున్నారు. అభివృద్ధి సాగుతున్న యావత్తు ప్రదేశమూ అనేక ఆకస్మిక కష్టాలకు గురిఅవుట వల్లనేమో నేను చెప్పలేను. కాని, చైనా వ్యావసాయకంగా అనేక కష్టాలలో చిక్కుకున్నట్లు చైనా ప్రభుత్వ ప్రకటనల వల్లనే మనకు తెలిసినది. (ఇదేమీ అసాధారణమైన విషయం కాదు. వ్యావసాయకమైన అభివృద్ధి అతి కష్టమైనది. ఇంకో క్షణంలో వ్యవసాయక అభివృద్ధి విషయంతో భారతీయులు ఎదుర్కొంటున్న కష్టాలను, సమస్యలను గురించి చెబుతాను.)

కాబట్టి చైనా ప్రభుత్వము, తమ అభివృద్ధి వేగాన్ని గురించి చెప్పినది చెప్పినట్లుగా నమ్మగూడదని మనము హెచ్చరికగా తీసికోవాలి. చైనా ప్రభుత్వం తమ లెక్కలను సదుద్దేశంతోనే ప్రకటించియుండవచ్చు. కాని ఏ ప్రభుత్వమైనా చైనా ప్రభుత్వం మొన్నటిరు గత కొన్ని సంవత్సరాలలో అనేకసార్లు ప్రకటించినట్లు తమ వ్యవసాయ ఉత్పత్తివి రెండు వందల రెట్లు పెంచగలిగామని ఒకవంక చెబుతూ, అదే సంవ

త్వరం చివరికి హఠాత్తుగా క్షామం వచ్చిందని చెప్పితే ఎక్కడో ఏదో లోపం ఉండాలి. క్షామం, ప్రతికూల వాతావరణ స్థితి కారణంగా, వచ్చిందని చెప్పారు. కాని నేను అది నమ్మను. ఇతర దేశాల మోస్తరే చైనా కూడా అపుడపుడు అతివృష్టికి, అనావృష్టికి లోనవుతూ ఉంటుంది. కాని లోటంతటికీ అదే మూలం అనడానికి వీలులేదు. పెద్ద పెద్ద దేశాలలో వాతావరణం ఒక ప్రాంతంలో చెడుగాను, మరొక ప్రాంతంలో మంచిగానూ ఉండి, మొత్తంమీద పరిస్థితులు సరిగ్గా ఉంటాయని వ్యవసాయ శాస్త్ర నిపుణులు చెబుతారు.

అయిదేళ్ల క్రితం చింతామణి దేశముఖ్ ఆర్థికమంత్రిగా ఉన్నప్పుడు ఆయనను కలిశాను. ఆ సంవత్సరం వర్షాలు ఎలా ఉన్నాయని అడిగాను. చెడుగా ఉన్నాయని ఇలా అన్నారు. "అయితే ఆహార ధాన్య విషయంలో మా కష్టాలన్నిటికీ ఇదే కారణం అని అనుకోకండి. వర్షాలు బహు చక్కగాఉన్న సంవత్సరానికి బహు చెడ్డగా ఉన్న సంవత్సరానికిగల భేదం మామూలు పంటకు 5 శాతం అటూ ఇటూ అవటంకన్న ఎక్కువ తారతమ్యం ఉండదు. అంటే మొత్తంమీద 10 శాతం కంటే భేదం కనపడదు."

అది కూడా లెక్క చేయవలసిన భేదమనే చెప్పాలి. భారత దేశంలో ఆహారధాన్యం పుష్కలంగా ఉన్నదనటానికి, లోటుగా ఉన్నదనటానికి ఇదే కారణం కావచ్చు. ఐనప్పటికీ 10 శాతం భేదం అంత బ్రహ్మాండమైన భేదమేమీకాదు. అందుకని చైనా ఎదుర్కొనవలసివచ్చిన క్షామస్థితిని కేవలం వాతావరణ స్థితికి అంటగట్టడం సక్రమంగా లేదని నేను అనుకోక తప్పటంలేదు.

1930 సం. లో రష్యావారు చిక్కుకున్న కష్టాలలోనే చైనాకూడా తమ ఉత్సాహంలో తెలియకుండా 1956 సం.లో చిక్కుకుంది. వ్యవసాయాన్ని సాముదాయకం చేయటం కమ్యూనిస్టులు ఆమోదించిన అభివృద్ధి సాధక సూత్రాలలో ఒక సూత్రం. నేను చెప్పబోయే విషయం మిమ్మల్ని ఒక్క కుదుపు కుదిపి ఉలిక్కిపడేట్టు చేస్తుంది. మీరు ఉలిక్కి పడాలనే కూడా నా ఉద్దేశం. జన సమ్మర్దం బాగా ఉన్న దేశాలలో సాముదాయక వ్యవసాయాన్ని అమలు చేయటం పెద్దతప్పని అనుభవంవల్ల తెలిసినది.

సాముదాయక వ్యవసాయమంటే ఏమిటి? కొద్దిపాటి రైతు లందరినీ కూడగట్టి పొలాన్ని సమష్టిగా ఉంచుకొనేట్లు చేయడం. (వీటినే **Collective Farms** అని, **Communes** అని వనవచ్చు). ఆధునిక వ్యావసాయక యంత్రాలను ఉపయోగించటానికిగాను ఈ సమష్టిత్వాన్ని అమలు జరిపారు. ఇది చాలా సవ్యమైనదని మనమందరము అనుకుంటాము. ట్రాక్టర్లు, కోతకోసే యంత్రాలు మొదలైన ఆధునిక యంత్ర పరికరాలన్నిటినీ ఉపయోగించటం చాలా అవసరమని మనకి అనిపిస్తుంది. ఇది అభివృద్ధిని సాధించే పని అనిపిస్తుంది. అయితే కొద్దిపాటి రైతుల వ్యవసాయానికి ఈ పరికరాలను ఉపయోగించవచ్చునా? కూడదు కాబట్టే వా రందరినీ చేర్చి, సాముదాయక వ్యవసాయము అవసరమన్నారు. ఇదంతా నేనూ అనుకునేవాణ్ణి, కాని అనుభవము, పరిశీలనను బట్టి చూస్తే, మనము పునరాలోచన చేయవలసి ఉంటుం దని మీకు సూచిస్తున్నాను. యంత్రాలను ఉపయోగించటంలో అర్థం ఏమిటి? యంత్రాలను ఉపయోగించటంవల్ల ఉత్పత్తి అధికంకాదు. సాధారణంగా నాటుపద్ధతివల్ల వచ్చినంత ఉత్పత్తి కూడా రాదు. వచ్చే ప్రయోజనమల్లా పనివారిసంఖ్యను తగ్గించుకో కలగటం.

అయితే అమెరికాలో మోస్తరు కనుక పుష్కలంగా భూమిఉండి, కార్మికుల సంఖ్య తక్కువగావుంటే యంత్రాలను ఉపయోగించటంలో అర్థమున్నది. కాని భారతదేశంలోను, చైనాలోను, దాదాపు ఆసియా అంతటా కూడా, పరిస్థితులు దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయి. ఈ దేశాలలో తగినంత భూమి లేదు. త్వరలో సాగుకు పనికివచ్చే భూమి ఎక్కువగాలేదు. కాని, కార్మికబలం విశేషంగా ఉన్నది. కాబట్టి కార్మికులతో అవసరాన్ని తగ్గించే వ్యవసాయ విధానాన్ని అవలంబించటంలో ప్రయోజన మేమిటి? కాబట్టి సాముదాయక వ్యవసాయమనేది ఆశయంగాగల వ్యవసాయ విధానము (యంత్రముల ద్వారా వ్యవసాయము చేయటము) అవలంబించటంలో నాకేమీ అర్థము కనపడటములేదు. ఇలా అంటున్నానని నేను శాస్త్రీయ వ్యవసాయానికి వ్యతిరేకినని అనుకోబోకండి. నిజానికి, చైనా, భారతదేశాలు అభివృద్ధి చెందాలంటే అక్కడ ప్రతి ఎకరానికి ఎక్కువపంట పండటం ఎంతో అవసరం. దానికి అవసరమైనవి ట్రాక్టరులు, కోతకోసి నూర్చే యంత్రాలు కావు. కావలసినవి ఎరువులు, మంచి విత్తనములు, నారు నాటటంలో మంచి పద్ధతులను అవలంబించటం, నీటి సౌకర్యం మొదలైనవి. మీకు కావలసినది రసాయన పరిశ్రమలుకాని, యంత్ర పరిశ్రమలుకాదు. అభివృద్ధికి ఇది చాలా ప్రధానమైన విషయము. చైనావారు, కమ్యూనిస్టుల సిద్ధాంత ప్రకారము సాముదాయక వ్యవసాయాన్ని, అతివాద రూపంలో ప్రవేశ పెట్టి, ఫలితం రానందున తప్పు ఎవరిదో అంటూ ఉంటున్నారు. వారి వ్యవసాయం కష్టాలకు గురిఅవటం సాముదాయక వ్యవసాయ విధానంవల్లగాని, వాతావరణ పరిస్థితులవల్ల ఏమాత్రంకాదు.

మహత్తరమైన ఒక విప్లవ సిద్ధాంతాన్ని క్లుప్తీకరించి చెప్తాను. యంత్రాలద్వారా వ్యవసాయం చేయాలనే వాదాన్ని అందరము పూజించియుండటమే మన మందరం చేసిన తప్పు లన్నిటిలోకి పెద్దదై యుండవచ్చు. కొద్దిపాటి రైతుల భూములను కలిపివేసి, సాముదాయక వ్యవసాయం ప్రవేశపెడితే, రైతులు దానికి వ్యతిరేకిస్తారు. రష్యాలో అంతే జరిగింది. చైనాలో కూడా ఇప్పుడు అంతే జరుగుతూ ఉంటుందని అనుకోక తప్పదు. కేవలం యంత్రాలను ఉపయోగించటంకోసం వ్యవసాయాన్ని ఇంత సంపూర్ణంగా, భిన్నంగా పునర్నిర్మించటం ప్రాథమికమైన పెద్దతప్పు అయినది. ఇప్పుడు మీకు కావలసినది రసాయనికంగా

అభివృద్ధికరమైన సాధనాలుకాని, యాంత్రికంగాకాదు. అతి శీఘ్రగతిని పెరిగిపోతున్న జనసంఖ్యకు ఆహారాన్ని సరఫరా చేయగలిగినది ఎరువులను ఉపయోగించటం మొదలైనవాటి ద్వారానే అని చెప్పాలి. ఇవన్నీ కొద్దిపాటి రైతుల భూములలో చేయవచ్చు. రైతులు కూలీలుగా పనిచేయవలసివచ్చే పెద్ద సాముదాయక వ్యవసాయంలోనే చేయాలనిలేదు.

ఇహ మనదృష్టిని తాబేలువైపుకు అంటే భారత దేశానికి మళ్లిస్తాము. చైనా అభివృద్ధి మీకు కన్ను చెదిరిపోయేటట్లుగా కనబడి, సింగపూరులోఉన్న మీరు మీకు పడమరలో ఉండి నెమ్మదిగా డేకుతూఉన్న తాబేలును మరచిపోయారు. పెద్ద భూఖండమైన భారతదేశాన్ని మరచిపోయారు. మీరు ఆ దేశం వైపుకు చూడక మరొకవైపు చూస్తూఉంటే, భారతదేశం ఒడిదుడుకులు లేకుండా క్రమంగా అభివృద్ధి చెందుతూ వస్తున్నది. భారతదేశంలో, జరుగుతున్నది మీరు గమనించకపోయినట్లయితే తరువాత మీరు ఆశ్చర్యపోయే విషయాలు చూస్తారు.

భారతదేశం ఏం చేస్తున్నది? చైనా, భారతదేశాలు ఇంచుమించు ఒకే సమయంలో బయలుదేరాయి. ఆ రెండు దేశాల మధ్య పదెం, అది పందెం అని అనుకుంటే, 1940 సం. దశాబ్దం చివర సం. లలో ప్రారంభమైనది. అప్పుడే ఈ రెండు దేశాలు స్వతంత్రమైనవి. చైనాతో పోలిస్తే భారతదేశం చాలా నెమ్మదిగా బయలుదేరింది.

భారత ప్రథమ పంచవర్ష ప్రణాళిక పి. డబ్ల్యు. వర్కున్‌తో కూడిన పథకంతప్ప వేరే గొప్పదేమీకాదు. భారతదేశంలోని బ్రిటీషు ప్రభుత్వ సంప్రదాయాన్ని అనుసరించే ఉన్నది. పారిశ్రామికంగా అట్టే ప్రాధాన్యతలేదు. ఇప్పటికి సరిగా అయిదేళ్ళనాడు ఆరంభమైన రెండవ పంచవర్ష ప్రణాళిక వచ్చేవరకు పారిశ్రామిక సంబంధమైన పెద్ద ప్రయత్నమేమీ జరుగలేదు. నేను అసలైన రెండు పంచవర్ష ప్రణాళికలను తరచిచూచే ముందు ఈ రెండు దేశాలు ఏ స్థితికి వెళ్లాయి అని పరిశీలిస్తాను. (రెండవ పంచవర్ష ప్రణాళిక ఇపుడే పూర్తి అయినది. మూడవ ప్రణాళిక ప్రారంభమై ఆరు వారాలైనది). అంటే ఈ స్వల్ప కాలంలో ఆ దేశస్థుల జీవన ప్రమాణం ఎంతవరకు హెచ్చింది అన్నది ప్రథమంగా గమనించవలసి ఉంటుంది. అసలు ఈ రెండు దేశాలు చాలా బీదవి. వ్యక్తి ఆదాయము (తలసరి ఆదాయము) సింగపూరు, ఫెడరేటెడ్ మలయాలలోకన్న తక్కువ. పశ్చిమ రాజ్యాలతోనూ, రష్యాతోనూ పోలిస్తే ఇంకా తక్కువ. చైనా తన ప్రజల జీవన ప్రమాణాన్ని భారతదేశంలోకన్న అధికంగా చేయగలిగినదనుకోటం తప్పు. ఆర్థిక శాస్త్రజ్ఞులు ఒకరితో ఒకరిని పోల్చిచూస్తారు. ఈమధ్య అలా చేసినది ప్రొ. జాన్ గాల్‌బ్రైతు. లెక్కలను ఆయన తయారు చేయలేదు. అనేకమంది కలిసి చేసినవి. ఈ లెక్కల ప్రకారము భారతదేశంలో వ్యక్తి ఆదాయము సం. నికి 77 డాలర్లు, చైనాలో 66 డాలర్లు అని తేలినది.

ఈ అంకెల మూలాన తెలియవచ్చిన భేదాన్ని గురించి పెద్దగా చెప్పదలచలేదు. అభివృద్ధిచెందని ఒక దేశంలోగల కోట్లకొలదీఉన్న జనంయొక్క వ్యక్తి ఆదాయాన్ని సరిగ్గా నిర్ణయించి ఎవరూ చెప్పలేరు. ఈ లెక్కలనుబట్టి నేను చెప్పేదల్లా ఒకటే. భారతదేశంకన్న చైనా తన ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చు చేయగలిగినదని ఎవరైనా చెబితే అది తప్పు అని మాత్రమే నేను చెబుతాను. ఈ రెండు బీదదేశాలు అనాలి. కాకపోతే చైనా వారు భారతీయులకంటె కూడా బీదవారనవచ్చు. అన్న వస్త్రాల విషయంలో భారతదేశం ఒక వాసి ఎక్కువ సాధించిన దనవచ్చు. ఇది చాలా మంది గమనించలేదు. కాని గమనించవలసిన ముఖ్య విషయము.

చైనా భారీ యంత్రాల నిర్మాణానికి ఎక్కువ కృషి చేసినదనీ, నిలువలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చినదనీ, అలా చేస్తే ఇపుడు ఆదాయం తగ్గినా, ముందు ముందు ఎక్కువ కాగలదనీ, మీ రనవచ్చు. మీ రన్నదాంట్లో సత్యం లేకపోలేదు. చైనావారు కూడబెట్టినది భారతదేశం కూడబెట్టినదానికంటె హెచ్చు. దానికి కారణాల గురించీ, దానివల్ల వచ్చే ఫలితాల గురించి తరువాత చెబుతాను. మీరు చెప్పినది నిజమైనా, అన్ని విషయాలను లెక్కలోకి తీసికొని, మానవ శ్రేయస్సు దృష్ట్యా పరిశీలించి చూస్తే, పందెంలో కుందేలు తాబేలుకంటే ముందుకు పరుగెత్తినదనటం చాలా పెద్ద తప్పు.

# తెలివిమాలిన మనసు

"స్ఫూర్తిశ్రీ"

తెలివిమాలిన మనసు
వెలలేని రతనాల
పాటలనె అల్లుకొని
పరవశమ్మైపోవు॥

అలవి తప్పిన వేళ
వలలోని పిట్టవలె
తనపాటలో తానె
తగులుకొని వాపోవు॥

తనకష్టమే తాను
అనుభవింపనె లేదు
లోకమ్ము కోసమై
శోకార్తమై పోవు॥

సంగీత ఝురులలో
సాహసమ్మున దూకి
సుడులలో పడిపోవు
వడికి కొట్టుక పోవు॥

చింత పీడనె లేదు
గొంతు విప్పనె లేదు
మాయలోకములతో
రాయబారము పోవు॥

కరగి కన్నీరౌను వెలిగి వెన్నెలయౌను
లోకనాథునిలోన ఏకాకియౌను॥

# విశ్వంగారి నాల్గు అనువాద గ్రంథాలు

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

దండి దశకుమారచరిత్ర, బాణభట్టు కాదంబరి, భారవి కిరాతార్జునీయం, కాళిదాసు మేఘసందేశం – ఈ నాలుగు గ్రంథములు సంస్కృతమునుండి తెలుగులోని కనూదితములు. అనువాదకర్త : శ్రీ విద్వాన్ విశ్వం. మొదటి మూడు గ్రంథాలు వ్యావహారిక వచనంలో వ్రాయబడ్డవి. నాలుగోది గ్రాంథిక భాషలో వ్రాయబడ్డ పద్యం. సంస్కృతంలో దండి భట్టబాణు లిద్దరు గద్యకవులుగా పేరుపడ్డవాళ్ళు. భారవి కాళిదాసు లిద్దరు పద్యకవులుగా పేరుపడ్డవాళ్ళు. అనువాదకర్తగారు సంస్కృతంలోనుండి రెండు గద్య గ్రంథాలు, రెండు పద్యగ్రంథాలు చేబట్టారు. గద్య గ్రంథాల్ని తెలుగులోకూడ గద్యంగా వ్రాశారు. సరే పద్య గ్రంథాల్లో భారవిని గద్యంలోనూ, కాళిదాసును పద్యంలోను వ్రాశారు. రెండూ పద్యగ్రంథాలే కాబట్టి వ్రాస్తే రెంటినీ పద్యాల్లో వ్రాయవలసింది, లేకపోతే రెంటిని గద్యంలో వ్రాయవలసింది. ఒకదాన్ని పద్యంలో ఒకదాన్ని గద్యంలో వ్రాయటంలో అభిప్రాయమేమిటో బోధపడటంలేదు. భారవిది నారికేళపాకం కాబట్టి దానిని వచనంలో వ్రాస్తే తేలిగ్గా పాఠకులకు అందుబాటులో ఉంటుంది. కాళిదాసుది ద్రాక్షాపాకం గాబట్టి అది పద్యంలో వ్రాసినా ఫరవాలేదు అంటే ఆ సమాధానం సంస్కృతానికే సరిపోతుంది గాని తెలుక్కి సరిపోదు. పూర్వం వకరు కాళిదాసుగారి మేఘసందేశాన్నే నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు సమాసాలు ఏమాత్రం మార్పుచెయ్యకుండా తెలుగులోకి దింపి వ్రాస్తే అది చదివి చాలామంది మాంచి గొట్టుగా ఉందన్నారు. భారవినికూడ పద్యంలో ద్రాక్షాపాకంగా వ్రాయటానికి అవకాశం ఉండనే ఉంటుంది. అందుచేత పద్యమైనా గద్యమైనా సరళంగానూ వ్రాయవచ్చు; గొట్టుగానూ వ్రాయవచ్చు.

భాషవిషయంలో కూడ అనువాద కర్తగారు గద్యానికి వ్యావహారికభాష, పద్యానికి గ్రాంథికభాష వాడారు. అయితే ఈ గ్రాంథికభాషలో వీరు కొన్ని వ్యావహారికరూపాల్ని కూడ వాడారు. వ్యావహారికభాషలోనున్నూ గ్రాంథికరూపాలు బహుధా వాడారని వేరే చెప్పక్కర్లేదు. పరిశుద్ధమైన వ్యావహారిక భాష వ్రాయటమనేది ఉండనే ఉండదు. వ్యావహారిక భాషలో వ్రాసేవారందరూకూడ గ్రాంథికరూపాలు వాడటం తప్పనిసరిగా జరుగుతున్నదే. కేవలం మాట్లాడుతున్నట్టుగా వ్రాయటం బాగా విచారిస్తే అసలు సాధ్యపడదనే చెప్పవలసి ఉంటుంది. మాట్లాడటంలో వాక్యంపాటు వేరు, వ్రాయటంలో వాక్యంపాటు వేరుగా ఉంటుంది. కొన్ని పదాల మీద వచ్చే ఊతాలవల్ల మాట్లాడటంలో క్రియలు లేకుండానే సరిపెట్టవచ్చు. ఆ పద్ధతి వ్రాతలోకి తెస్తే, అసలు తేవడం కష్టం, తెస్తే పాఠకుడు అయోమయస్థితిలో పడక తప్పదు. మనం ఇప్పుడు వ్రాసే వ్యావహారికం ఉందే యిది అటు మాట్లాడేదీ కాదు, ఇటు గ్రాంథికమైందీ కాదు. వ్రాసేటప్పుడు తప్పకుండా వాక్యరచన, కుదింపు, అన్వయక్రమం మొదలైనవన్నీ గ్రాంథికపద్ధతిలోనే ఉంటాయి. రచయిత వ్యుత్పన్నుడైతే సమాసరచన సుబంతశబ్దరూపాలు చాలాభాగం గ్రాంథికంగానే ఉంటాయి. పోతే ఏవో కొన్ని ఊతపదాలు బహువచనాలు వచ్చినపుడు పూర్వాక్షరానికి దీర్ఘాలు క్రియలు మొదలైనవి కొన్ని వ్యావహారిక రూపంలో ఉంటాయి. ఎవరి రచనలోనుంచైనా వీటి కుదాహరణలు కావలసినన్ని దొరుకుతవి. కొన్ని క్రియారూపాలు, మరికొన్ని శబ్దరూపాలు, అటు గ్రాంథికంలోను, ఇటు వ్యావహారికంలోను ఉండనివి కూడా వాడటం తప్పదు.

ఈ చెప్పిన దోషాలన్నీ ఎవరికైనా తప్పవు. ఆమాట కొస్తే నాకూ తప్పవు. శ్రీ విద్వాన్ విశ్వంగారికీన్నీ ఈ దోషాలు తప్పలేదు. వీటిని వదలిపెట్టి చూస్తే విశ్వంగారి భాష చాలా భాగం సరళంగానూ, మెత్తగానూ, ప్రసన్నంగానూ ఉన్నదనే చెప్పాలి. అన్ని గ్రంథాల్లోనూ దశకుమారచరిత్ర అన్నివిధాలా చాలా బాగావుంది. భాష యెంతో సులభంగానూ, మధురంగానూ ఉంది. సమాసం కావాలంటే వెతికి పట్టుకోవాల్సిందే. గ్రంథం చదువుతుంటే అనువాదంలో వచ్చే తికమకలేవీ కన్పించవు. స్వతంత్రగ్రంథంలాగా నడుస్తుంది. కథాకథనం ఎంతో సొగసుగా సాగుతుంది. ఇది మూలంలో ఉండే గుణమే అయినా అనువాదకర్త వాక్యరచనలో చూపిన మెలకువవల్ల ఈ గుణా

వికి మరింత వికాసమే వచ్చింది. ఈ గ్రంథంలో శ్రీ విశ్వంగారు వాడిన భాష వ్యావహారిక రచనలో చేసిన ఒక గొప్ప ప్రయోగం. ఈ ప్రయోగంలో ఆయన చాలాభాగం జయం పొందారు. ఎంత మహాకావ్యాన్నైనా వ్యావహారికభాషలో వ్రాయవచ్చు అని నిరూపించటం ఆయన ఆశ అనుకుంటాను. అట్లాంటి ఆశే ఆయనకుంటే ఈ గ్రంథానికి సంబంధించినంతవరకు అది నెరవేరిందనే చెప్పవచ్చు. అయితే అటువంటి ఆశ ఆయన కున్నట్లు ఆయన యే గ్రంథం పీఠికలోనూ చెప్పలేదు. చెప్పక పోయినా ఆయన యీ మాటను కాదనరనుకొంటాను. దశ కుమార చరిత్ర కథాకథనము ప్రధానమైన గ్రంథం. అదొకటే శ్రీ విశ్వంగా రవలంబించిన రచన పద్ధతికి వీలిచ్చింది. ఈ గ్రంథంలో శ్రీ విశ్వంగారి రచన ప్రశస్తంగా ఉంది.

మరి కాదంబరి యిల్లా కాదు. కాదంబరి రచన దశకుమారచరిత్ర రచనకంటె ఎంతో విభిన్నమైంది. ఆ రెండూ రెండు త్రోవలు. దశకుమారచరిత్ర రచన సరళంగానూ, లలితంగానూ ఉంటే కాదంబరిరచన బాగా ప్రౌఢపాకంలో ఉంటుంది. దశకుమారచరిత్రలో వస్తురసం ప్రధానమైతే కాదంబరిలో వాగ్రసం ప్రధానంగా ఉంటుంది. దశకుమార చరిత్రలో కవి ప్రతిభ ముఖ్యంగా కథాకథనంలో ప్రవహిస్తే కాదంబరిలో వర్ణనలలో ప్రవహిస్తుంది. బహువర్ణనాకులమైన కాదంబరిని తెలుగులో వ్రాయడమే చాల కష్టమైనపని. ఆ సుదీర్ఘములైన సావయవ రూపకాలు, మాలోత్ప్రేక్షలు, విరోధాభాసములు, శ్లేషానుప్రాణితోపమాలంకారములు మొదలైనవి తెలుగుభాషలోనికి తెచ్చుట బహు కష్టమైన విషయం. కొన్ని అలంకారములు పరివృత్తి సహముల విషయంలో అంత బాధ లేదుగాని పరివృత్త్యసహములైనవాటి విషయంలో అడుగడుక్కీ చిక్కే. ఆ అలంకారపాటవమంతా వచ్చేట్టు వ్రాయటం పెట్టుకుంటే కుదిరేపని కాదు. శ్రీ విశ్వంగా రవలంబించిన పద్ధతి మంచి ఫాయిదాగా ఉంది. అట్లాంటి సందర్భాలు వచ్చినప్పుడు వాక్యాలు ఖండించి చిన్న చిన్నవిగా చేసి వర్ణనాంశం చక్కగా వివరిస్తూ రచన సాగించారు. అలంకారం వాగ్విన్యాసాశ్రితమై యున్న సందర్భాల్ని ఆయన యథాతథంగా తీసికొని రావటానికి ప్రయత్నం చేయకపోవటమే యుక్తంగా ఉంది. ఎంత జాగ్రత్తపడ్డా ఈ గ్రంథంలో వ్రాసిన భాషలో కొంత కాఠిన్యం తప్పలేదు. దానికి కారణం మూల గ్రంథం యొక్క ప్రభావమే అని చెప్పాలి. ఆ ప్రభావాన్ని ఈయన యెంత త్రోసివేసినా అది రచనలో బలవంతంగా ప్రవేశించటం తప్పలేదు. అందువల్ల యీ గ్రంథంలో వాడిన వ్యావహారికంలో కృత్రిమత్వం తప్పనిసరిగా ఉండేదానికంటే బాగా ఎక్కువగా కన్పిస్తుంది. కాని కథాకథనం ప్రధానమైన చోటుల్లో రచన సరళంగాను, సుందరంగాను, ప్రసన్నంగానూ సాగిపోతుంది.

భాషలో ఈ కాఠిన్యం ఈ కృత్రిమత్వం కిరాతార్జునీయంలో ఒక అడుగు ముందుకే వేసింది. కాదంబరిని తెలుగు చెయ్యటంలో ఉన్న కష్టంతోపాటు కిరాతార్జునీయం తెలుగు చెయ్యటంలో మరొక కష్టంకూడా ఉంది. ఏ శ్లోకాని కాశ్లోకం ఒక సమగ్రమైన భావం. ఆ భావాలకు పద్యంలో ఉండే అనుస్యూతి వేరుగా ఉంటుంది. వచనంలోకి వచ్చేసరికి అనుస్యూతి వేరుగా ఉండవలసి వస్తుంది. ఒక్కొక్క శ్లోకాన్ని ఒకే వాక్యంలో అనువదిస్తే ఆ తరువాతి శ్లోకార్థంతో కుదిరే అనుస్యూతి చిన్న చిన్న వాక్యాలుగా ఖండించి వ్రాస్తే ఒక్కొక్కప్పుడు దెబ్బతింటుంది. దీనికి తోడు అలంకారాలు వచ్చిన చోట కలిగే యిబ్బంది అనుభవైకవేద్యమే. ఫలితంగా ఈ గ్రంథం శ్లోకాలకు తాత్పర్యములు వ్రాయటంగా తయారైంది. భాషయేమో కావ్యభాష వాడక తప్పలేదు. భావంలో ఉన్న ప్రౌఢినిబట్టి పదబంధం కూడా ప్రౌఢం కాకతప్పదు. అందులో కిరాతార్జునీయంలో భావాలు చాలాభాగం కవి ప్రౌఢోక్తి సిద్ధములైనవి కావడంవల్ల ఆ ప్రౌఢపదబంధాన్ని కొంతకాకపోతే కొంతైనా అనుసరిస్తేతప్ప ఆ భావాలు తెలుగులోకి రావు. కావ్యభాషలోనే కన్పించేటువంటివన్నీ సామాన్య జనుల వాడుకలో లేనటువంటివన్నీ పదములకూ పదబంధాలకు, సున్నాలు, దీర్ఘాలు తగిలించినంతమాత్రంచేత వ్యావహారిక భాష అవుతుందనుకోటం ఎంతవరకు న్యాయమో విజ్ఞులాలోచించాలి. ఇట్లా కావ్యభాషకు సున్నాలు, దీర్ఘాలు చేర్చి వికృత పరచటంవల్ల వ్యావహారికం కాకపోగా సహృదయులకు చదవటానికికూడా కొంత యెబ్బెట్టుగా ఉంటుంది. కొంచెం ఉదాహరించి మరీ చర్చిస్తాను. (1) 'వీరి యీ విశిష్టసౌందర్యశ్రీ సమవలోకనంతో గంధర్వులదే తొలిసారిగా వీరి కలరూపు కనుగొన్నట్లుగా అద్భుతావిష్టులై ఆదరవిలోకనాలతో వారిని వీక్షింప సాగినారు. (2) జలతరంగశీకర సంస్పర్శతో శీతలితమైన ఆ వాతపోతం వారి కెంతో హాయి నొడగూర్చినది. (3) ఆయన వపురుజ్జ్వలత జయశీలతను వేనోళ్ల చాటుతున్నది'—ఈ మూడు వాక్యాలు మచ్చుతునకలు. మొదటి వాక్యంలో 'సమవలోకనం' 'కనుగొన్నట్లు' ఈ రెండు పదాలకు గ్రాంథిక రూపాలు ('సమవలోకనము' 'కనుగొన్నట్లు') వ్రాస్తే వాక్యం గ్రాంథిక మౌతుంది. రెండో వాక్యంలో 'వాతపోతం' అను పదానికి చివరనున్న సున్న 'ము' వర్ణంగా మారిస్తే గ్రాంథిక మవుతుంది. మూడోవాక్యంలో 'చాటుతున్నది' అన్న పదంలో

# విశ్వంగారి నాల్గు అనువాద గ్రంథాలు

ఉన్న 'థు' వర్ణానికి బదులు 'చు' వర్ణం పెడితే గ్రాంథిక మవుతుంది. కాని యిల్లాంటి గొట్టు భాష, యీ సమాసాలు, ఇత ప్రత్యయములు, త ప్రత్యయములు ఇవన్నీ ప్రౌఢమైన గ్రాంథికభాషతాలూకువే. వీటి నన్నింటిని వ్యావహారికంలోకి దించినప్పుడు మువర్ణము, చువర్ణము మొదలైనవాటిని తొల గించి వాటి స్థానంలో బిందువు తువర్ణము మొదలైనవి పెట్టి వ్యావహారిక మనుకోటం సబబేనా ? అని ప్రశ్న. వ్యావ హారికవాదుల్లో చాలామంది యీవిషయాన్ని ఆలోచినట్టు న్నట్లే కన్పించదు. "ఆ దేవాపగాజలాంతర్భాగంలో" "ఆసరి జ్జ్వాలలలో" "ప్రళయకాల ఝంఝూవాతం" "అమరతరుణీ పరిభుక్తమైన గంగాజలం" ఈరకమైన పదబంధం వ్యావ హారికభాషలో ఎంతో వికృతంగా కన్పిస్తుంది. ఈ కిరాతార్జు నీయం చదువుతుంటే ఒకవిషయం కొట్టవచ్చినట్టు కన్పడు తుంది. అదేమిటంటే ఇల్లాంటి కావ్యాలకు వ్యావహారికభాష నప్పదని. వ్యావహారిక భాషకు ఒకమితి ఉంది. వస్తురసం ప్రధానమైన సందర్భాల్లోనే అది నప్పుతుంది. వాగ్రసం ప్రధాన మైనవాటిల్లో అది నప్పదు. వీరవ్యావహారికవాదులు ఈ విషయం ఒప్పుకోరు. వీరగ్రాంథికవాదులూ ఒప్పుకోరు. కాని దేనిస్థానం దానికుంది. పిడుక్కీ బియ్యానికీ వకటే మంత్రం ఉపయోగించదు.

శ్రీ విశ్వంగారి ఈ మూడు గద్యకావ్యాల్లోనూ దశ కుమారచరిత్ర రచన మాంచి పాకంలో పడింది. కాదంబరి భాషను కొంచెం మార్చుచేసి గ్రాంథికస్వరూపం ఇస్తే ఆగ్రంథంలో ఉపయోగించిన పదజాలం నప్పుతుందని నా వూహ. కిరాతార్జునీయంలో ఈ భాషాసంబంధమైన మార్పే కాకుండా పద్యాల్లో చెప్పతగ్గ భావాన్ని వచనంలో అనుస్యూతి కుదిరేటట్టు స్వతంత్రంగా నడిచేటట్టు సంస్కరించటం అవ సరమని తోస్తుంది. "బాహాబాహి" మొదలైన క్లిష్టాలిత్యాలు అక్కడున్నా గ్రంథకర్తగారు ఈ గ్రంథాలు తెలుగుచెయ్య డానికి తగినంత వ్యుత్పత్తి కలవారనడంలో సందేహం ఏమాత్రంలేదు. వీరి రచనలో ఉన్న మరిఒక సుగుణం స్పష్టత. మూల భావాన్ని స్పష్టం చెయ్యడానికి ఎంతో నేర్పు నేర్పు చూపారు వీరు. నాల్గవది మేఘసందేశం. ఈ గ్రంథాన్ని వీరు కందపద్యాల్లో వ్రాశారు. మేఘసందేశాన్ని చాలామంది తెనుగుచేశారు. వీరూ తెనుగు చేశారు. ఇంతవరకూ ఏ అనువా దానికీ కూడా ప్రశస్తి రాలేదు. వీరి గ్రంథానికి ప్రశస్తి వస్తుందో రాదో నిర్ణయించేది కాలం. మరి యింతమంది అనువదించారుగదా "మరలనిదేల మేఘసందేశ మన్నచో" కాళిదాసుమేఘం ఈయన్ను వదలకుండా పట్టుకోవడమే. అనువాదానికేంగాని దాన్ని అలా ఉంచి యీ అనువాదానికి గ్రంథకర్తగారు వ్రాసిన ప్రవేశిక సొగసుగా ఉంది. ఈ ప్రవే శిక చదివితే గ్రంథకర్తగారు కవితాత్మ కలవారని తోచి తీరు తుంది. ఆయన కవితాత్మ యీ ప్రవేశికలో ధ్వనించినంతగా గ్రంథ రచనలో ధ్వనించలేదు. అంత బాగావుంది యీ ప్రవే శిక. అసలు సంస్కృతంలోంచి యే కావ్యాన్ని యెవరు తెనుగు చేసినా ఆ అనువాదం మూలంకంటే ఎన్నో మడుగులు లొచ్చు గానే కన్పిస్తోంది. నన్నయాది పూర్వకవులకు ఈమాట వర్తిం చదు. ఆధునికులకుమాత్రమే వర్తిస్తుంది. దీనికి బహు కారణా లున్నై. వాటన్నింటినీ యిక్కడ చర్చించడానికి సందర్భం కాదు. కాని ఒకటి రెండు విషయాలు చెప్పితీరాలి. ఒకటి సంస్కృతంలో భావంపట్టుబడి వేరు. తెనుగులో భావంపట్టుబడి వేరు. రెండోది సంస్కృతంలో ఒకజాతి భావం వ్యక్తీకరించే పద్ధతి వేరు. అదే జాతి భావం తెలుగులో వ్యక్తీకరించే పద్ధతి వేరు. ఎటువంటి రచనాశిల్పం అనుసరిస్తే ఆ భావానికి దీప్తి వస్తుందో ఆ భావ యొక్క స్వభావాన్నిబట్టి నిర్ణయించుకోవాలి. ఏ వృత్తంలో చెప్పాలి, పద్యం ఎట్లా ఎత్తుకోవాలి, గణాల్ని యెట్లా విర వాలి, వాక్యంయొక్క పాటు ఎట్లా ఉండాలి, వాడే భావ యే పాళంలో ఉండాలి, కావ్యాల నుంచి సిద్ధంచేసుకొన్న భావ వాడాలా ! నిత్యవ్యవహారంలోంచి సిద్ధంచేసుకొన్న భావ వాడాలా ? మొదలైనవన్నీ గంపెడు ప్రశ్నలు. మహాకవి సంప్ర దాయాన్నివదలకుండా లోకానుసంధానం చేస్తూ కావ్యరచన నడపడం ఏమంత తేలికైంది గాదు. మూలంతో పోల్చకుండ చదివితే శ్రీ విశ్వంగారి అనువాదం చక్కగానే వడుస్తుంది ముఖ్యంగా శ్రీ విశ్వంగారు ఈ గ్రంథరచనలో చూపిన గుణం భావాన్ని స్పష్టంగా చెప్పటం. చాలా అనువాదాల్లోకంటే వీరి అనువాదంలో ఉన్న విశేషం యిది. అనవసరమైన పుల ముడు పెట్టి భావాన్ని అస్పష్టం చేసినటువంటి సందర్భం ఒకటి లేదు. భాష సరళంగా మృదువుగా ఉన్నది. భావాన్ని ఖండించి చిన్నచిన్న కందపద్యాల్లో రమణీయంగా చెప్పారు రచయిత.

"ఏతెంచెను చుట్టమ్మని  
ప్రీతిం గన్నబరచి వృత్యరీతులతో నీ  
చేతోముదముం గూర్చును  
లే, తత్పురభవనబర్హిలీల పయోదా !"

జడివానల యురుములతో  
జడిపింపకు వారు గుండె చాలని బేలల్  
విడువక బంగరు మెఱుపుల  
పుడమిని జూపించి పుణ్యమునొ గొనుమయ్యా !"

ఈ రెండుపద్యాలూ ఈ రచయిత యెంత రమణీయంగా వ్రాయగలరో చెప్పటానికి వుదాహరిస్తున్నాను. అనువాదం అన్నట్టు ఛాయగానైనా కన్పిస్తున్నాయా యీ పద్యాలు! మొదటిపద్యంలో చివరి చరణంలో మొదటి అక్షరంతో వాక్యం విరిచి ద్వితీయాక్షరం (ప్రాస) తో కడమ వాక్యాన్ని అందుకోవడం పద్యానికి అంతకీ ఒక సొగసు తెచ్చింది. తకార ప్రాస పట్టడంవల్ల భావం సొగసుగా చెప్పడానికి వీలైంది. మరి అర్ధానుస్వారాలూ సరళాదేశాలూ మానివేయడంవల్ల "శిలి పయోదా" అన్నచోట "శిలన్ పయోదా" అని విరుచుకోవాలా ? లేక సమాసమా ? అన్న చిక్కు వుంది. సమాసమైతే "శిలాపయోదా" అని కావాలసి వస్తుంది. ఇతరత్రా గ్రంథకర్తగారు చూపిన వ్యుత్పత్తినిబట్టి ఆయనకు ఈమాత్రం తెలియదనుకోవడం ఏమాత్రం సహృదయత్వ మనిపించుకోదు. అక్కడ తప్పకుండా "శిలన్" అని విరుచుకోవలసిందనే గ్రంథకర్తగారి అభిప్రాయం. కనీసం యిట్లాంటి చోట్లనైనా అర్ధానుస్వారాలు పెట్టి సరళాదేశాలు చేస్తే బాగుంటుంది. రెండోపద్యం మూలానికి దీటుగా ఉంది. "విక్లబాస్తాః" అనుదానికి "వారు గుండెచాలని బేలల్" అనుట పరమ రమణీయమైన తెనుగు. మరి పద్యరచన చాలా ప్రశస్తంగా ఉన్నది. మరి "ఇలాంటి చక్కనిపద్యాలు" ఉదాహరింపతగ్గవి చాలా ఉన్నవి. "చేతనా చేతనేషు" "చేతన విచేతనములు" "వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం" "వప్రక్రీడా క్షిప్రద్విపనిభము చూచె" "ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః" "ధూమజ్యోతి స్సలిల మహామారుత సన్నిపాతము" మొదలైనవాటిల్లో రచన తేలిపోవటం కన్పిస్తుంది. మూలంతో పోల్చి చూచినప్పుడు కొంత భావప్రౌఢి, మాధుర్యం, వాగ్లావణ్యం లుప్తమైనట్లు కన్పిస్తుంది. "తనుగని" "మరలొవత్తును" మొదలైన వ్యావహారిక రూపాలు, "పాండువర్ణాంగిని" మొదలైన స్ఖాలిత్యాలు అచ్చటచ్చట కన్పించినప్పటికీ యీ గ్రంథమునందు పూర్వానువాదాల్లో లేని వక ప్రత్యేకత వుంది. అది మొదలుపెడ్తే చివరిదాకా చదివించే లక్షణం. ఇది గ్రంథరచనకు ఆయువుపట్టువంటిది.. ఈ గుణం శ్రీ విశ్వంగారి రచనలో సమృద్ధిగా ఉంది. ఈ నాల్గు గ్రంథాలూ చదివి ఆనందింప తగ్గవి. అందులోనూ దశకుమారచరిత్ర పరమ హృదయంగమంగా ఉంది.

---

# బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

మహామహోపాధ్యాయులు, అభినవవాగనుశాసనులు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు గత మాసం మూడవ వారంలో పరమపదించారు. శ్రీ శాస్త్రిలవారు బహు గ్రంథకర్తలు. ఆంధ్రభాషానుశాసనము, ఆంధ్ర దశరూపకము మొదలైన వ్యాకరణ ఆలంకారిక గ్రంథాలనేగాక, సంస్కృతములోనుండి బహు నాటకములనుగూడా వారు అనువదించారు. భారతి తరుచు వారి రచనలను ప్రకటిస్తూవుండేది. అమలాపురం హైస్కూలులో మొదట అధ్యాపకవృత్తిలో చేరి, స్వయంకృషి వలన, శక్తిసామర్థ్యములవలన మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకులై, ఆ తరువాత ఆంధ్ర విశ్వకళాపరిషత్కళాశాలలో సంస్కృతాంధ్రాధ్యాపకులుగా చేరారు. ఆ ఉద్యోగమునుండి విశ్రాంతి పుచ్చుకొన్న అనంతరం గూడా శ్రీ శాస్త్రిలవారు రచనా వ్యాసంగం సాగిస్తూనేవున్నారు. శాస్త్రిలవారి ఇటీవలి గ్రంథములలో సంస్కృత వాఙ్మయచరిత్ర అతి ప్రధానమైనది. శ్రీ శాస్త్రిగారి ప్రజ్ఞాప్రాభవములను శ్రీ ఎం. కృష్ణమాచారి యంతటి పండితులు గూడా మెచ్చుకొనియున్నారు. "Of the galaxy of teachers of orthodox Indian Schools, Sri Malladi Suryanarayana Sastry garu is a lingering luminary." ఇప్పుడు వారు దివంగతులు కాగా, ఆ జ్యోతి పూర్తిగా ఆరిపోయింది. తెలుగుదేశం ఒక మహాపండితుణ్ణి కోల్పోయింది.

# పుత్రవతి

★

మరాఠీ మూలం : శ్రీ మహాదేవశాస్త్రి జోషి

అనువాదం : శ్రీ జగన్నాథ్

"ర్ర్యాహా..ర్ర్యహా ఉఉర్ర్యహాం ఉఉఉ" చ్చొ చ్చొ చ్చొ ఎంతగా ఏడుస్తావురా నాయనా !—చాల్లేదూ ఇంక,—కడుపు నిండలేదా యేంరా?—అయితే మరి ఆపాలబుడ్డి వదిలిపెట్టేశావేం? పాలు వేడిగా ఉన్నాయా?—మరీ చల్లబడి పోయాయా ?—నాకవి ఏ పాళంలో వుండాలో తెలియకపోయె,—నాకు అజ్ఞానమూ, నువ్వు మూగా—చక్కటి జంటే కుదిరాంరా మనం—నీమీద నా కెంతయినా ప్రేమ ఉంది—కాని, నీ మనసులో దూరటం మాత్రం నా చేతకావటంలేదు. నీదీ నాదీ ఒకటే జాతి అయిపోయింది. మగజాతి—అంచేతనే ఈ చిక్కొచ్చింది. నా పోషణ నీకు తృప్తిగా లేదని నాకు తెలుసు! ఏరా పెద్దమనిషీ ? యింత దురదృష్టవంతుడువిగా పుట్టమని నేను చెప్పానా మరి?

ఊరుకున్నట్టే ఊరుకుని మళ్లీ వెంటనే మొదలు పెట్టావా ?—ఒరేయ్ ! అలాగ ఉండుండి గొంతుక చించుకుంటే ఎలాగరా !— అమ్మకీ నాన్నకీ మధ్య చాలా తేడా ఉందని నువు తొందరగా తెలుసుకోవాలి సుమా !— ఈ ఏడుపు సరదా అంతా అమ్మదగ్గిర—తీర్చుకోవాలి; నా దగ్గిర మట్టుకు నీకేం కావలసినా అడిగితీసుకో;—తినడానికి అడుగూ, గోళీలు కావాలని అడుగూ;—అంతేకాని ఆ ర్ర్యహా .... ర్ర్యహా మాత్రం ! నామీద ప్రయోగించకు.

ఛ. ఛ. ఛ—నువ్వెక్కడ వింటావురా !—ఇంద, ఈ పాల బుడ్డి పట్టుకో—ఊఁ—వద్దూ ?—పోనీలే—అదిగో ఆ చందమామ చూడు ! — దానిప్రక్కనున్న నక్షత్రం చూశావా ఎట్లా మెరుస్తోందో—మీ అమ్మలాగ—చూడవూ ?—పోనీలే—నిద్రపో మర్తైతే—నేను ఉయ్యాలలో ఉంచి ఊపుతాన్లే—కాని నాకు జోల పాటలు రావురోయ్ !—ఆఁ !— నీ క్కావలిస్తే "ల్బ ల్బ ల్బ ల్బాహాయీ" అంటాను అంతే—"శ్రీరామరక్ష" అంటాను కూడా—అదే జోలపాటనుకో, ఏం— "ల్బ ల్బ ల్బ ల్బాహాయీ ఉఉఉ ...."

ఏఁవిట్రా అదీ ?—ఏమిటి అలా చించుకుంటావు ?—పక్క తడిగా ఉందా ఏమిట్రా ?—నిన్ను పడుకోపెట్టే ముందర పక్కంతా ఓసారి చేత్తో తడివి చూడాలి కాబోలు! నా కంతమాత్రం ఇంగితం ఎక్కడిదిరా ?—యిహ మనం యిట్లాగే గడుపుకోక తప్పదు. నువ్వే కాస్త అలవాటుపడి సర్దుకుపోవాలి—నీకో చిన్న అక్కయ్య ఉంటే ఎంతో బాగుండేది కదూ ?—నువ్వే తొలిచూలయావు మరి ?—ఆ పుట్టటానికూడా యింత తాత్సారం ఎందుకు చేశావురా ?—తల్లిని యిన్ని సంవత్సరాలు పిల్లలకోసం బెంగపెట్టుకునేలాగ చెయ్యడం బాగుందిరా నీక్కు?—మరీ అంత మూర్ఖం అయితే ఎలాగరా?—యింటిల్లిపాదిమీ నీ పుటకకోసం పరితపించిపోయాం గదా !—మా అమ్మ మంచాన్ని పడి కూడా మనుమడి ముఖం చూడాలని, మహాపట్టుదలతో కొన్ని సంవత్సరాలు ప్రాణాలు ఉగ్గబట్టి—ఆఖరికి, ఆ నిరాశనే మూటగట్టుకొని దారి బత్యంగా తీసుకుని చక్కా పోయింది,—అప్పుడు యిహ మేం యిద్దరమే మిగిలాం—నేనూ, మీ అమ్మానూ !—నా కెప్పుడయినా యింకో మనిషి ముఖం చూడాలనిపిస్తే—లేచి వంటింట్లోకి వెళ్లేవాణ్ణి—దాని కెప్పుడయినా—తనకి యింట్లో మగదిక్కు ఉందని రూఢిచేసుకోవా లనిపిస్తే—ఓసారి సావిట్లోకి వచ్చేది.

నే ఊళ్లోకి వెళితే ఒక ఏడెనిమిది గంటలు నిశ్చింత దానికి—ఈ ఏడెనిమిది గంటలూ ఎలా గడిపేదో మాత్రం తెలుసుకోవడం కష్టం !—ఏదయినా పుస్తకం చదువుకునేదేమో అంటే,—చదువుతూన్న పుస్తకంలో ప్రొద్దున్న 2 వ అధ్యాయములో పెట్టిన తాటాకు గుర్తు అక్కడే ఉండేది, సాయంత్రానికి కూడా. పోనీ సుఖంగా నిద్రపోయిందేమో అనుకోవడానికి—కళ్లు ఎఱ్ఱగా బరువుగా ఉండడం అనేకసార్లు గమనించాను. నే (యింటికి) వస్తూండడం చూడగానే మాత్రం ముఖం సంతోషంగా పెట్టుకోవాలని ప్రయత్నించేది. కాని అది బలవంతంగా తెచ్చిపెట్టుకున్న వెన్నెల. నా కప్పుడే తెలిసిపోయేది, —జాజిమొగ్గ దానంతట అది వికసించవలసిందే గాని,—వేళ్లతో రేకులు విప్పి పువ్వు చెయ్యగలంరా నాయనా !—మీ అమ్మ ప్రకృతి నా బుద్ధికి ఒక పరీక్షప్రశ్నలాగా ఉండేది—అది నా జీవితం అంతా నేను పూర్తిచెయ్యలేని ఒక సమస్యగా ఉండేదిరా !—దానితో కాపురం తేనెలాగ తియ్యగా ఉండేది—చింతకాయలాగా పుల్లగానూ ఉండేది—పదిహేనేళ్లు సంసారం చేశాను దానితో—ఆ రోజుల్లో ఒక్కొక్కప్పుడు పూవుకంటే తేలికగా ఉన్నానేమో అనిపించేట్టు చేసేది—మరుక్షణంలో సీసంకంటే బరువయిపోయానేమో అనిపించేది !—

దాని స్వభావం ఒక జీవనది వంటిది;—వరద వచ్చినప్పుడు వంద్రుతో చిక్కబడిన నీళ్లతో, దూకుకుంటూ, దూసుకుంటూ ఎవరినీ లెక్కపెట్టకుండా కొట్టుకుపోయేది!—మళ్లా శరత్కాలం రాగానే ప్రసన్నంగా నిర్మలంగా మన ముఖాల్ని తన హృదయంలో ప్రతిబింబింపచేసేది.—ఒక్కొక్కప్పుడు ఒక వారానికి వారం పొడుగునా దాని గంభీరమయిన మౌనం సహించి వూరుకునే ఉండేవాణ్ణి—మళ్లీ ఏదో ఒక సుముహూర్తాన అది మందహాసం ధరించి వికసించినప్పుడు

యిల్లూ, వాకిలీ పరిమళించి పోయేది, చైతన్యంతో, ఆనందంతో—అటువంటప్పుడు పెంపుడు చిలకలాగా నా చుట్టూ ఎగురుతూ, నాతో, కూడా తిరుగుతూ, కాలక్షేపం చేసేది. నా భవసాగరంలో ఒక శృంగారించిన నౌకలాగ ఉండేది !—

నిజానికి దాని విషాదానికి హద్దూ ఉండేదికాదు,—ఉల్లాసానికి అంతూ ఉండేదికాదు !

ఎంతటి చిన్నవిషయమయినా సరే,—చటుక్కున అంగీకరించటంగాని,—సులభంగా త్రోసివెయ్యటంగాని దానికి చేతనయేదికాదు. ఇంట్లో సంగతయినా, ఊళ్లో వృత్తాంతమయినా ఎంతో గంభీరంగా ఆలోచించేది. ఎంత అల్పమయిన విషయమయినా సరే—దాని ఆరాతీసి, ఆచూకీ తీసి—తిరగాబోర్లావేసి, తీరికగా పరిశీలించి గుండెల్లో పెట్టుకుని బిగించేసేది—అదే ఆలోచిస్తూ రాత్రింబవళ్లు తికమకపడేది. తనని తన్ను తబ్బిబ్బు చేసుకుని, ఎదటివాళ్లని కూడా ఎంగిలి పడలేనంత నెమ్మది లేకుండా చేసేది. ఏపూట ఏ విషయాన్ని గురించి మనసు పాడుచేసుకుంటుందో, ఆ బ్రహ్మ కూడా చెప్పగలిగి ఉండేవాడు కాడు. "నీ పెళ్లాన్ని అర్థం చేసుకోవటం మా చెడ్డ కష్టంరా బాబూ" అన్న పల్లవి పాడుతూనే, మా అమ్మ వెళ్లిపోయింది !—

నిజం చెప్పాలంటే దాని స్వరూపం యొక్క రహస్యం నాకు తెలియనేలేదురా !—నా చిన్నీ,—నువ్వు కనుక కొంచెం సరిఅయిన సమయంలో పుట్టివుంటే దాని స్వభావం అంత ఒంటరితనంగా ఉండేది కాదేమోరా !—అది నీమీదే ధ్యాస పెట్టుకుని ఉండేది. నువ్వు లేని బ్రతుకు గడ్డిపోచకంటే హీనమని అనుకునేది. నా స్నేహితు లెవరయినా, సకుటుంబంగా యీ యింటికి వచ్చినప్పుడు—వాళ్ల ముద్దొచ్చే పిల్లవా డెవరయినా చంకదిగి, సావడి అంతా తిరుగుతూంటే, దాని సంబరం దాచుకో కలిగేదికాదు—ఆ మర్నాడు మళ్లీ ఆ పిల్లాడు తల్లి చంకలోంచే 'నమస్తే'' అని చెప్పి, ఆ కుటుంబం అంతా వెళ్లిపోగానే దాని ముఖం మారిపోయేది. ఆ మరుక్షణంనుంచీ తన దురదృష్టాన్ని గురించి దుఃఖిస్తూ ఉండేది. ఆరోజా రోజంతా అది మనలో ఉండేదికాదు.

అటువంటి సందర్భాల్లో ఒక్కొక్కప్పుడు నాకు తలకాయ నొప్పేసుకు వచ్చేది !—నేను దాని దుఃఖం పోగొట్టి ఏదో ఓదార్చాలని ప్రయత్నించేవాణ్ణి. అది ఫలించకపోతే, కోప్పడేవాణ్ణి. తక్షణం ఏడుస్తూ కూచునేది. ఇహ నన్ను దగ్గర కయినా రానిచ్చేది కాదు ! "మీరు నన్ను ప్రేమించా వద్దు !—కోప్పడా వద్దు ! నన్నిలా ఒంటరిగా పడుండనివ్వండి" అనేది, ఎంతో ఆవేదనతో—

చాలాకాలంగా దానికి గంగాపురం వెళ్లాలనే వెర్రి కోరిక ఒకటి పట్టుకుంది. "ఉపోషాలూ అవీ ఉంటున్నావు—నోములూ వ్రతాలూ పట్టుతున్నావు. అవి చాలవూ ? ఇంకా యీ గంగాపురం వెళ్లాలని కోరిక ఎందుకే ?—దత్తాత్రేయులవారు ఆ గంగాపురంలోనే ఉన్నారా ఏమిటి? మన యింట్లోనూ ఉన్నారు, మన హృదయాల్లో కూడా ఉన్నారు" అనేవాణ్ణి నేను.

"వెళ్లటం మీ కిష్టంలేకపోతే, దానికి మీరీ వేదాంతం దుప్పటి మాత్రం కప్పకండి. నిన్ను గంగాపురం తీసుకు వెళ్లను అని చెప్పెయ్యండి తీరిపోతుంది."

అంతటితో నా మాటలధోరణి కుంటుపడిపోయేది. పోనీ వెళదామే అనుకున్నా ఎన్నో అవాంతరాలు వచ్చేవి. ఇవాళ వెళదాం, రేపు వెళదాం అనుకుంటూండగానే, నాల్గు నెలలు గడిచిపోయాయి. దాని ఉత్సాహం తాడిచెట్టు ప్రమాణంగా పెరిగిపోయింది. ఇహ యింకా బిగిస్తే తెగిపోతుందని నేను కూడా ప్రయాణానికి ముహూర్తం నిశ్చయం చేయించి సెలవు పెట్టేశాను.

గంగాపురం మేం నిర్విఘ్నంగా చేరుకున్నాం. ఆ క్షేత్రంలో అడుగుపెట్టిన క్షణం నుంచీ అధికారం అంతా దాని చేతుల్లోకే తీసుకుంది. దాని అభిప్రాయం ఈ ధర్మకార్యాలూ, దేవతా దర్శనాలూ నాకు బొత్తిగా తెలియనివని.

ఈ యాత్రలో తన శరీరాన్ని ఎంతయినా కష్టపెట్టుకుంది—చేతులూ, కాళ్లు పగిలి బీటలువేసే ఆ మాఘమాసపు చలిలో తెల్లవారకముందే మంచుతో తడిసిన దారుల్లోపడి, ఆ "భీమా అమరజ" సంగమానికి స్నానానికి వెళుతూన్నప్పుడు, ఈ దేహాన్ని గురించి ధ్యాసే ఉండేదికాదు దానికి. ఆ ఎత్తయిన గట్టుమీద నుంచి నిర్భయంగా నదిలోకి దిగటానికిగాని,—ముళ్లతో నిండిన దారుల్లో నిర్లక్ష్యంగా అడుగులు వేయటానికిగాని—ఆ మోకాళ్లలోతు నీళ్లల్లో సాంతం సాష్టాంగపడి, ముక్కు మూసుకు మునగటానికిగాని, ముందూ వెనకా ఆలోచించేది కాదు. స్నానం ముగించి గట్టు ఎక్కీఎక్కగానే దేవాలయానికి దారితీసి, ఆ తడిగుడ్డలతోనే మధ్యాహ్నంవరకూ ప్రదక్షిణాలు తిరుగుతూనే ఉండేది. మధ్యలో ఒక్క క్షణమయినా కూచుని విశ్రాంతి తీసుకోవాలని తోచేదేకాదు. ఆ ఏడెనిమిది రోజులు కూడా ఆ పుణ్యతీర్థంలో ప్రాణాలు నిలుపుకోవాలి గనుకా, ప్రదక్షిణలకి కాళ్లల్లో సత్తువ ఉండాలి గనుకా ఏవో రెండు మెతుకులు ఎంగిలిపడేది.

ఆరోజుల్లో నేను భోంచేస్తున్నానో లేదో కూడా చూసుకునేది కాదు. దేవదర్శనానికి వచ్చినవాళ్లం, దేహపోషణ చూసుకుంటూ ఉండడమేమిటని ఉపదేశించేది నాక్కూడా. గురువారం రోజున ఉత్సవంలో, ఊరేగింపులో, పల్లకీ వెనక నడుస్తున్నప్పుడు, అంతటి జనసమ్మర్దంలోనూ దానికి కష్టమే అనిపించేదికాదు. ఇహ పూజారి కరుణాకటాక్షం మొదలుపెట్టి స్తోత్రం చదువుతూంటే, దాని గుండ్రటి కళ్లు—పధ్నాలుగేళ్ల పలకరింపు ఎరుగని ఊర్మిళ కళ్లలాగ ఉండేవి. మానసిక బాధతో, మూగ ప్రార్థనతో నిండివుండేవి ఆ కళ్లు.

ఆ స్తోత్రంలో

"అరవయ్యోపడి దాటిన
వంధ్య, సుమంగళి వచ్చి
పుత్రభిక్ష పెట్టమనీ
పమిటకొంగు పట్టిందీ
కరుణ చూపవయ్యా, దత్తయ్యా."

అన్న చరణం మొదలుపెట్టగానే, అది తల భూమి మీద ఆనించి, ఆ చరణం అంతా అయేవరకూ లేచేదికాదు. అంతసేపూ తన మనసులో ఏమని ప్రార్థన చేసుకునేదో నాకు తెలుసు.

"దేవా, దత్తాత్రేయా !—అరవయ్యోపడిలో ఉన్నా, వరం యిచ్చి సంతానం ప్రసాదించావుట ! నాకింకా 35 నిండ లేదు. నన్నెందుకు యిలా పరీక్షిస్తున్నావు ?—నిన్ను త్రికరణ శుద్ధిగా సేవించుకుంటున్నానే, నామీద దయలేదా ?"

మేం మొత్తంమీద పదిరోజు లున్నాం గంగాపురంలో. మేము యింటికి చేరుకునేటప్పటికి అథమపక్షం పది పౌనులన్నా దాని తూకం తగ్గివుండాలి. అయినా దాని నిరీక్షణకి మాత్రం అంతు చిక్కలేదు. ఉపోషాలూ, నిష్ఠలూ సాగిస్తూనే ఉంది. "ఆ భగవంతుడి హృదయంలో కనికర మయినా పుట్టిస్తాను. లేదా ఆ ప్రయత్నంలో నేను బలి అయినా అయిపోతాను" అన్న మొండిపట్టుతో వ్రతాలూ, నోములూ వదిలిపెట్ట కుండా, చేస్తూనేవుంది; నోస్తూనేవుంది.

ఆ తరువాతనేరా నాయనా—ఓరోజు దానికి నీ జాడ పొడగట్టింది. కాని అది నిజమని నమ్మలేకపోయింది. తనలో ఏదో ఒక మార్పు వచ్చిందని తెలుసుకుంది గాని, అది తను కోరుకున్న మార్పేనని అనుకోటానికి ధైర్యం చాలలేదు. "మనకా అదృష్టమే ఉంటే, యిన్నాళ్ళు ! యిన్నేళ్ళ ! ఆలస్యం ఎందుకయ్యేదని అనుమానం పట్టుకుంది. కాని యింకొన్ని రోజులు గడిచాక తన అదృష్టం పండిందని నమ్మక తప్ప లేదు దానికి.

దాని మనస్సు ఒక్కసారిగా వికసించింది. ఇల్లంతా వెన్నెల వచ్చినట్లుండేది. దాని స్వభావం కూడా చటుక్కున మారిపోయింది. నడకలోనూ మాటలోనూ కూడా ఒక కొత్త లావణ్యమూ, మార్దవమూ వచ్చాయి. తన దేహంలో అణు వణువూ ఏదో కొత్త పరిణామం పొందుతున్నట్లు తోచేది కాబోలు. తరుచుగా అద్దం చూసుకునేది ! సంవత్సరంలో ఉన్న ఆరు ఋతువులూ ఒక్క క్షణంలోనే వచ్చేస్తే, మనిషిలో ఎటువంటి పరిణామం వస్తుందో, అలా ఉండేదిరా మీ అమ్మ ఆ రోజుల్లో— నువ్వు వస్తున్నావని ఉత్సాహపడేది. అతిథి కోసం అర్ఘ్యం అదీ సిద్ధం చేసుకున్నట్లు నీకోసం ఎన్నెన్నో సిద్ధంచేసుకుని నీకు స్వాగత మివ్వడానికని ఎదురుచూస్తూ ఉండేది. తను యింతవరకూ కళ్ళ చూడనైనా చూడనట్టు వంటి నీ రూపంయొక్క ప్రతిబింబాన్నే యింట్లో ప్రతి చోటా చూసి మురిసిపోయేది.

దానివంక చూస్తూ కూచుంటే నాకెంతో తమాషాగా ఉండేది. ఒక్కొక్కసారి ఏదో శ్రద్ధగా వింటున్నదానిలాగా ఉండేది దాని ముఖభావం. ఎవరో ఎక్కడ్నుంచో, అస్ఫుటంగా, మధురంగా పిలుస్తున్నట్టు అనిపించేది దానికి. 'ఓయ్' అని పలుకుదామని కూడా అనిపించేది గాని, అంతట్లో బిడియ పడేది. ఆ నాలుగు నెలలపాటూ కూడా, దాన్ని ఉల్లాసంగా ఉంచడానికి నేనేమీ ప్రయత్నించవలసిన అవసరమే లేకపోయింది. దాని హృదయంలో ఆనందం సాగరంలా పొంగి ముత్యాల రాసులు కుప్పలు పోస్తోంది. అటువంటప్పుడు నేనెంత సర సంగా మాట్లాడితే మటుకు రాణింపు ఎలా వస్తుంది ? పైగా దానికి ఎక్కడ చూసినా దత్తాత్రేయులవారే కనిపించే వారు. ఎంతసేపూ ఆయన స్తోత్రమే; ఆయన సంకీర్తనే; ఒకరోజున దాన్నో పరాచకం చేద్దామని బుద్ధిపుట్టింది నాకు—

"దత్తాత్రేయులవారిని కంటె, ఆ డాక్టరు వాసుదేవరావు గారిని ఎక్కువ జ్ఞాపకం చేసుకోవాలి. చివర చివరకి ఆయన సహాయమే మనకి అవసరమౌతుంది."

"మీరు నా భక్తిశ్రద్ధలని పరిహాసం చేస్తా రెందుకు ? ఈ విషయంలో మీరేమీ చెప్పవద్దు నాకు. ఇలాంటివి మీకేం తెలియవు."

ఆ విషయాలని గురించిన జ్ఞానం అంతా ఆవిడే గుత్తకి తీసుకుందిట !—అజ్ఞానమో, జ్ఞానమో దానంతట అదే తెలిసి కొనేవరకూ, అలా వదిలివెయ్యడంలో వచ్చిన నష్టమేముంది? కాని ఉన్నట్లుండి ఒకరోజున దాని పరిస్థితి దానికే అర్థం గాకుండా పోయింది. ఆ రోజు సాయంకాలం నేను యింటికి వచ్చేటప్పటికి, తల పట్టుక్కూచుంది. ఒక్కసారయినా మాట్లాడ లేదు. దానిచేత మాట్లాడించేటప్పటికి, ఇంద్రుణ్ణి, చంద్రుణ్ణి దింపి తీసుకువచ్చినంత పనయింది!—అప్పుడయినా ఆ సహం, సహం వాక్యాలలో నా కర్థమయిం దేమిటంటే పుట్టేది మగ పిల్లాడే అవుతాడా లేదా అనే సందేహంతో సతమత మయి పోతోందిట !

ఈ సందేహాన్ని నేను మాత్రం ఎలా నివృత్తి చేయ గలను ?—మగపిల్లాడా, ఆడపిల్లా అని నిర్ధారణగా నాకు మాత్రం ఎలా తెలుస్తుంది ?— అయినా నాకా విషయంలో పెద్ద పట్టింపూ లేదు. ఏ శిశువయినా, నా చేతులు చాచే ఉన్నాయి. కాని, దానికి అట్లా అనిపించలేదు. ఎట్లాగూ మొయ్యడం తప్పదు. ఎట్లాగూ కష్టం తప్పదు. పైగా యిన్నేళ్ళ తరువాత గర్భం—యిదే మొదటిదీ, యిదే ఆఖ రుదీ అనుకోవాలిసిందే కూడాను ! ఎలా అయినా ఒక బిడ్డ చాలు ! కాని అది తప్పకుండా మగపిల్లాడే కావాలని దాని ఆరాటన.

"తీరా యింతా కష్టపడి చివరికి మగపిల్లాడు కాక పోతేనో ?—" ఇదో కొత్త విచారం పట్టుకుంది దానికి. నేనే మయినా పొరపాటున ఊరడించబోతే పెద్ద కోపం వచ్చేసేది. ఓరోజున అట్లాగే కోపం తెచ్చుకొని నాముందరనుంచి లేచి వెళ్లిపోతూంటే—

"ఛీ కాబోయే కన్నతల్లీ !
కాస్త నీళ్లాడేవరకూ ఆగు !"—అన్నాను.

ఆరోజంతా ఎంత గొడవ పెట్టిందని !

"మీదేం పోయింది. వేళాకోళంగానే ఉంటుంది మీకు. నా వ్యధ నాకు తెలుసు. తండ్రి అవటం సులభమే. కాని, తల్లి ప్రాణం—"

"అవునే, నన్నేం చెయ్యమంటావో చెప్పు పోనీ. ముందు ఉన్న కష్టం అంతా నీదే, ఒప్పుకుంటాను. నేను నీ స్వభావానికి ఏ ధన్వంతరి దగ్గిర మందు తేగలనే ?"

"మీ యిష్టం వచ్చినట్లు మాట్లాడండి ! అసలు ఆ భగవంతుడే నామీద పగ తీర్చుకొంటున్నాడు. నా కడుపున ఒక ప్రాణం అయితే పడేశాడు గాని—దాన్ని భరించే బలమూ, ధైర్య మూ నా దగ్గిరనుంచి ఎత్తుకుపోయాడు ! ఏదో ఒకటి మనకి యిచ్చినట్లే యిచ్చి, యింకోటేదో ఎత్తుకుపోతూంటాడు ఆ దయామయుడు !"

దాన్ని పూర్తిగా తొమ్మిది మాసాలన్నర కష్టపెట్టాకరా, నాయనా! నువ్వీ ప్రపంచములో పాదం పెట్టడానికి నిశ్చయించు కున్నది! "ఏదో చాలాసేపు నిద్రపోయినవాడిలా ఆదరా బాదరా మేలుకొని "యిప్పటికే చాలా ఆలస్యం చేసినట్టున్నాం. ఇహ యీ మకాం మార్చెయ్యాలి" అని అనుకొన్నట్టున్నావు. యింకే ముంది ? ఒకటే కంగారు మాకు.

దానికో రెండు పెద్ద నొప్పులు వచ్చాయి. బండి తీసుకురమ్మంది. మేం టాక్సీలో బయలుదేరినప్పుడు ఉదయం 9 గంట లయింది. అది మాంచి వేసవికాలం. ఆసుపత్రి గుమ్మంలో ఉన్న బాడితచెట్లు విరగపూసి కాంపౌండులోనూ, బయటా కూడా పూలరేకులు చల్లివుంచాయి మా దోవలో. గాలి స్తంభించిపోయి, మహా ఉక్కగా ఉంది. నొప్పులు సహిం చేందుకు పెదిమలు కొరుక్కుంటూ మీ అమ్మా—దానికేసే చూస్తూ నేనూ, యిద్దరమూ చిందర వందరగా చెమటలతో ఆ ఆసుపత్రి గుమ్మంలో దిగాము. నేను నెమ్మదిగా జబ్బ పట్టు కొని నడిపించాను. నడిచింది. ఒక చిన్న అరుగు చూపించి కూర్చోమన్నాను. కూచుంది. ఆ సమయంలో పరిపూర్ణంగా పరాధీన అయిపోయింది. మరు క్షణంలో యిద్దరు, ముగ్గురు మంత్రసానులు వచ్చారు. వాళ్లందర్నీ ఒక్కసారి కలియ చూసింది. వాళ్ళు అనుభవం గలవాళ్లే. సామర్థ్యం గలవాళ్లే. కాని అంతకంటే ఏదో ఒక లక్షణము వాళ్ల ముఖాల్లో కని పిస్తే బాగుండునని దానికి తోచింది. కాని వాళ్లల్లో ఆ ఆదరం కనిపించలేదు. దానికి నొప్పులు ఎక్కువయ్యాయి. ఈ నొప్పికంటే యిందాకటి నొప్పి ఎంతో నయం అనిపిం చింది. దానికి ఆ సమయంలో దయా, సానుభూతీ కావా లనిపించింది. ధైర్యం కావాలనిపించింది.

ఒక నర్సు తన మానులాటి చేతులు దాని భుజాలు కింద వేసి లేవదీసింది. దానికి ఆ చేతులు ఉత్త క్రరచేత లేమో అనిపించాయి. వాళ్ల సహాయంతో లోపలికి వెళుతూ నాకేసి చూసింది. "మీరిలా బయటే ఉండిపోతారా ? నన్ను వాళ్ల చేతుల్లో పారేశారా,—నాకు భయంగా ఉంది" అని అంటున్నట్లున్నాయి ఆ చూపులు. ఎందుకలా చేసిందో మరి! యిటూ అటూ ఊగే ఆ సగం తలుపుల్లోంచి తను వెళుతూ వెళుతూ రెండు చేతులూ ఎత్తి నాకో నమస్కారం చేసింది. ఏమనుకుందో మరి !—మౌనంగా తనను నడిపించి తీసికెళు తూన్న ఆ నర్సుల చేతుల్లో పడగానే—నేనూ మౌనంగానే ఉన్నా, నా హృదయంలో ఉన్న ప్రేమా, సానుభూతీ దానికి గోచ రించాయి కాబోలు—ఉండవచ్చు. ఆ నిమిషంలో నేను తన చెంతనే ఉంటే బాగుండునని అనుకొన్నది—కాని సభ్యత ననుసరించి నేను బయటే ఉండిపోవాలసి వచ్చింది. నేనలా చూస్తూ చూస్తూ ఉండగానే అది నా కన్నుమరుగై పోయింది. నేను ముఖం యిటు త్రిప్పుకుని జేబులోంచి రుమాలు తీసుకున్నాను.

నా జీవితంలో అది నాకు సుఖమూ, దుఃఖమూ రెండూ కలిగించింది. నన్ను దుఃఖపెట్టడం తెలియక చేసింది,—సుఖ పెట్టడం మాత్రం బుద్ధిపూర్వకంగా చేసింది. ఏది ఏమయినా అది నేను ప్రేమించిన భార్య. అంచేత దాని నొప్పులూ దాని వ్యధా నా హృదయంలో ప్రతిధ్వనిస్తున్నాయి. నా చిట్టిబాబూ, నిన్ను కనడానికి అది ఏడు పరదాల వెనక్కి వెళ్లిపోయింది,— నే నా అరుబయటే కూర్చుని ఉండిపోయాను.

అట్లాగే ఎలాగో రెండు గంటలు గడిచిపోయాయి— కాని నీ ఏడుపు నా చెవిని పడలేదు. నా కళ్లూ, చెవులూ అటు వేపే ఉన్నాయి. ఆ సగం తలుపుల్లోంచి నర్సులు యిటూ అటూ తిరగడం నా కనిపిస్తూనే ఉంది. కనిపెట్టుక్కూచుని కూచుని విసుగొచ్చింది నాకు. అంతట్లో ఒక నర్సు బయ టికి వచ్చింది. ఆవిడకి నా ముఖంమీది ప్రశ్నార్థకం కనిపిం చింది కాబోలు, ఆవిడ ఏదో ఒక యంత్రం మాట్లాడినట్లు "యింకా చాలా ఆలస్యం ఉంది. మీ రిక్కడే ఉండాలిసిన అవస రంలేదు" అన్నది.

గత్యంతరంలేక యింటిముఖం పట్టాను— తలుపు తీశాను—యింట్లో పడివున్న ఉత్తరం విప్పి ఏదో అర్థం చేసుకుంటున్నట్లే అక్షర మక్షరం చదివాను. ఆ ఉత్తరం ఎవరు రాశారో ఏమని రాశారో నాకు తెలియనే లేదు. యింట్లో ఉన్న ప్రతి వస్తువూ నన్ను ప్రశ్నలు వేస్తున్నట్టే వుంది—"మా అమ్మగారి పరిస్థితి కుశలమేనా" అని—నాకు

మాత్రం ఏం తెలుసూ, వాటితో చెప్పడానికి. సాయంకాలం నాలుగు గంటలవరకూ అలాగే దేనిమీదా ధ్యాస లేకుండా గడిపాను.

అప్పటికి ఒక ఆస్పత్రి నౌకరు నన్ను పిలవడానికి వచ్చాడు. "మిమ్మల్ని పిల్చుకు రమ్మన్నారు" అనడం కంటె యింకేమీ చెప్పలేదు—అంచేత నా మనస్థితి అయోమయంగా అయిపోయింది. తీరా ఆస్పత్రి గుమ్మంలో కాలు పెట్టేటప్పటికి వాతావరణం అంతా ఏదో గంభీరంగా కనిపించింది. నా గుండె కొట్టుకోవడం నాకే వినిపించడం మొదలుపెట్టింది. పొద్దున్న అక్కడ లేని మనిషి ఒకాయన కనిపించాడు. ఆయన డాక్టరు గారు కాబోలు. తెల్లటి గౌను వేసుకున్నాడు. శుభ్రంగా సబ్బుతో కడుగుకున్న చేతులు తువ్వాలుతో తుడుచుకుంటూ బయటికి వచ్చాడు. అక్కడే ఉన్న మంత్రసాని నే నెవర్నో ఆయనకి చెప్పింది. తక్షణమే ఆయన నావేపు తన దృష్టి తిప్పాడు. నేనూ ఆయనవేపు చూశాను, తల ఎత్తి—ఆయనకి బట్టతల ఉందనీ, కళ్ళు పిల్లికళ్ళనీ మాత్రమే గోచరించింది నాకు. ఇంతట్లో ఆయన స్వరం వినిపించింది. "నీ భార్య పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది—శిశువు అడ్డం తిరిగింది—" నేను ఏమి వింటున్నానో, ఏమి చూస్తున్నానో అర్థం కావడం లేదు. అధాత్తుగా చెవిటివాణ్ణయిపోయాను. డాక్టరు గారు ఆయన స్వరం కొంచెం పెంచారు. అప్పుడు నా కొద్దిగా స్పృహ కలిగింది.

"ఆపరేషన్ చెయ్యవలసి వస్తోంది. కాని ఆ అమ్మాయికి రక్తం చాలా తక్కువగా ఉంది. అదో చిక్కు. తల్లీ, పిల్లా యిద్దరూ కులాసాగా బయటపడకపోవచ్చు. అటువంటప్పుడు ఏం చెయ్యాలో నువ్వే చెప్పాలి. పిల్లని బ్రతికించమంటావా ? తల్లినా ?"

నాకు ఒళ్ళు చల్లబడిపోయింది. ఎంత పెద్ద గొడ్డలి ఆకాశంమీంచి నా నెత్తిన పడింది! డాక్టరుగారు కూడా నా అవస్థ కనిపెట్టారు కాబోలు. ఎంచేతంటే ఆ తరువాత చాలా అనునయంగా మాట్లాడారు.

"నీ బాధ నాకు తెలుసు. కాని ఈ విషయాలు నీకు స్పష్టంగా చెప్పటం నా కర్తవ్యం. నేను యిద్దరినీ బ్రతికించటానికే శాయశక్తులా ప్రయత్నిస్తాను. కాని నా శక్తికి మించిన కష్టం ఏర్పడి, యిద్దరూ దక్కకుండా పోయే పరిస్థితి వస్తే, నేనేం చెయ్యాలి అప్పుడు ? ఎవర్ని బ్రతికించాలి. తల్లినా ? పిల్లనా ?"

"తల్లినా, పిల్లనా" ?!—"తల్లినా, పిల్లనా"!!!—ఎంత భయంకరమయిన సమస్య ! నాకు యిద్దరూ కావాలి. భార్య సంసారానికి ఆధారం. శిశువు వంశానికి ఆధారం ! నేను ఎవరి ప్రాణాన్ని ఉదాసీనంగా చూడగలను. అంతకంటె నా ప్రాణాలు విడిచేస్తే మాత్రం ఏం ? కాని దానివల్ల ఏం ఉపయోగం ? ఒకదాంట్లో ఒకటి దూరిపోయి ఉన్నవి, మీ యిద్దరి ప్రాణాలూనా—పీటముడి వేసుకొని పోయినవి మీ యిద్దరి ప్రాణాలూను. ఇప్పుడీ ప్రశ్నకి నేనేం జవాబు చెప్పగలను ? నాకా డాక్టరుమీద కోపం కూడా వచ్చింది. "నన్నెందుకు అడుగుతావు ? నీ కేది మంచిదని తోస్తే అది చెయ్యి. నీ యిష్టం వచ్చినవాళ్ళని బ్రతికించు. నీ యిష్టం వచ్చినవాళ్ళని చంపెయ్." అని మనసులోనే కేకలేశాను. కాని ఈ పాపం ఆయన నెత్తిన ఎందుకు వేసుకుంటాడు ? ఇంతట్లో ఆయన నన్నే గదమాయించాడు. "తొందరగా చెప్పు. ప్రతి నిమిషమూ ఎంతో విలువైన దీ సమయంలో—"

నేను జవాబు చెప్పితీరాలి !—అదయినా తక్షణమే! ఆలోచించుకున్నే వ్యవధి లేదు. "ఇద్దరినీ బ్రతికించు. నా కిద్దరూ కావాలి" అని మనసు మౌనంగా కేకలేసి చెబ్తోంది ఆయనతో—కాని ఆమాట నిరుపయోగం. నేను మాట్లాడ్డానికి ప్రయత్నం చేశాను. సాధ్యపడలేదు. కాని చివరికి ఎలాగో సాధించినట్లున్నాను. నా దేహంలో ఏ మూలనో మూర్ఛవచ్చి పడిపోయినమాటలను లేవగొట్టి బయటికి ఈడ్చాను. అతి కష్టంమీద నా నోటివెంట రెండే రెండు మాటలు బయలు పడ్డాయి. "పిల్లాణ్ణి బ్రతికించండి".

మరుక్షణంలో డాక్టరు లోపలికి వెళ్ళిపోయాడు. నేనా అరుగుమీద దేహం పడేశాను. గట్టిగా గొంతెత్తి ఏడుద్దామనిపించింది. కాని సాధ్యపడలేదు. కళ్ళల్లో తడి కూడా కమ్మలేదు. ఒంట్లో ఉన్న జలలన్నీ ఒక్కసారిగా ఎండిపోయినాయి. మనిషిగా ఉంటుండేవాణ్ణి, ఒక దూలాన్ని అయిపోయాను. ఇంతట్లో లోపలనుంచి ఒక హృదయభేదకమయిన అరుపు వినిపించింది. నాకు మళ్ళా స్పృహ వచ్చింది. చెవులు మొగ్గించి వింటున్నాను. నాయనా, నువ్వు దాన్ని చంపడానికిట్రా బయలు దేరావు. నే నక్కడే కూచుని ఊహించుకుంటూ పోతున్నాను.

ఈ పాటికి డాక్టరుగారు తన శస్త్రకాండ ఆరంభించి ఉంటారు. ఆ గదిలో తళతళా మెరుస్తూన్న రకరకాల ఆయుధాల్ని తయారుగా ఉంచి ఉంటారు. దాన్ని తీసుకువచ్చి ఆ బల్లమీద పడుకోబెట్టి ఉంటారు. మంత్రసాని సహాయం చెయ్యడానికి సిద్ధంగా డాక్టరు దగ్గరే నిలబడి ఉంటుంది. క్లోరోఫారం వాసన వ్యాపిస్తూండి వుంటుంది. ఆ మత్తుమందు గుడ్డ మడత దాని ముక్కుమీద వేసిఉంటారు. ఒకటి, రెండూ .... మూడు .... అయిదు .... పదమూడు .... ఊం ఽఽఽఽ ఉఁ ఽఽఽ ఇప్పుడే యిక ఉచ్ఛ్వాస నిశ్వాసాల శబ్దం మాత్రమే !—చావు బ్రతుకు పొలిమేరల మధ్య ఉండే శాంతత. దురూహ్యమయిన నిశ్శబ్దం. అది యిప్పుడు ఏ లోకానికి చెందనిది. శస్త్రధారి అయిన డాక్టరు చేతిక్రింద పడివున్న సగం చావని జీవం. ఈ క్షణంలో దాని అస్థిత్వం అంతమాత్రమే !

నేను బయట ఆ అరుగుమీదే కూర్చుని ఉండిపోయాను. ఎండ తగ్గిపోయింది. సూర్యుడు అస్తమించే వేళ అయింది. ఆ మీదట భయానకమయిన చీకటి వ్యాపిస్తోంది. జగత్తుమీదా, నామీదా కూడాను. దురదృష్టమనే పిశాచం నా చుట్టూ తిరుగుతోంది. అదే నన్నప్పుడు ఆవహించి "పిల్లాణ్ణే బ్రతికిం

చండి'' అని మాట్లాడింది. దాంతో నా సంసారానికి నేనే గొడ్డలిపెట్టు పెట్టుకొన్నానన్నమాట. ఇహ ఏ నిమిషంలో నయినా, ఎవరో వచ్చి ఆ కాస్తా నా చెవిని వెయ్యటమూ, నేను నెత్తిన చేతులు పెట్టుకుని కూలబడిపోవటమూ మట్టుకే జరుగవలసి ఉన్నవి. ఇది ఊహించుకుని, గుండె రాయి చేసుకుంటూ,—రాయిలాగ కూర్చున్నాను. ఇంతట్లో యువతలికి నడిచివస్తున్న డాక్టరుగారి పాదాలు కనిపించాయి. అవి భూమ్మీద అడుగులు వెయ్యటానికి బదులు నా గుండెలమీదనే వేస్తున్నవి. చివరికి బయటికి వచ్చారాయన. నేనాయన ముఖంకేసి చూశాను. ఆ ముఖభావం యింకా బిత్తరపోయినట్లే ఉంది. చెమట అంతా తుడిచేసి శుభ్రంగా ఉంది. ఆయన పల్చటి పెదిమలమీద ఒక మందహాసపురేఖ తొంగిచూస్తోంది. ఆయన నాతో ''అభినందనలు'' అన్నాడు.

''అభినందనమా ?—ఎందుకు ?—పెళ్ళాన్ని పోగొట్టుకున్నందుకా ? పిల్లాడు పుట్టాడు గనుకనా ?''

నేను పిచ్చివాడిలాగ ఆయనవేపే చూస్తూ ఉండిపోయాను.

''తల్లీ పిల్లా క్షేమంగా ఉన్నారు. నీకు మగపిల్లవాడు పుట్టాడు''.

డాక్టరుగారికి కృతజ్ఞత చెప్పుకోడానికి కూడా చైతన్యం లేకపోయింది నాకు. నేను మౌనంగా కూలబడ్డాను. చిన్న పిల్లవాడిలాగా ఏడుస్తున్నాను. నా ఆనందంలో నేను తేలిపోలేదు. నా ఆనందం నన్ను ఒక బరువుగా అణిచివేసింది. నలిపివేసింది. కాని నా అవస్థ ఎటువంటిదో అక్కడ ఎవరి కర్థమవుతుంది.? అలా నేను ఎంతసేపు కూర్చున్నానో మరి ? మంత్రసాని వచ్చి ''ఓసారి చూడ్డానికి వస్తారా ?'' అని అడిగింది. అప్పు డర్థమయింది నాకు నా భార్యని చూడ్డానికి నన్ను పిలుస్తున్నారని.

నేనావిడ వెనకనే శబ్దం చెయ్యకుండా అడుగులువేసుకుంటూ నడిచివెళ్లాను. నీ తల్లి ఒక మంచంమీద పడుకుని ఉంది. నిశ్చేష్టురాలై పడివుంది;ఏదో ఊక కుక్కిన గుడ్డ బొమ్మలాగ—మూర్తీభవించిన కరుణరసం యొక్క ముచ్చి బొమ్మలాగ; వళ్లంతటిమీదా ఒక దుప్పటి కప్పివుంది. ముఖం మాత్రం బయటికి కనిపిస్తోంది. ఆ ముఖంమీద సుఖమూ, దుఃఖమూ, సంతోషమూ, విషాదమూ, ఏమీ కనిపించలేదు. కాని అమితప్రయాసపడి ఓర్చిన బాధయొక్క నీడ మాత్రం వున్నదాముఖంమీద యింకా. రెప్ప ఎత్తి నన్ను చూడ్డానికి కూడా శక్తిలేదు ఆ కళ్లల్లో.

నా కన్నతండ్రీ—దగ్గరలోనే వేళ్లాడుతున్న ఉయ్యాలలో పడుకున్నావు నువ్వు. నువ్వు భూమ్మీద పడే ముందర తల్లి ప్రాణాన్ని ఒక్క కడకి తెచ్చావు—దాని పేగులు పెగల్చి వేశావు—శేర్లకొద్దీ రక్తమూ, చెమటా, కన్నీళ్లూ ప్రవహింపచేసి, దాన్ని కదలడానికి కూడా శక్తిలేనిదాన్నిగా చేసివేశావు. నువ్వింత ప్రమాదవు పని చేసినట్లు నీకు తెలుసురా ? కాని, నేనా గదిలో ప్రవేశించగానే నీ దగ్గరికి రాలేదురా—మొట్టమొదట నేను తిన్నగా వెళ్లింది దాని దగ్గరికి.—పదిహేనేళ్లు నాతో సుఖదుఃఖాలు పంచుకున్న నా సహధర్మచారిణి దగ్గరికి ! దాన్ని ఒకసారి దుప్పటిమీదే చేతులతో తడిమి చూసుకున్నాను. అది బ్రతికే ఉందని నిర్ధారణ చేసుకున్నాను. అది తన గుండ్రటి, నల్లటి కళ్లమీది రెప్పలు అతి ప్రయత్నం మీద సగం వరకూ తెరచి నాకేసి చూసినప్పుడు,

''ఇప్పుడు బాధేమీ లేకుండా బాగున్నావుగా ?'' అని అడిగాను నెమ్మదిగా.

''ఊఁ'' అంది.

కాని ఆ ''ఊఁ'' లో ఏమీ జీవంలేదు.

''మనకో మగ పిల్లాడు పుట్టాడు.''

మళ్లీ ఒక ''ఊఁ'' అంతే ! ఒక్క మాట మాట్లాడలేదు. మాట్లాడడానికి కూడా ఓపికలేనంత అలిసిపోయింది. దాని మొఖమూ, చెంపలూ నా చేత్తో ఒకసారి నిమిరి—రేగి ముందుకు వచ్చి చెమటకి అంటుకుపోయిన ముంగురులు వెనక్కి దిద్దాను. ఆ తరువాత నీ ఉయ్యాల దగ్గరికి వచ్చాను. ఎర్రటి రంగుతో అతి లేతవయిన అవయవాలతో కనిపించీ కనిపించని జుట్టుతో జీవితాన్ని గురించీ,—అప్పటి పరిస్థితులను గురించీ, నిండు అజ్ఞానంతో, హాయిగా నిద్రపోతున్నావు! కొంచెం సేపు నిన్ను కూడా నా చేతుల్తో తడిమి, సంతానవంతుణ్ణయానని నాకు నేనే ఋజువు చేసుకుని, యిహ అక్కడి నుంచి కదిలాను.

ఇంటికి వచ్చి యింట్లో ఉన్న ప్రతి వస్తువుతోటీ చెప్పాను—''మీ యజమానురాలు కులాసాగా ఉంది'' అని—ఇంకో సంగతి కూడా చెప్పాను ప్రతి వస్తువుకీ—''ఇకమీదట మీరంతా కాస్త జాగ్రత్తగా ఉండండి. మిమ్మల్ని అందర్నీ తలక్రిందులు చెయ్యడానికి ఒక అసాధ్యుడు వస్తాడులెండి పదిరోజుల్లో'' అని.

ఇక ప్రతిరోజూ ప్రొద్దున్నా, సాయంకాలం ఆసుపత్రికి వెళ్లటమూ రావటమే నాపని;—ప్రతిరోజూ ''నిన్నటి కంటె యివాళ నయంగా ఉంది'' అని చెబుతూ ఉండేవారు.

ఆ తరువాత మమకారం నన్ను నీవేపుకు లాగివేసింది. గంటలాది కూర్చుని కళ్లప్పగించి నిన్నే చూస్తుండేవాణ్ణి. నా మనస్సు ఇప్పటికి కాస్త కుదుటబడి నువ్వు పుట్టావుగదా అని సంతోషపడడానికి ఉత్సాహపడుతోంది. మీ అమ్మ యింకా ప్రక్కమీంచి లేచేదికాదు. లేవాలనుకున్నా లేవనిచ్చేవారు కాదు కూడాను. స్తన్యానికి నిన్ను దాని దగ్గరకి విడిచేవారు కాదు. దాని మాతృహృదయానికి ఇదొక బాధ ఉంటూండేది. నా చేతుల్లో ఉన్న నిన్ను, తన దగ్గిరగా పెట్టించుకునేది. నీకు యితరత్రా యివ్వడానికి వీలులేని పోషణలో కొంతభాగ

మైనా, నిన్ను తన చేతుల్తో తడిమినందువల్ల అందచేసి నట్లు తృప్తిపడేది.

ఓరోజున నేను నిన్ను చూపించి ఏమన్నానో తెలుసా? మన అబ్బాయిని చూడు!—వీడికి చీకూ చింతా ఏమీ లేదు గదా!— పొట్ట నిండితే చాలు. నిద్రపోతే చాలు. మిగతా అప్పుడు చప్పట్లు కొడుతూ బ్రహ్మానందంగా ఉండగలడు. మనుషులందర్నూ కూడా ఎక్కువకాలం యిలా పసిపాపలుగానే ఉండగలిగితే బాగుణ్ను—అప్పుడు చిల్లర విషయాల్ని మన సులో పెట్టుకుని బాధపడవలసిన అవసరం ఉండదు."

ఈ ముక్కలని దానికేసి చూశాను. అది కూడా అర్థం చేసుకుంది. మా యిద్దరి పెదిమల మీదా చిరునవ్వు మొలి చింది. ఎంతో ఆనంద మయింది. నేను నీ ముఖం ముందు ఒక చిటిక వేశాను. నీ చిన్ని గడ్డం మునివేళ్లతో పట్టు కున్నాను. ఇంకో నాలుగు రోజుల్లో మిమ్మల్ని యింటికి తీసుకెళ్లవచ్చుట. నే నిప్పటినుంచీ అందుకోసం సరంజామా ప్రారంభించాను.

ఆ శనివారం పనిలోంచి పెందరాళే వచ్చేశాను. వస్తూ వస్తూ పెద్దబజారులో పళ్లు కొన్నాను. యింటికి వచ్చి బట్టలు మార్చుకున్నాను. యింక రెండు గంటలసేపు మీ యిద్దరి దగ్గరా ఆనందంగా కూచోవచ్చుగదా అని ఆసు పత్రికి వచ్చాను.

నేను ఆ గదిలోకి వెళ్లేటప్పటికి, ఒక నర్సు దాని టెంపరేచరు పరీక్షిస్తోంది. నా క్కనిపించకుండా ఉండేలాగ థర్మామీటరు చాటుగా పట్టుకుని ఒకసారి చూసి వెంటనే విదిలించేసింది. నేను కొంచెం భయపడి ఆవిణ్నే అడిగాను.

"ఇదేమిటి మళ్లీ"

"కొద్దిగా జ్వరం వచ్చింది ?

"కొద్దిగా అంటే, ఎంత ఏమిటి ?"

"అది నీ కెందుకు. డాక్టరుగారు వచ్చి చూసు కుంటారులే !"

"నిజమే అనుకోండి. కాని జ్వరం ఎంచేత వచ్చింది."

"రాత్రి సరిగా నిద్రపోలేదు. నిన్న పథ్యం కూడా ఇమడలేదు."

ఈ నాలుగు ముక్కలూ చెప్పి ఆ నర్సు నా ఎదటి నుంచి వెళిపోయింది. నేను దాని మంచంమీద కూర్చున్నాను. దువ్వటిలోంచే దాని పొట్టమీద చెయివేసి చూశాను. నిప్పు లాగా కాలిపోతోంది ఒళ్లంతా.

"ఏమయిందే" అని అడిగాను.

కాని అదేం మాట్లాడలేదు. ముఖంమీద అమితమయిన బాధ కనిపిస్తోంది. అంచేత తలనొప్పి బాగా ఎక్కువగావే ఉందేమో అని అనుకున్నాను.

"తలనొప్పిగా ఉందా."

"ఊఁ !"

"ఎప్పటినుంచి ?"

జవాబులేదు.

ఈ పది రోజుల్లోనూ దానిచేత మాట్లాడించే ఉపాయం ఏమిటో నేను కనిపెట్టేశాను;—అంచేత

"అబ్బాయి ఎంతసేపణ్నించి నిద్రపోతున్నాడు" అని అడిగాను.

"ఎవరికి తెలుసు ?"

"అదేమిటి అలా మాట్లాడుతున్నావు."

"ఇంకెలా మాట్లాడేది నేను. ఆ పిల్లాడు మీకు కొడుకు. వాడికి మీరు తండ్రి. ఒకరి కొకరు ఎంతో సొంతం — అంచేత వాణ్నే అడగండి."

"అయితే తల్లివయిన నువ్వు సొంతంకాదుటే వాడికి?"

"నేనా ? నేను వాణ్ని కనేందుకు మట్టుకే! యిప్పుడు మీ వంశం నిలబడింది. ఇక నా అవసరం తీరిపోయింది."

"ఎవరు చెప్పారు నీతో యిలా అని .... ఊఁ ?— ఎవరు చెప్పారే ?"

"ఎవరో చెప్పేదేమిటి దీనికి ?—యిది అనాదినుంచీ స్థిరపడిన సంగతి—ఆడవాళ్ల అవసరం అంతవరకే,—భర్త వంశం నిలబెట్టడంకోసం ఒక వారసుణ్ని భూమ్మీద పడేసి— ముప్పుతిప్పలూ పడి పెంచి ఆడది అణగారిపోవడం సర్వ సామాన్యమైన సంగతి. ఆడదాని విలువ అంతవరకే."

"నువ్వెందుకు యిలా మాట్లాడుతున్నా వివ్వాళ ?"

"ఇలా మాట్లాడుతున్నది నేను కాదు. మీరే యిలా మాట్లాడారు. ఈ పదిరోజు లయినా బ్రతికాను గనుక, ఈ సంగతి నేను తెలుసుకోగలిగాను. నేనా ఆపరేషన్ గది లోనే చచ్చిపోతే, నా విలువ ఎంతమాత్రమో నాకు తెలియ కుండానే పోయేది. ఇన్ని రోజులనుంచీ మీరు నన్ను చూడ్డా నికి వస్తూనే ఉన్నారు. కాని ఈ సంగతి ఎత్తనేలేదు మీరు. అసలు నాతో చెప్పాలని అనిపించనేలేదు మీకు! నన్ను దగా చేస్తూనే వచ్చారు. అట్లా దగా చేయడం పాపమేమో నని

కూడా మీకు సంశయం కలుగలేదు. నిన్న నేదో మాటల ధోరణిలో, పాపం! ఆ నర్సు చెప్పబట్టి, మీ సంసారంలో నా కెంత మాత్రం స్థానం ఉందో అర్థమయింది నాకు.''

''ఏమిటి అర్థమయింది నీకు ?''

''ఇంకేమి అర్థమవుతుంది ? మీరేమన్నారో అదే ! డాక్టరుగారు మిమ్మల్ని ''తల్లా ? పిల్లా?'' అని అడిగారట ! పిల్లని బ్రతికించండి అని అన్నారుట, జ్ఞాపకం ఉందా ?''

ఈమాట లంటున్నప్పుడు దాని శ్వాస తీవ్రమయింది. అసలే రక్తంలేని ఆ పెదవులు ఎండిపోయాయి. లోపల ఉన్న బాధవల్ల ముఖం అంతా కాల్చిన అప్పడంలాగా అయిపోయింది. అది, ఆ మాటలన్నీ మాట్లాడుతూనే ఉంది. కాని నా మొఖం కేసి చూడలేదు—ఎదురుగా గోడమీద ఉన్న కాలెండరుకేసి చూస్తూ మాట్లాడుతోంది. నేను ఎంతో ఆవేదనతో ''నే నొక్కమాట చెప్తాను వింటావా'' అని అడిగాను. ''ఏమి వినాలి'' అంది ఆ గోడవేపే చూస్తూ—దాని స్వరం నిరాశతో నిండి, బలహీనంగా ఉంది. గడ్డం వేళ్లతో పుచ్చుకుని దాని మొఖం నావేపు త్రిప్పుకున్నాను—దాని కళ్లల్లోకి చూస్తూ ''అవును నేనామాట అన్నమాట నిజమే. పెళ్లామా, పిల్లాడా ? అన్న ప్రశ్నకి 'పిల్లవాడు' అని జవాబు చెప్పినమాట నిజమే. ఆ రెండు క్షణాలలో, ఏమాత్రం ఆలోచించటానికి వీలుంటుందో అంతా ఆలోచించి తెలిసి చేసిన పనే జవాబు చెప్పటం.''

''అయితే అయివుండవచ్చు. కాని దాని అర్థం నాకెలా తెలుస్తుంది ?''

''నీకు తెలియకపోతే నన్నడిగి తెలుసుకో ! ఏవేమిటో అపార్థాలు చేసుకోకు. నాకు నీమీద కొద్దో గొప్పో ప్రేమ ఉంది గనుకనే ఆ జవాబు నానోట వచ్చింది. కొడుకుని కనాలని నువ్వు ఎంత పరితపించిపోయావో నేను గమనించి జ్ఞాపకం ఉంచుకున్నాను. ఆ తొమ్మిది నెలలూ పొట్టలో ఆ భారం మోస్తూ ఎంత కష్టపడ్డావో నాకు కళ్లకట్టినట్టు ఉంది. ఎంత చిన్న విషయమయినా నువ్వు లోలోపలే జ్ఞాపకం పెట్టుకుని, ఆ జన్మాంతం స్మరిస్తూంటావని కూడా నాకు తెలుసు,—నువ్వు తెలివివచ్చి చూసేటప్పటికి, — మెడని కోసినట్టు చిన్న చిన్న ముక్కలుగాకోసి, కాళ్లు చేతులూ వేటికవి విడివిడిగా బొక్కెనలో, పారేసివున్న నీ కొడుకు నీక్క కనిపిస్తే—''

''అయ్యో ! అయ్యో ! అటువంటి అశుభాలు అనకండి''

''నే నటువంటి మాటలు అనేవాణ్ణి ఎన్నటికీ కాను. కాని, నువ్వే నాచేత అనిపిస్తున్నావు ! ఆ భయంకరమయిన వికట దృశ్యం నువ్వు చూడగలిగేదానివా ?—అసలు అది చూసీ చూడగానే ప్రాణం కూడా వదిలేసేదానివేమో ? ఒకవేళ బ్రతికివుండగలిగినా,—ఆ జీవితము నీకు నరకయాతన కంటే బాధగా ఉండేది. ఆ దృశ్యము ప్రతిరోజూ, ప్రతి క్షణమూ నీ అంతరాత్మలో సుడిగుండాలు తిరుగుతుండేది. నీకు నీమీద విసుగు పుట్టేది. నామీదా విసుగు పుట్టేది. ప్రపంచకం అంతటిమీదా అసహ్యం పుట్టేది. ప్రతి శుభకార్యంమీదా కోపం వచ్చేది. నువ్వీ భూమ్మీద ఏదో దోవతప్పిన భూతం సంచరించినట్లు సంచరించేదానివి. ఆ పరిస్థితుల్లో ఎవరైనా వైకుంఠం తీసికొచ్చి నీచేత పెట్టినా, అదేదో హాలాహలంగా అవతలికి విసిరేసేదానివి. నీతో దాపరికం లేకుండా చెబుతున్నాను. కోపం తెచ్చుకోకు. నువ్వు చనిపోయినప్పటికీ కూడా పుత్రవతి వనిపించుకొని చచ్చిపోవాలనే నా వాంఛ.''

ఆ తరువాత నే చెప్పేదంతా చెవు లప్పగించి శ్రద్ధగా వినడం మొదలుపెట్టింది. నా స్వరంలోనూ, నా మాటల్లోనూ నేనెంత త్రికరణశుద్ధిగా మాట్లాడుతున్నానో—ఆ ఆవేదన అర్థమయినట్లుంది దానికి. దాని పెదవులు ఎర్రబడటం ఆరంభించాయి. జ్వరం ఒక అరడిగ్రీ ఎక్కువయిందేమో కూడాను. నేను మాట్లాడ్డం యింకా సాగిస్తూనే ఉన్నాను.

''నువ్వు చచ్చిపోతే నీకు విముక్తి గలిగేదేగాని, నాకు నిజంగా మరణావస్థ సంభవించేది. నేను నా చేతో్తోటే నాయిల్లు నాశనం చేసుకున్నానన్నమాట. అయినా అందుకు కూడా నేను సిద్ధపడ్డాను. కాని, నేను నా మనసులో ఏమని ఆలోచించుకున్నానో తెలుసా ?—''

''నేను ఒంటరివాణ్ణయిపోయినా, మన పిల్లవాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేస్తాను. వాడి ముఖంలో నిన్ను చూసి తృప్తి పడతాను. నువ్వూ, నేనూ యిద్దరమూ శాశ్వతంగా కలిసిపోయి మన పిల్లాడులా, ఒక్క దేహంతో అవతరించామని, మన స్సును సమాధానపరచుకుని శాంతిగా బ్రతుకగలుగుతాను.

''అంతకంటే యింకేముంది అసలు, నిజంగా చూస్తే నీకు 35 నిండాయి.—నాకు 40 ఏళ్లు దాటాయి. మన దాంపత్యంలో పొద్దు వాటారింది. మన సంసార రథం తిరుగు మొఖం పట్టింది. నువ్విదివరలో అన్నట్టుగా ''వంశవృద్ధికి ఒక వారసుణ్ణి సృష్టించడం, వాణ్ణి పోషించి పెద్దవాణ్ణి చేయడం కోసం జీవితం ధారపోసి ఏదో ఒకరోజున కళ్లు మూసి అంతరించిపోవడమూ, — అంతేగా తల్లిదండ్రుల ధర్మం.—ఒక అర్థంలో నీమాట నిజమే.—నిన్నూ, నన్నూ కన్నతల్లిదండ్రులు కూడా అలాగే మనల్ని పెంచి పెద్దవాళ్లని

చేసి, యిప్పుడు కనుమరుగై పోయారు!—మనమీద కూడా ఆ జవాబుదారీ లేదూమరి ?—ముందరితరంవాళ్లను చంపి, మనం జీవించటానికి మనకేం హక్కు ఉంది ? జగత్తులో ఈ జీవ పరంపర ఇట్లాగే ప్రవహిస్తూ వచ్చింది. యిట్లా ఉండడమే న్యాయం కూడాను!—అంచేతనే ఆ రోజున నీ ఆయుర్దాయాన్ని గురించి కూడా నేను లెక్కచేయడానికి వీలులేకపోయింది—అటువంటి అవసరమే వస్తే మన సంతతియొక్క క్షేమం కోసం నా ప్రాణాలు బలిపెట్టడానికి కూడా ఏమాత్రం జంకను .... అర్థమయిందా నీకు .... నచ్చిందా యిప్పుడయినా?—నువ్విలా మౌనంగావుండి నా అంతం చూడకు. నీ అభిప్రాయం ఏమిటో స్పష్టంగా చెప్పు నాకు. నేను స్వార్థపరుణ్ణీ, దగా కోరునీ, దయలేనివాణ్ణీ—అని నీకు మనసులో తోస్తే, ఆ సంగతి ఖచ్చితంగా నోరు విప్పి చెప్పేశేయ్ !''

ఇలా మాట్లాడుతూ ఉండగా, నాకు గొంతు దుఃఖంతో నిండిపోయింది. యిక మాట్లాడలేక పోయాను!—మరుక్షణంలో దాని కళ్లల్లోంచి గంగాప్రవాహం ఆరంభమయింది. దాని అవస్థ అతి జాలికరమయి పోయింది. నా దండని తన కుడి చేత్తో గట్టిగా పట్టుకుంది. దాని గొంతుకలో ఏవేవిటో ఆలోచనలు గుటగుట లాడాయి.

''మీరు చెప్పినదంతా వాస్తవమే — ముమ్మాటికి వాస్తవమే—కాని,—కాని—మీరామాట నిలా అనగలిగారండీ ?''

నా జబ్బమీదనున్న చేయితీసి ఫెడేలున తన నుదుటికేసి కొట్టుకుంది. నా కర్మం యిట్లా కాలితే నేను మాత్రం ఏం చెయ్యగలను ? ఇంతట్లో ఆ నర్సు వచ్చింది అక్కడికి—అక్కడ కనుపించిన దృశ్యం చూసి నన్ను కాస్త కఠినంగానే చివాట్లు పెట్టింది. ''ఏమిటి మీరు చేసేవని ? రోగి మనస్సు కష్ట పెట్టకూడదనే విషయం కూడా మీకు యింకొకళ్ళు చెప్పాలా ?—ఇప్పుడయినా మీరు యిక్కడినుంచి కదలటం మంచిది.''

చెంపదెబ్బ తిన్నవాడిలాగా నేను అక్కడినుంచి లేచి, సరాసరి యింటికి వచ్చేశాను. నాన్నా ! నీ కింతకంటె ఏం చెప్పగలనురా ?—చిట్టచివరివరకూ నా అంతఃకరణ ఎటువంటిదో దాని కర్థమవలేదురా ! యింతగా చెప్పినప్పటికీ నా ప్రవర్తనలో న్యాయాన్యాయాలు దానికి గోచరించలేదు. అది ఒక్కటే ఒక్క విషయం మనస్సులో పెట్టుక్కూచుంది—''ఆయనకి నా జీవితం అంటే అంత అక్కరలేకుండా పోయింది !'' జ్వరంలో కూడా యిదే పలవరిస్తూ ఉండిపోయింది. అట్లా మనస్సులో పెట్టుకుని, తన దుఃఖాన్ని తనే వృద్ధిచేసు కుంటూ పోయింది. తలుచుకుని తలుచుకుని చివరివరకూ బాధపడుతూనే ఉంది. ఆఖరికి జ్వరం తగ్గింది. కాని యిప్పుడు ప్రాణం పోయాక—

నేను వీధి పొడుగునా లడ్డూలు పంచిపెడుతూ మిమ్మిద్దరినీ యింటికి తీసుకురావా లనుకున్నాను. కాని మీ అమ్మ నా మనోరథం పూర్తిచేసుకోనివ్వలేదు. దాన్ని నేనే మరో చోటికి దోవచూపించి తీసుకువెళ్ళాలిసి వచ్చింది. అదంతా అయిపోయిన తరువాత నిన్ను ఓ దుప్పటిలో చుట్టబెట్టి నీ నెత్తిని నా కన్నీళ్ళ అభిషేకం చేస్తూ, యింటికి తెచ్చుకోవలసి వచ్చిందిరా నాన్నా—అట్లా తెచ్చుకోవలసి వచ్చింది !—

సాహిత్య సదస్సు

# ఉత్తమసాహిత్యం ఎప్పుడు వచ్చింది?

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

"తెలుగులో స్వాతంత్ర్యానికిపూర్వం ఉత్తమ సాహిత్యం వచ్చిందా? తర్వాత వచ్చిందా?" అన్న ప్రశ్నను కొంచెం విడ మర్చి "స్వాతంత్ర్య సంపాదనోద్యమకాలంలోనా? స్వాతంత్ర్యము సంపాదించిన తర్వాతనా? తెలుగువారు ఉత్తమ సాహిత్యాన్ని ఎప్పుడు నిర్మించారు?" అని గానీ, "స్వాతంత్ర్యము తెలుగు వారి సాహిత్యసృష్టిని ఉదాత్తము చేసిందా? లేదా?" అనిగానీ తర్జుమా చేసుకుని జవాబు చెప్పుకోవచ్చును.

మొదటిప్రశ్నకు జవాబు చెప్పుకుందాం ముందు. స్వాతంత్ర్యానికిముందు 1910 వ సంవత్సరమునుంచీ తెలుగు సాహిత్యంలో నవజీవనము వచ్చింది. కావ్యమూ, కథానికా, సంభాషణలూ కొత్తపద్ధతిని నడిచాయి. కావ్యాల్లో భావావేశానికీ, కథానికలలో పతాకదశకూ, సంభాషణలలో బిగుతుకూ ప్రాముఖ్యము ఇచ్చారు రచయితలు. 1925 వ సంవత్సరమునాటికి కవులు తమ అనుభవాలనూ, కథానికా రచయితలు లోకవృత్తాలనూ, ఏకాంకికా రచయితలు పురాణ, ఇతిహాస, చరిత్రములలోని వింత సన్నివేశాలనూ, వస్తువుగా స్వీకరించి రచనలు చేశారు. విశ్వ సాహిత్యంలోనికి సులువుగా ప్రవేశించగల యెంకిపాటలూ, కృష్ణ శాస్త్రీవేదుల ల ఖండ కావ్యాలూ, శివశంకరుల కథాఖండకావ్యాలూ అనేక కవుల గేయాలూ వచ్చాయి. దీక్షితులు చెంచు దంపతులూ, మాడపాటివారి హృదయశల్యమూ, మునిమాణిక్యం కాంతం కథలూ, మొక్కపాటి బారిష్టరు పార్వతీశమూ, చలంగారి 'సత్యం శివం సుందరం', సుబ్రహ్మణ్యశాస్త్రి 'కచ్చితమైన జవాబూ'వంటి కథలూ వచ్చాయి. రాజమన్నారు దయ్యాలలంక, విశ్వనాథకవిరాజు వినోద నాటికలూ, సోమయాజుల వెంకట రామమూర్తి రచనలూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వాకోవాక్యాలూ వచ్చాయి. ఈకాలంవరకూ దేశ స్వాతంత్ర్య సంపాదనోద్యమం తీవ్రంగా నడిచి, ఇక్కడ కొంత ఆగింది. ఈ విరామకాలంలో నవ్యత్వానికి తీవ్రమైన ప్రతిఘటన వచ్చింది. ఖండకావ్యాలు కొంత విశ్రాంతిలో పడ్డాయి. తీవ్ర భావ సౌందర్యాన్నే వస్తువుగా గ్రహించిన నవ కావ్యాలకు భిన్నంగా లలిత భావాలూ, వాచాసౌందర్యమూ కలిపి మెరపించిన జాషువాకవి ఖండకావ్యాలు వచ్చాయి. విశ్వనాథవారు—తెన్నేటిసూరి వ్రాసినట్లుగా—కలాన్ని బాకులాగ పట్టుకుని పద్యాలు చెక్కేరు. ఈకాలంలో శ్రీశ్రీ తన కవిత్వంలో శబ్ద వైచిత్రిని పట్టి గేయ రచన సాగించగా పాప, బుచ్చిబాబు, మల్లవరపు, గోరా, గణపతి శాస్త్రిగార్లు వచనగీతాలు—లయగంధి వచనాలు రచించి ఛందోబందోబస్తులన్నీ చటఫటమని తెంచారు. జంధ్యాల, రామకృష్ణమాచార్య, మాధవపెద్ది కవులు వృత్తాలలో పాతకథలనే నడిపేరు.

స్వాతంత్ర్యము వచ్చింది. మేధావులు ఆంగ్లేయులు—తెగేదాకా తాడులాగకుండా—చల్లగా వెళ్ళిపోయారు. "మా దేశాన్ని వదలిపొండి" అన్న రాజకీయోద్యమము కవులలో వేరు తన్ని కలత పుట్టించలేదు. ప్రజల ఉత్సాహానికి జండా పట్టిన కృష్ణశాస్త్రివంటికవులు మెదలకుండా ఊరుకున్నారు. భావ సౌందర్యాన్నికాక, శబ్దవైచిత్రినీ పోహళింపు సౌందర్యాన్నీ పట్టి విచిత్రంగా అల్లుకుపోయిన శ్రీశ్రీ రచనలు సినిమాల్లోదూరి బూర్జువా మేడల కిటికీల్లోంచి వినపడ్డాయి. వైచిత్రిని ఎంత వెంటబెట్టినా, భావ సూత్రాన్ని అంత జాగ్రత్తతోనూ, పేనడమే ప్రవృత్తిగా గలిగిన ఆరుద్ర రచనలు—కళ్ళెములు తగిలించిన ఉత్సాహంలాగా, రాత్రివేళ రక్షకభటుల యీలల్లాగా జాగరితము చేస్తూనే వచ్చాయి.

తెలంగాణా స్వాతంత్ర్యోద్యమము దాశరధి కావ్యాల్లో శక్తివంతంగా గుండెకు సూటిగా తగిలింది. గజల్ రచనల ఆకుంచనమూ, ఆలోచనావేశపు మద్దెల ముక్తాయింపులూ కాళోజీ గొడవలు వచ్చాయి. నవ్యతాశబ్దశక్తి భావ మాధురీ సంగమించిన అందపు గేయాలు నారాయణరెడ్డివి విన్నాము. స్వాతంత్ర్యము తర్వాత దాశరధి రచనల పదును పోయింది. అన్నివైపులా దీనమానవుణ్ణి ముట్టడించే చీకట్లనుచూచి జీర్ణమంగే సుభాషితం' అని కాళోజీవారు వూరుకున్నారు. నారాయణ రెడ్డిగారు పూలబాటల నన్వేషిస్తున్నారు. స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత కవులనుంచి ఉత్తమ సాహిత్యము వచ్చినదనుకోనునేను.

కథలూ, నవలలూ చాలా వచ్చాయి. స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత, మునుపు అంతమందీ చదువరుల నుదిక్కులను చేస్తూండిన రచనలు ఇప్పుడు శరీరమందంతటా చైతన్యాన్ని పెంచుకుంటున్నాయి. నోరివారి చారిత్రిక నవలలూ, బుచ్చిబాబు చివరకు మిగిలేది, పాప, గాలివాన చాలా వచ్చాయి అందపు రచనలు. అయితే ఈ చైతన్యము సహజ వికాసంలోనే వచ్చింది కాని, స్వాతంత్ర్యమువల్ల నేమీ కాదనుకుంటాము.

స్వాతంత్ర్యము సాహిత్యాన్ని ఉదాత్తము చేసిందా? అన్న రెండో ప్రశ్నకు జవాబు చెప్తాను. ఇక స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత ప్రభుత్వమువారి సాయాన్న తెలుగు భాషాసమితీ, సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితీ, సాహిత్య అకాడమీవంటి సంస్థ లేర్పడి అన్ని విధాలా బరువైన గ్రంథాలు వచ్చాయి. విశ్వవిద్యాలయాలలో పరిశోధనచేసే వర్ధమానుల తీవ్ర కృషి ఫలితంగానూ, సురవరమువారు, నిడదవోలువారువంటివారి కృషి ఫలితంగానూ చక్కని పుస్తకాలు వచ్చాయి. ఉత్తమ సాహిత్యం ఇక రావలసి ఉన్నది. చైతన్యమయమైన రచనలు సజీవ రచయిత లున్నట్లు

సూచన మాత్రమే. ఆ రచనలు సాహిత్యాన్నిగాని, జాతినిగాని ఎత్తుకు తీసుకుపోలేవు. అయితే ఏరకపు రచనలు రావాలి అని అడిగితే చిన్న సూచన. మళ్లీ మళ్లీ చదివించే రచనలు, ఎప్పుడు చదివినా గిలిగింతపెట్టే రచనలు రావాలి. ఇవి యత్నించి వ్రాస్తేనే గాని రావు. "నా ఊళ కేదారగౌళ" అనీ, "అసలు నేను రాసేటట్టు రాసేవాడు. వెయ్యేళ్లకు ఒక్కడు మించి పుట్టడనీ," చంకలు కొట్టుకునేతత్త్వముతోకాదు రచయితలు పూనుకోవలసినది. ఉత్తమ సాహిత్యము అనేసిందల్లా అచ్చుకొట్టిస్తే ఏర్పడదు. స్వాతంత్ర్యోద్యమము కొంత తాపీగా సాగిన రాయలసీమలో కవులు మొన్నటివరకూ తమ శక్తిని ప్రదర్శించే కావ్యాలే రచించినా ఉత్తమ సాహిత్య సృష్టికి కొంత కొంత కృషి అక్కడ జరిగిందనిపిస్తుంది నాకు. గడియారమువారి శివభారతమూ, నారాయణాచార్యుల మేఘసందేశమూ చక్కని రచనలు. వ్యుత్పత్తి బరువునుకాక, ప్రతిభా చైతన్యాన్ని చూపించే రచనలు ఆ వైపు నుంచీ, చైతన్యపు వేగమేకాక, సౌందర్యపు లోతుగల రచనలు ఈవైపునుంచీ, పార్శీలా ఇజాలా డొక్కలు చీరి బయటపెట్టే సర్వోదయ అసిధారావ్రతానుష్ఠానము అన్నివేపులనించీ రావాలని ఆశీవాదులమైన అస్మదాదుల కోరిక.

# స్వాతంత్ర్యానంతర సాహిత్యం

శ్రీ పి. గణపతిశాస్త్రి

గత భారతిలో ప్రారంభమయిన 'ఉత్తమ సాహిత్యం ఎప్పుడు వచ్చింది? స్వాతంత్ర్యానికిముందా? తరవాతా?' అన్న ఈ చర్చలో పాల్గొనడానికిమునుపు దీనికిగల అవధులేవో విస్పష్టంగా నిర్ణయించుకోవడం చాలా అవసరం. ఈ చర్చ ఒక్క ఆంధ్ర సాహిత్యానికేగాక, భారతీయ ప్రపంచ సాహిత్యాలవరకు విస్తృతమైనట్టు 'సాహిత్య విద్యార్థి'గారి నిశిత విమర్శవల్ల స్పష్టపడుతున్నది. ఇక స్వాతంత్ర్యానంతర సాహిత్యాన్ని, దాని పూర్వ సాహిత్యంతో సరిపోలుస్తున్నప్పుడు అపూర్వసాహిత్యం అంటే ఎప్పటిది? అన్న ప్రశ్నకు కూడా సరిఅయిన సమాధానం చెప్పుకోవాలి. సంపాదకుల పీఠిక పరిశీలిస్తే ఇది స్పష్టపడడం లేదుగాని, స్వాతంత్ర్యానికి పూర్వం అవతరించిన అధునాతన సాహిత్యమే ఆ పూర్వ సాహిత్యం అయి ఉండవచ్చునని నేను నిర్ణయించుకొంటున్నాను. లేకపోతే నన్నయ్యతో ప్రారంభించిన పూర్వ సాహిత్యంతో నేటి సాహిత్యానికి పోటీ పెట్టడం చాలా అన్యాయ్యమే అవుతుంది! స్వాతంత్ర్యానికిపూర్వం అవతరించిన అధునాతన సాహిత్యం అంటే ఇంచుమించుగా ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంనించి విస్తరించిన సారస్వతమే అని ఒక పరిధి నిశ్చయించుకొంటున్నాను. అంటే వీరేశలింగ యుగం కూడా ఈ పరిధిలో ప్రవేశించడం లేదన్నమాట.

## ప్రపంచ సాహిత్యము

ఇక ప్రపంచ భారతీయ సారస్వతాల సంగతి. మొత్తంమీద ప్రపంచ భారతీయ సారస్వతాలన్నిటిమీద ఏదో పెద్ద భయంకర ప్రళయమే విరుచుకుపడినట్టు సాహిత్య విద్యార్థి ప్రకటించారు. దానికి వా రెవరెవరో విమర్శకుల మాటలు పరమ ప్రమాణాలన్నట్టు ప్రస్తావించారు! మనకు ఆంగ్లానువాదాలవల్లనే ప్రపంచ సారస్వతాలతో రవంత పరిచయం ఏర్పడుతున్నది. అటు ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, నార్వే, స్వీడన్ మొదలయిన పాశ్చాత్య దేశాలలోగాని, ఇటు రష్యా, చైనా, జపాన్, బర్మా మొదలయిన ప్రాచ్య దేశాలలోగాని ఈనాడు ఎటువంటి సారస్వతం వెలువడుతున్నదో నిజంగా మనకు తెలియదు. ఫ్రాన్స్, ఇటలీ మొదలయిన దేశాలలో కొంతకాలం పాటు బాగా ప్రసిద్ధులయిన రచయితల గ్రంథాలు, మరికొంత కాలం గడిచిన తరువాతే ఆంగ్లభాషలో అవతరిస్తున్నాయి. ఆంగ్లంలో అనువాదాలు వెలువడిన మరికొన్ని సంవత్సరాలయినా గడిచిన తరవాతగాని మన కాయా ప్రపంచ రచయితల పేరు లయినా తెలియడంలేదు !

ఇక విమర్శకుల సంగతి. పూర్వ సారస్వత విమర్శన పరిశీలిస్తే మహామహులయిన రచయిత లనేకులు సమకాలీనుల దుర్విమర్శలకు గురిఅయిన విషయం సర్వత్ర స్పష్టపడుతున్నది. ఒక్కొక్కప్పుడు సమకాలీన విమర్శకులుతోటే రచయితలను కొందరిని ఆకాశాని కెత్తివెయ్యడం కూడా జరుగుతూ ఉంటుంది. కాని, మరి కొంతకాలం గడిచిన తరవాత అటువంటి వారందరు కాలగర్భంలోపడి అదృశ్యులవుతారు. ఆ విమర్శకులు కూడా వారి మార్గమే అనుసరిస్తారు! జాన్ స్ట్రాచీవంటి విమర్శకు డెవడో యుద్ధానంతర ప్రపంచ సాహిత్యం అంతా అమాంతంగా ఒక్కసారిగా శ్మశానప్రాయంగా మారిపోయినదని అంటే ఆ మాట మనం వేదవాక్యంలా స్వీకరించనక్కరలేదు. సామాన్యంగా పాశ్చాత్య విమర్శకులందరు ప్రపంచం అంటే పాశ్చాత్య దేశాలే అన్నట్టు వ్యవహరిస్తారు. ఇండొనేషియా, జపాన్, చైనా భారతదేశాల ప్రాచీనాధునాతల సాహిత్యాలతో వీరికున్న పరిచయం చాలా తక్కువ. ఒకవేళ ఎవరికయినా ఆ యా సాహిత్యాలతో కొంత సన్నిహిత పరిచయాలేర్పడినా, చిత్ర విచిత్రము లయిన సాహిత్య దృక్పథాలేవో వారి అవగాహనల కంతరాయాలు కలిగిస్తూ ఉంటాయి.

దీనికొక చిన్న ఉదాహరణ: ఆ మధ్యన ఎన్‌కౌంటర్ పత్రికలో ఆర్థర్ కోస్లర్ మన యోగాభ్యాసాలమీద కొన్ని నిశితమయిన విమర్శన వ్యాసాలు ప్రచురించాడు. ఆ వ్యాసాలలో మొత్తంమీద మన యోగసిద్ధులన్నీ వట్టి బూటకాలన్నట్టు టప్పున కొట్టిపారేశాడు! వాటి కెవరయినా సరిఅయిన సమాధానాలు వ్రాశారో లేదో తెలియదు.

ఇలాగే 'ది లోటస్ అండ్ ది రోబట్' అన్న గ్రంథంలో జపానీయ బౌద్ధ వేదాంతాన్ని గురించి తీవ్రంగా అవహేళన చేశాడు. దానిమీద ప్రసిద్ధ బౌద్ధతత్త్వవేత్త డాక్టర్ సుజికీ ఎన్‌కౌంటర్‌లో ఒక చక్కని ప్రతి విమర్శ ప్రచురించాడు. అది చదివిన తరవాత ఆర్థర్ కోస్లర్ అజ్ఞత ఎంత మహత్తరమయినదో మనకందరికీ విస్పష్టంగా వెల్లడి అవుతుంది. ఆర్థర్ కోస్లర్ ప్రపంచ ప్రఖ్యాత రచయిత. కాని హైందవ జపానీయ వేదాంతాలమీద యోగాభ్యాసాలమీద అయన రచనలు పరిశీలించినవారికి ఆ రచయిత దృక్పథంలోగల లోపాలలోతు లిట్టే బాగా స్పష్టపడతాయి. వాఙ్మయ విమర్శనలో కూడా ఇలాంటి విడ్డూరా లెన్నెన్నో బయలుదేరుతూంటాయి. అంత మాత్రంచేత యుద్ధానంతర ప్రపంచ సాహిత్యంఅంతా నీరస పడిపోయినదని మనం నిరుత్సాహపడ నక్కరలేదు.

## భారతీయ సాహిత్యము

ఇక భారతీయ సారస్వతాలమాట: ఇంచుమించుగా పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంతోనే భారతీయ సాహిత్యా లన్నిటిలోను ఒక నూతనోత్తేజం ప్రారంభమయింది. అప్పటినించి ఇటు దాక్షిణాత్య భాషలలోను, అటు-ఔత్తరాహ భాషలోను ఎన్నదగిన సారస్వతమూర్తులు ఎంతోమంది ఉద్భవించారు. కాని, వీరి రచనలను గురించిన పరిచయం మన కంతంత మాత్రంగా గానే ఉన్నది. ఎంతెంతటి సుప్రసిద్ధుల గ్రంథాలకయినా ఆ యా భాషాప్రాంతాలలోనే కొద్దిగానో, గొప్పగానో పేరు ప్రఖ్యాతి ఏర్పడుతున్నవి. ఎంతోకాలం గడిచిన తరవాతగాని వీరి గ్రంథాలకితర భారతీయ భాషలలో అనువాదాలు వెలువడే అవకాశాలు కనిపించడంలేదు. హిందీ, వంగ భాషల అనువాదాలు కొన్ని మిగిలిన భారతీయ భాషలలో వెలువడుతున్నాయి. కాని ఇంతకాలం గడిచినా రవీంద్రునివంటి మహా రచయిత గ్రంథాలన్నీ తెలుగులో వెలువడలేదు. ఇటీవల భారతీయ సాహిత్య అకాడమీ రవీంద్రుని అపరిచిత గ్రంథాలుకొన్ని ఆంధ్రంలోని కనువదింపజేస్తున్నది. ఇలాగే మిగిలిన భారతీయ సాహిత్యాలకు ఒండొంటితో కొంత పరిచయం కలిగించాలని ప్రయత్నిస్తున్నది. అయితే స్వాతంత్ర్యంవచ్చిన తరవాత ఆ యా భారతీయ భాషలన్నిటిలోను వెలువడుతున్న ఉత్తమ సారస్వతం కూలంకషంగా పరిశీలించిన వారెంత మంది ఉన్నారు? 'సాహిత్య విద్యార్థి'గారికి రెండు మూడు భారతీయ భాషలతో కొంత సన్నిహిత పరిచయం ఏర్పడిఉండవచ్చును. అంతేగాని, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మన 14 భాషలలోను వెలువడిన ఉత్తమ సారస్వతంఅంతా అయనకూలంకషంగా పరిశీలించారా? మరి పరిశీలించకుండానే మూక ఉమ్మడిగా స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మన సారస్వతాలన్నీ బాగా చప్పబడిపోయాయనడం న్యాయ్యమేనా ?

## అధునాత నాంధ్ర సాహిత్యము

వాస్తవానికి ఈ చర్చ కొంతవరకు మన ఆంధ్ర సారస్వత పరిధిలోనే సాగించుకోగలము. అంతేగాని, ప్రపంచ సారస్వతాలను గురించిగాని, మిగిలిన భారతీయ సాహిత్యాలను గురించిగాని చర్చించడం చాలా హాస్యాస్పదంగా పరిణమించగలదని సాహిత్య విద్యార్థిగారికి సువినయంగా మనవి చేసుకుంటున్నాను.

తెలిసినంతవరకు తెలుగు సారస్వతాన్ని గురించి మాత్రమే కొంతవరకు సవిస్తరంగా చర్చించుకుందాము. వీరేశలింగ యుగ ప్రారంభంవరకు మన సారస్వతంలో కవిత్వమే ప్రముఖమయిన స్థానం ఆక్రమించుకొన్నది. ఇందుచేత అధునాతన సారస్వతంలో కవనానికి కొంత ప్రత్యేక-గౌరవం ఏర్పడడం సహజమే. అంత మాత్రంచేత కవిత మాత్రమే సాహిత్యం కాజాలదు. నవల, రూపకము, కథానిక, వ్యాసము కవిత్వంతో సరిసమానంగా గౌరవించదగిన సారస్వతశాఖలని ప్రత్యేకంగా పేర్కొనవలసిన ఆవశ్యకతలేదు.

మన స్వాతంత్ర్యాని కింకా 15 ఏళ్ళయినా నిండలేదు. అయినా ఈ స్వల్పకాలం సారస్వతంతో ఇంచుమించుగా 45 సంవత్సరాలవరకు కొనసాగిన ఇతఃపూర్వకాల సారస్వతాన్ని సరి పోలుస్తున్నామన్నమాట మరిచిపోకూడదు. ఇంకొక్క ముఖ్య విషయం కూడా మనం గుర్తుంచుకోవాలి. స్వాతంత్ర్యానికి పూర్వం సుప్రసిద్ధులయిన రచయిత లింకా తమ సారస్వత వ్యాసంగాలు కొనసాగిస్తూనే ఉన్నారు. అంతేగాని స్వాతంత్ర్యం సిద్ధించగానే అకస్మాత్తుగా వారందరు మౌనవ్రతం స్వీకరించలేదు ! శ్రీ విశ్వనాథ, కృష్ణశాస్త్రి, కాటూరి, నాయని, సీతారామమూర్తిచౌదరి మొదలయిన ప్రముఖులింకా పత్రికల ముఖతః తమ ఉత్తమ కవిత ప్రజల కందిస్తూనే ఉన్నారు. ఆమధ్యన భారతిలో శ్రీ సీతారామమూర్తిచౌదరి, శ్రీ కాటూరి రచించిన ఖండకావ్యాలు కొన్ని చదివినప్పుడు ఇవి మన అధునాతన సాహితికి అపూర్వాలంకారాలని అనిపించింది. శ్రీ దాశరథి ఇటీవల ప్రచురించిన 'గాలిబ్ గీతాలు' ఎన్నదగిన మనోజ్ఞ కవితా సంపుటి. ఆమధ్యన శ్రీ ఆరుద్ర ప్రచురించిన 'సినీవాలి' అభ్యుదయ ధోరణిలో చాలా ప్రముఖమయిన రచన. స్థూలదృష్టితో చదివినప్పుడది ఏదో ఘోషలాగా వినిపిస్తుంది. కాని కొంచం జాగ్రత్తగా పరిశీలిస్తే మన ఆధునిక జీవితంమీద అది ఒక నిశితమయిన అవహేళనమని సహృదయులందరు అంగీకరిస్తారు. కాని 'సాహిత్య విద్యార్థి' ఆ కావ్యం ఎందుకు పనికిరానిదన్నట్టు తీసిపారేశారు. పైగా ఆరుద్రని, 'ఆరుద్ర పురుగ'ని అధిక్షేపించారు. ఇలాంటి వ్యక్తిదూషణ న్యాయ్యంకాదు. మహాప్రస్థానం తరువాత 'సినీవాలి'వంటి మంచి అభ్యుదయ కావ్యం రాలేదన్నా అతిశయోక్తికాదు. అయినా 'సాహిత్య విద్యార్థి' ఎందుకలాగ వ్రాశారో తెలియదు.

## నవల - కథానిక

నిజానికి స్వాతంత్ర్యానికి పూర్వంకన్న ఇప్పుడే ఎక్కువగా మంచి మంచి కథలు వస్తున్నాయి. ఇటీవల భారతిలో శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'ఆకలి' చదివినప్పుడు అంతటి గొప్పకథ ఈమధ్యన ఎప్పుడు రాలేదని అనిపించింది. ఇంచుమించుగా ఒక ఏడాదిక్రితం ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 'వాన వచ్చిననాడు' అన్న ఒక కథ పడింది. అదీ ఆకలితో సరిపోల్చదగినదే ! పత్రికలలో పడుతున్న కథలన్నీ నేను చదవడంలేదు. మిత్రు లెవరైనా 'ఫలానాకథ చాలా బాగుంది'

అంటేనే అది చదువుతున్నాను. నేను చదవకుండా విడిచివేసినవి ఇంకా ఎన్నెన్ని మంచికథలున్నాయో తెలియదు! స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మన కథానికలో వైవిధ్యము, గాంభీర్యము బాగా పెరిగాయిగాని తగ్గిపోలేదు. కాని ఇలాంటి మణిపూసలలాంటి కథలు చాలా తక్కువే. అయినా, కథానికలను గురించి మనం నిరుత్సాహపడడానికి కెక్కడ ఆస్కారం కనబడడం లేదు. శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన'కు ప్రపంచ సాహిత్య గౌరవం లభించినది స్వాతంత్ర్యం వచ్చిన తరువాతే!

నేటి నవలల రచనలో కూడా చాలా విశాలమయిన వైవిధ్యం కనిపిస్తున్నది. వివిధ దృక్కోణాలతో నేటి రచయితలు మన సాంఘిక సమస్యలు యథాతథంగా చిత్రించడానికి ప్రయత్నిస్తున్నారు. తొందరపడి వీరందరు చేస్తున్న దేమీలేదని దిగులుపడిపోనక్కరలేదు. సమకాలీన విమర్శన ప్రారంభించేటప్పుడు నిదానం చాలా అవసరం. ఒక్కొక్కప్పుడు ఆ యా వ్యక్తులమీద మన కేర్పడిన రాగద్వేషాలు, ఏవేవో చిత్ర విచిత్రమయిన అభిప్రాయాలు వారి రచనలమీదికి తిరుగుతూంటాయి. దీనికొక చిన్న ఉదాహరణ: ఎమిలీబ్రాంటి వుదరింగ్ హైట్స్ ప్రచురించడానికి ఆకాలంలో ఆంగ్ల ప్రచురణకర్త లెవ్వరు అంగీకరించలేదు. ప్రయత్నించగా ప్రయత్నించగా ఒక ప్రచురణకర్త ఖర్చులు భరిస్తే ప్రకటించడానికంగీకరించాడు. సుప్రసిద్ధ నవలా రచయిత సోమర్‌సెట్‌మామ్ ఆ నవల ప్రపంచంలో ఎన్నుకోదగిన పది నవలలో చేర్చాడు! అంత గొప్ప నవలకు అచ్చుపడే అవకాశంకూడా ఎందుకు లభించలేదు? ఇంకా ఇలాంటివి ఎన్నయినా ఉదాహరణ లీయవచ్చును. కనక సమకాలీన విమర్శలో సర్వజ్ఞులమని అనుకోవడం కేవలం దుస్సాహసమే అవుతుంది.

## రూ ప కా లు

వీరేశలింగయుగంలో జన్మించిన వీరేశలింగంరంతులు, వడ్డాది సుబ్బరాయకవి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, ధర్మవరం కృష్ణమాచార్యులు, తిరుపతి వెంకటకవులు, గురుజాడ అప్పారావు మొదలయిన ప్రముఖ రూపక రచయితలు వేలకొలది ప్రేక్షకుల నుర్రూత లూగించగల గొప్ప గొప్ప రూపకాలెన్నో రచించారు. ఆ తరవాత మళ్లీ అంతమంది అసంఖ్యాక ప్రేక్షకుల మన్ననలందుకొన్న గొప్ప నాటకాలేవి రాలేదు. తరవాత తరవాత రూపకాలు రచించిన ప్రముఖులు లేకపోలేదు. కాని, వీరి కెవరికి అటువంటి బహుళ ప్రజాదరణ లభించలేదు. నాటికి, నేటికి మన నాటకరంగం స్థితి ఇంచుమించుగా అలాగే ఉంది. ఇటీవల మళ్లీ నాటకాలకు కొంత ప్రజాదరణ లభిస్తున్నది. కాని ఇవి చాలావరకు ఔత్సాహిక రచయితల రచనలే. వీటిలో ఎన్నుకోదగిన చిన్న చిన్న రూపకాలు కొన్ని ఉన్నవి. ఇందుచేత ఈ విషయంలో స్వాతంత్ర్యానంతర సాహిత్యం వెనకటితరంకన్న ముందంజ వేసినదనీ చెప్పలేము. దిగజారిపోయినదనీ చెప్పలేము. వెనకటి తరంలోలాగే కొంత స్తబ్ధంగా ఉన్నదని మాత్రమే చెప్పవచ్చును.

## సాహిత్య ప్రోత్సాహం

అయితే ఒకమాట. స్వాతంత్ర్యంవచ్చిన తరవాత మన సాహిత్యానికి చాలా మంచి ప్రోత్సాహం లభిస్తున్నది. స్వాతంత్ర్యానంతరం పత్రికాపాఠకులసంఖ్య కొన్ని లక్షలవరకు పెరిగిపోయింది. కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు ఉత్తమ గ్రంథాల కెన్నెన్నో మంచి బహుమతు లిస్తున్నాయి. సాహిత్య అకాడమీల ఆధ్వర్యాన అత్యుత్తమ గ్రంథాలు కొన్ని వెలువడ్డాయి. వెలువడుతున్నాయి. తెలుగులో నన్నిచోడాది కవులమీద కూలంకషము లయిన చారిత్రాత్మక విమర్శక గ్రంథాలు వెలువడుతున్నాయి. ఉత్తమ నవలలకు, కథానికలకు, పత్రికలలో పెద్ద పెద్ద బహుమతులు లభిస్తున్నాయి. ప్రత్యేక ప్రచురణకర్తలు కూడా అప్పుడప్పుడు కొన్ని మంచి పుస్తకాలు ప్రచురిస్తున్నారు. అయితే సాహిత్య అకాడమీల వ్యవహారాలలో లోట్లేవి లేవని నేను అనడంలేదు. వీటివల్ల సారస్వతానికి ఆశించినంత ప్రోద్బలం లభించనిమాట కూడా యథార్థమే.

'సాహిత్య విద్యార్థి' గారితో కొన్ని విషయాలలో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. రాజకీయాలలోలాగ సారస్వత రంగంలోకూడా ముఠాతత్త్వం బాగా వ్యాపించింది. తెరమరుగునఉన్న కొన్ని కులతత్త్వాలు, తీవ్రములయిన రాజకీయ ధోరణులు ఈ ముఠాతత్త్వానికి బాగా చేయూత ఇస్తున్నాయి. సాహిత్య అకాడమీవంటి సంస్థలలోనే ఈ ముఠాతత్త్వం బాగా గూడుకట్టిన దనడానికి దాఖలా లెన్నయినా చూపించవచ్చును. 'సాహిత్య విద్యార్థి' పేర్కొన్నట్టు పెద్ద పెద్ద సారస్వత బిరుదాలమీద వల్లమాలిన వ్యామోహం పెరుగుతున్నది. దీనికి కారణం ఒక్కటే. మనకు సరిఅయిన సారస్వత విమర్శలేదు. సమర్థులు, సహృదయులు అయిన విమర్శకులను వేళ్లమీద లెక్కపెట్టవచ్చును. కాని, అటువంటివారు విమర్శక వ్యాసంగంలో ప్రవేశించరు. అంటీఅంటనట్టు మాట్లాడకూరుకుంటారు. ఇటువంటి నిష్పాక్షిక విమర్శనలు లేకపోవడంవల్లనే అల్పులు కూడా అత్యధికులమని అహంకరించడం జరుగుతున్నది.

అయితే ఇంతమాత్రంచేత అధునాతన సారస్వతం అంతా కేవలం శూన్యప్రాయమయిపోతున్నదని నిరుత్సాహపడనక్కరలేదు. శతాబ్దాల తరబడి రాజకీయదాస్యంలో భావదాస్యంలోపడి కుంగి కృశించిన మన జాతి ఇప్పుడిప్పుడే మేలుకొంటున్నది. దీని ఫలితాలు చవి చూడడానికి ఇంకా కొంతకాలం పట్టవచ్చును. మనది క్రమ క్రమంగా అన్ని విధాల పురోగమిస్తున్న జాతి. ఇందుచేత అనతికాలంలోనే అధునాతన రచయితల నందరిని విస్మరింపజేయగల మహా సాహిత్య శిల్పు లుదయించగలరని నా గట్టి నమ్మిక. దాని సూచన లీనాటి సాహిత్యంలోనే అక్కడ దక్కడ స్పష్టంగా గోచరిస్తున్నాయి.

అయినా సాహిత్య విద్యార్థి ఆవిధంగా దిగులుపడ్డారంటే నా కొక ఒక కారణం స్ఫురిస్తున్నది. ఇలాంటి చర్చలలో పాల్గొనేటప్పుడు తాము స్వీకరించిన చర్చాంశమే యథార్థమని నిరూపించడానికి కనేక విధాల ఆరాటపడి ఉండవచ్చును. 'అంతా గతంలోనే అయిపోయింది! వర్తమానంలోగాని, భవిష్యత్తులోగాని మరి ఆశా సూచనలే లేవు!'అన్న నీరస నైరాశ్య ధోరణి కూడా దీనికి బాగా ప్రోద్బలం కలిగించి ఉండవచ్చును!

# అజ్ఞాతవాసం

## శ్రీ సి. నారాయణరెడ్డి

అరణ్యవాసం అయిపోయింది.
అడవిలో వున్నప్పుడే నేను అయిదుగా
చీలివున్నాను.

అజ్ఞాత వాసం ఆరంభమైంది.
ఆ అయిదు రూపాలకూ కొత్త తొడుగు
లంటుకున్నాయి.

చూపుకు మాత్రమే అయిదురూపాలు వేరు.
వాటి నాళాల్లో పారే రక్తం తీరు
వాటి కడుపుల్లో కదలే మజ్జిగ నీరూ—
వొకటే
వాటి అంతరంగాల్ని కలిపి కుట్టే దారం
వొకటే
ఆధారం వొకటే.

అదే ఆశయం.
చిచ్చులాంటి ఆశయమది.
చిచ్చుకడుపును చీల్చుకుని వచ్చి
వియచ్చరుల్ని విభ్రాంతుల్ని చేసిన
ఆశయం.

పరమాత్మను పలికించిన ఆశయం.
పదిమాటలెందుకు-అది అచ్చంగా నిప్పు.
ప్రస్తుతం నివురుగప్పిన నిప్పు.

# అ జ్ఞా త వా స ం

ఆశయం సైరంధ్రిగా మారింది.
మాసిన తలతో నిల్చింది.
మసిపాతలో మాణిక్యంలా కనిపించింది.
మసిపాతలో మాణిక్యంలాంటి
ఆశయం

కీచక ప్రవృత్తి కంటికి
పసరాకుల్లో పంచవన్నెల చిలకలా
భాసించింది.

కీచక ప్రవృత్తికి నోరుతో పాటు
మనసూరింది — తనువూరింది.
మరుని రథం బయలుదేరింది.
కళ్ళకు పైర్లు కమ్మాయి.
కామానికి చరమస్థాయి.
కీచక ప్రవృత్తి సందిట్లో ఆశయం
గిజగిజ తన్నుకుంది.
సలసల మరిగే చమురు కురిసినట్లు
విలవిల లాడిపోయింది.
అయిదు రూపాలూ ఆ ప్రాంతాన్నే
వున్నాయి.
అంతా గమనిస్తూనే వున్నాయి.
మురికి చెరలో తోయబడ్డ గదరు పీరుల్లా.
చుర చుర చూస్తూవున్నాయి.
చురకత్తుల్ని నముల్తూ చండ్ర నిప్పుల్ని
మింగుతూ వున్నాయి.

వాటిలో ధర్మమూర్తి మొదట తమాయించింది.
తోటి రూపాలను చూపుల్తో మందలించింది.
అప్పుడు ధర్మమే అడ్డురాకపోతే
అకాల ప్రళయం తప్పేది కాదు.

అజ్ఞాతవాసం ముగిసేది కాదు.
ఆశయమెలాగో గండం తప్పించుకుంది.
అయిదురూపాల్లో వొకటి దాని జుత్తు
సమిరింది.

అనుకున్న ప్రకారంగా అర్ధరాత్రి కావచ్చింది.
ఆశయం వేసుకునే మేలిముసుగు వేసికొని
ముచ్చటగా ముడుచుక పడుకుంది
ధర్మాంగం.

కీచక ప్రవృత్తి దాన్ని స్పర్శించింది.
రేచులా ధర్మం విజృంభించింది.
రెంటికీ జరిగిన సడిలేని సమరంలో
కీచుమంది కీచక ప్రవృత్తి.
ఆశయానికి పీడా విరగడైంది.
ఆనందం అంచులు దాటి పొర్లింది.
అయిదు రూపాలకూ వొక్కుమాటుగా
అమృత స్నానం చేసినట్లయింది.
ఆశయాన్ని బట్టే కదా రూపానికి మనుగడ
తైలాన్ని బట్టేకదా దీపానికి నిలకడ.

# కావ్యాలంకారచూడామణి:
# కొన్ని అసమన్వితపద్యములు

శ్రీ సంపత్కుమార

తెలుగులోని ఛందోగ్రంథములలో ప్రచురితమైనవే చాలా తక్కువగా ఉన్నవి. వానిలో ప్రసిద్ధమైనవి ఏ నాల్గయిదో మాత్రమే. అవే కొంచెం మధికముగా పునర్ముద్రణ పొందుచున్నవి. అయినను, అవి సుష్ఠుపరిష్కృతములు కాకపోవుట వలన పలుతావులలో సందేహములను కలుగజేసి ఛందోజిజ్ఞాసువులను చికాకుపరచుచున్నవి. అట్టి గ్రంథములలో విన్నకోట పెద్దన రచించిన "కావ్యాలంకార చూడామణి" యొకటి. ఇందులోని సమన్వయముకాని, కొన్ని పద్యములను శ్రీ బండి నాగరాజుగారు భారతి (మేనెల—కలగూరగంప)లో ప్రస్తుతీకరించి, కొన్నిటిని సమన్వయపరచయత్నించినారు. వానినిగూర్చి నాకు తోచిన అభిప్రాయములను వెలువరచవలయునను ఉద్దేశ్యమే ఈ వ్యాసహేతువు.

యతిభంగము కనిపించుచున్న ఈ క్రింది పద్యమును శ్రీ నాగరాజుగారు చూపించినారు.

"ప్రపరాపసమను సుప్ర
త్యపి నిర్దురభిన్యుపాభ్యు దాఙ్వ్యత్యవ ప
ర్యుపసర్గ వింశతికి వళు
లు పరస్పర వర్ణయుక్తి నుభయము జెల్లున్"

(ఆశ్వా—7 ప. 47 వేదమువారి ముద్రణ)

ఈ పద్యములోని చతుర్థపాదములో—అచ్చుఅయిన దానినిబట్టి—శ్రీ నాగరాజుగారు చెప్పినట్లు యతిభంగము కనిపించుచున్నది. 'లు' అను హల్లుకు 'ఉ' అను అచ్చు యతి చెల్లదు. 'వళులు' అన్నప్పుడున్న బహువచన ప్రత్యయమున 'లు' లో 'ఉ' విరుగదు. అందువలన యతిభంగమయినది. 'పరస్పర వర్ణయుక్తిన్' అనునది కూడా సరిగా సమన్వయించుట లేదు. తమలో తాము వర్ణములు కలిసియుండుటచే నని అర్థము గదా ఆ సమస్తపదమునకు. అనగా సంయుక్తమగుటచే, లేక ద్విత్వమగుటచే అనుభావము కలుగును. అది ఇక్కడ అప్రస్తుతము. కాగా, ఉపసర్గలు పై అచ్చులతో కలిసి ఉన్నప్పుడు అచ్చునకుగాని, హల్లునకుగాని యతిచెల్లుననేభావము ఈ పద్యమువలన కలుగవలసియున్నది. అగుచో ఉన్న పద్యమున్నట్లుగా అభావము కలుగదు. అందువల్ల ఈ పాఠము సరిఅయినది కాదనిపించును. నాకు తోచిన విధముగా— అంటే,

". . . . . . వళు,
లుపరి స్వర వర్ణయుక్తి నుభయముఁ జెల్లున్"

అని ఉన్నట్లయితే యతిభంగము నివారితమగుటయేకాక, అర్థసమన్వయము కూడజరుగుచున్నది. వళులు + ఉపరి=వళులుపరి. అప్పుడు ఉభయములోని 'ఉ'కారము, 'ఉపరి'లోని 'ఉ'కారమునకు యతి చెల్లుచున్నది. ఇక ఉపరిస్వర వర్ణమనగా తరువాతనున్న అచ్చని యర్థముగదా. అప్పుడా అచ్చునకుగాని, హల్లునకుగాని యతి చెల్లునని భావము. ఈవిధముగా పై పద్యము నిర్దుష్టమగును.

శ్రీ నాగరాజుగారు చూసిన మిగిలినవానిలో ఎత్తుగీతి, త్రిపదలవిషయము విచారించవలసియున్నది. కావ్యాలంకార చూడామణిలోని ఎత్తుగీతి లక్షణము రెండు పాదములుగా వేదమువారి ముద్రణలో అచ్చుయియున్నది. అదియు 'మేలన గీతి'యను శీర్షిక క్రింద. ఈ ఎత్తుగీతిలక్షణము తెల్పు రెండు పాదముల తరువాత, నాల్గుపాదములలో మేలనగీతి యొక్క లక్షణమున్నది. ఆ నాల్గుపాదములు ఆ పద్యమునకు లక్ష్యము గూడ. అయితే గమనించదగిన విషయమేమనగా ఎత్తుగీతి లక్షణము చెప్పు రెండు పాదములు గూడ మేలనగీతి లక్షణముతో నుండుట. కాని, ప్రతిపద్యమునకు లక్షణము చెప్పుచు, ఆ పద్యమునే, సామాన్యముగా, లక్ష్యముగా నిరూపించుట లాక్షణిక పద్ధతి. కావ్యాలంకార చూడామణియందును అదే పద్ధతి అనుసరించబడినది. అట్టిసందర్భమున ఎత్తుగీతికి సంపూర్ణ పద్యమును లక్ష్యమ్ముగా విన్నకోటపెద్దన రచియించియేయుండుననుట సమంజసము. ప్రస్తుత మచ్చులోనున్న రెండు పాదములను ప్రాస ననుసరించి నాల్గు పాదములుగా వ్రాసినచో ఈ క్రిందివిధముగా నుండును.

గలము రెండు నగణములును
గలసి ప్రాస మెఱయఁ
జెలువు దోప నెత్తుగీతి
వెలయుఁ గృతులయందు (కావ్యా. పు. 117 వే. ము.)

ఇందులో చెప్పబడిన లక్షణమునుబట్టి ప్రతిపాదమున మూడు సూర్య గణములుండ వలయుననియు, ప్రాసయుండ వలయుననియు తెలియుచున్నది. యతివిషయము చెప్పబడలేదు, లక్ష్యమున లేదు కూడ. అయితే లక్షణమునకును లక్ష్యమునకును సమన్వయము కుదురుటలేదు. బేసిపాదములు లక్షణవిరుద్ధముగా నున్నవి. అనగా మూడు సూర్యగణములకు బదులు నాల్గు సూర్యగణము లా పాదములయందున్నవి. ఈ లక్ష్య లక్షణ సమన్వయ మిట్లుండగా,అసలీ లక్షణము అనంతాదులు చెప్పినదానికన్న భిన్నముగా నున్నది. అనంతాదులు చెప్పిన ఎత్తుగీతికి లక్షణమీ క్రింది విధముగా నున్నది. ప్రతిపాదమున మొదట నొక ఇంద్రగణము, తరువాత రెండు సూర్యగణములు—మొత్తము మూడుగణము లుండవలెను. ప్రాసనియమ ముండును. మూడవ గణాద్యక్షరము యతి. ఈ లక్షణముతో నున్న పద్యమెత్తుగీతియగును. ఇది నాల్గు పాదముల పద్యము.

అయితే ఇక్కడ గమనించవలసిన విషయ మొకటియున్నది. అనంతాదులు విన్నకోట పెద్దనకన్న అర్వాచీనులు. అందువలన పెద్దన చెప్పిన లక్షణమును అర్వాచీనులు చెప్పిన లక్షణముతో పోల్చి చూచుటకన్న తత్పూర్వలక్షణముతో పోల్చి చూచుట సమంజసము. విన్నకోట పెద్దనకన్న కవిజనాశ్రయ కర్తయగు రేచన ప్రాచీనుడు. ఎత్తుగీతికి రేచన చెప్పిన లక్షణమిట్లున్నది.

"శ్రీ దయితాధిపా న
యోదయనలినన త్ర
యోదితమైన నెత్తు
గీదియ యొప్పుఁ గృతుల"

(కవి. పు. 51. వావిళ్ల ముద్రణ 1950)

ఈ పద్యమును గణవిభజనచేసి చూచినచో, యతి విషయము మినహాగా, అనంతాదుల లక్షణముతో సరిపోవును. కాని, పద్యమందు చెప్పబడినలక్షణము అస్పష్టముగా నున్నది. ఇందులో 'నలినన త్రయోదిత' అనునదియే లక్షణమును చెప్పవలయును. 'న త్రయోదితము' అని స్పష్టముగా నుండుటచే మూడు నగణము లుండవలెనని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి విన్నకోట పెద్దన చెప్పిన లక్షణము కూడ సరిపోవుచున్నది. అయితే రేచన లక్షణములోని 'నలిన' పదమునకు సమన్వయ మెట్లని యనవచ్చును. 'నలిన'లోని చివరి నకారము ప్రమాదవశమున చేరిన దనవలయును. ఇట్టిచో రెండవపాదము "....యోదయనలి నత్ర......." అని యుండును. ఆపాద మాలక్షణమునకు కూడ సరిపోవునట్లు మూడు సూర్యగణములుగలదే యగుచున్నది. మిగిలిన పాదములందును అల్పమగు మార్పులు చేసినచో, లక్షణము సమన్వయమగును. ఆ మార్పులతో పై పద్య మిట్లుండును.

"శ్రీ ద యాధి పా న
యోద యనలి న త్ర
యోది తమ్మయి యెత్తు
గీది యొప్పుఁ గృతుల"

'గీదియ' అనుదానిని "గీది' యనుట గ్రంథకర్తృభిప్రేతమే. ప్రగీతి మేలనగీతి పద్యములలో గీది (తి) యనియేయున్నది. (తేటగీతి లక్షణ పద్యమున గీదియ అని ఉన్నది. అందువలన గీది, గీదియ రెండును కర్తృభిప్రేతములే). ఈ విధముగా రేచన ఎత్తుగీతి లక్షణము పాదమునకు మూడు సూర్యగణము లుండి, ప్రాసనియమ్ముండుట. పద్యము నాల్గుపాదములతో నుండుట.

ఇక 'నలిన న త్రయోదిత' అనుదానిని ప్రస్తుత మచ్చయిన పద్యస్థితి కనుగుణముగా 'నల నన త్రయోదిత' అని మార్చవచ్చును. అప్పుడు పాదమున కొక యింద్రగణము (నల) రెండు సూర్యగణములు (నన) అనుస్ఫూర్తి కలుగును. కాని, ఈవిధముగా లక్షణముచెప్పుట కవిజనాశ్రయమునందు మరెచ్చటను కనిపించదు. పయి సమస్తపదమునకు 'నల, న, న అను గణత్రయోదితమై' అని యర్థము చెప్పుకొనవలయునుగదా. వేరు వేరు జాతి గణముల నొక సమాసమున చెప్పవచ్చునుగాని, ఆ సమాసములోనే తత్పాదగణసంఖ్య చెప్పు పదమును చేర్చుట కవి జనాశ్రయమున నెచ్చటనులేదు. అనగా 'నలము నద్వయము' అని విడిగా చెప్పబడును. సజాతిగణములైనచో చెప్పవచ్చును. "జగద్గీత కీర్తి! భుజంగ ప్రయాతం,బగున్ రేచనా యద్వయ ద్వంద్వమై" అనుచోట్ల చూడవచ్చును. 'యద్వయము యొక్క ద్వంద్వము అనగా రెండు యకారముల జంట—య—య—య—య' అని భావము. ఈ విధముగా చూచినచో 'నల నన త్రయ' మన్నప్పుడు 'నల—న—న' అను సంపుటియొక్క త్రయము—అనగా నల—న—న, నల—న—న, నల—న—న, అను అర్థము కలుగును. ఈ విధమయిన క్లిష్టస్థితి కవి జనాశ్రయమునలేదు. ఉన్నపద్యము నున్నట్లుగా సమన్వయము చేయవలయునను ఉద్దేశ్యముతో క్లిష్టత, రచనాభిన్నత కల్గించుట సరిగా కనిపించదు. అదిగాక, ఈ లక్ష్యము విన్నకోట పెద్దన లక్షణముతో గూడ సరిపోవునుగదా!

ఇక విన్నకోట పెద్దన చెప్పిన లక్షణమునకు లక్ష్యముగా అచ్చయి యున్నదానిని నాల్గు పాదములుగా వ్రాసినప్పుడు బేసిపాదములు విరుద్ధములుగానున్న విషయము విచార్యమగుచున్నది. మూడవపాద మందధికముగానున్న 'దోప' యనుదానిని తొలగించినచో మొదటిపాదముతప్ప మిగిలిన పాదములన్నియు లక్షణ సమన్వయమగును. ఇక మొదటి పాదమున "...నగణములును" అని దానిలోని 'గణ' పదము, మరియు చివరి 'ను' తొలగినచో ఆ పాదముకూడ సరిపోవును. అప్పుడా పద్య మిట్లుండును.

'గలము రెండు నములు
గలసి ప్రాస మెఱయుఁ
జెలువు నెత్తు గీతి
వెలయుఁ గృతుల యందు"

'నము' అనగా నగణమని యర్థము. 'గణ సూచకాక్షరములకు విభక్తి ప్రత్యయములు చేరుట పలుచోట్ల చూడవచ్చును.

ఏక జాతి గణములే అన్నియు ప్రతిపాదమున పద్యమంత టనుగల పద్యములు తెలుగులో—రగడలు తప్ప—లేవనవచ్చును. రేచన, విన్నకోట పెద్దనలు రగడలను చెప్పలేదు. రేచన, పెద్ద నలు చెప్పిన 'చౌపది' యను పద్యము మాత్రము 'మధుర గతిరగడ'తో సమానమైనది. అనంతాదులు రగడలందుతప్ప ప్రతి పాదము నేకజాతి గణములే యన్నియు నుండుట నొప్పుకొనని వారుగా కనిపింతురు[1]. అందుకనియే రేచన పెద్దనలు చెప్పిన చౌపదిని వారు కొంత మార్చినారు. రేచన పెద్దనల లక్షణ ములో చౌపదకు ప్రతిపాదమున నాల్గును చతుర్మాత్రాగణ ములేయుండగా, అనంతాదులు మూడు చతుర్మాత్రాగణములు, ఒకత్రిమాత్రాగణముండునని మార్చినారు. ఈ విధముగనే రేచన, పెద్దనలు చెప్పిన యెత్తుగీతి లక్షణమునుగూడ మార్చి నట్లు చెప్పవచ్చును. ఆ మార్పు ఎత్తుగీతిలోని త్రిమాత్రాక మయిన మూడు గణములలో మొదటిదానిని చతుర్మాత్రాకము చేయుటయే.

ఈ చేసిన అనంతాదుల లక్షణమునుబట్టి రేచన లక్ష ణము చెప్పిన లక్ష్యపద్యము—లక్షణాపేక్ష లేకుండనే—లక్ష్య ముగా సరిపోవునట్లు మార్చబడియుండుననవచ్చును. పెద్దన యొక్క పద్యమునకు గూడ ఆ పద్ధతిలోనే శ్రీ నాగరాజుగారు చూపిన పాఠాంతరము వెలసియుండును. ఆ పాఠాంతరమిది.

"నలము రెండు నగణములు గలసి ప్రాసంబు
చెలువుమై యెత్తుగీతి
వెలయు సత్కృతులయందు"

ఇది త్రిపాదిగా నున్నది. కొంచెము మార్పుతో 'త్రిపది' యను పద్యము గూడ కావచ్చును. పైదానిలో మొదటి పాదమునకు 'మెఱయు' చేర్చి, 'గలసి......" దగ్గరినుండి రెండవ పాదముగా జేసి, శ్రీ నాగరాజు అనంతాదులు చెప్పిన యెత్తుగీతి లక్షణ ముతో సరిపుచ్చినారు. ఈ పాఠాంతరమును చూచినచో అసలు పాఠమును సవరించినట్లే కనిపించును. మూడవపాదమందు 'చెలువు' తరువాత 'మై' యనియు, నాల్గవపాదమందు 'కృతుల' అనుదానికిముందు 'సత్' అనియు చేర్చుట జరిగినది. రెండవ పాదముపూర్ణముగా నున్నది. శ్రీ నాగరాజుగారు పూర్వ పాఠ మందలి 'మెఱయు' అనుదానినిచేర్చి, దీనిని పూర్తి చేసినారు. అనంతాదుల లక్షణమునకు ఈ పాఠాంతరము దగ్గరగా నుండు టచే శ్రీ నాగరాజుగారు 'మెఱయుః' జేర్చినారనుకొందును.

మరియు 'ఎత్తుగీతి' అను పేరెట్లు వచ్చినదని ఊహించి నచో మేలనగీతిలోని మొదటి మూడు గణములను విడిగా దీసినట్లు ఈ పద్యముండుటచే, మేలనగీతినుండి యెత్తబడినగీతికావున దీనిని 'ఎత్తుగీతి' యనియుందురని తోచును. సీసపద్యానుబంధ ములైన ఆటవెలది తేటగీతులకు 'ఎత్తుగీతి' అను పేరు వ్యవ హారసిద్ధమేకాని, లాక్షణికసిద్ధముగా కనిపించదు. సీసమున కను బంధమైన ఆటవెలదిని ప్రవళియని, తేటగీతిని ప్రసన్నపది యని విన్నకోట పెద్దన యొక్కడే చెప్పినాడు. విషమ సీసము నకు ఆటవెలదినే చేర్చవలెనను నియమమున్నట్లు శ్రీ నాగరాజు గారు వ్రాసినారు. ఒక్క చిత్రకవిపెద్దన తప్ప మిగిలినవారం దరును 'గీతి' యుండవలయునని సామాన్యముగానే చెప్పినారు గాని, ఫలానాదేయని నిర్ణయింపలేదు. రేచన, విన్నకోట పెద్దన, అనంతుడు విషమసీసోదాహరణమున తేటగీతి నుపయోగించి నారు. అప్పకవి ఆట్టవెలది నుపయోగించినాడు. విన్నకోట పెద్దన అభిప్రాయము ప్రకారము విషమసీసము గూడ ఒక సీస భేదమేగాన, తదనుబంధ 'గీతు'లను గూడ ప్రవళి (ప్రపది) ప్రసన్నపదియనియే పేర్కొనవలయునని తోచును.

ఇక విన్నకోటపెద్దన చెప్పిన 'త్రిపద' విషయము. అచ్చులోనున్న పద్యము, ఆ పద్యమందు చెప్పబడినలక్షణమున కనుగుణముగనే యున్నది. అది ఇది.

త్రిపదికి నొక యంఘ్రి నింద్రుల నలువురు
ద్యపతు లిద్దరు సూర్యు లిర్వురౌల
ద్యుపతిద్వయార్కులు నౌల.

దీనినిబట్టి ఆ యా పాదముల గణక్రమ మీ క్రిందివిధముగా నుండును.

ఇం + ఇం + ఇం + ఇం
ఇం + ఇం + సూ + సూ
ఇం + ఇం + సూ

అనంతాదులు చెప్పినలక్షణము ప్రకారము చూచినచో, విన్న కోట పెద్దన లక్షణమందలి రెండవ పాదమందు చివర నొక్క సూర్యగణ మధికముగా నుండును. దానిని తొలగించినచో అనం తాదుల లక్షణ మేర్పడును. శ్రీ నాగరాజుగారు అనంతాదుల లక్షణముతో వి. పె. లక్షణమును సరిపుచ్చుటకు రెండవ పాద మును "ద్యుపతు లిద్దరు సూర్యుడౌల' అని సవరించారు. వి.పె.లక్షణమున అనంతాదుల లక్షణములు సరిచూచుటకుముందు తత్పూర్వుడైన రేచనయొక్క లక్షణముతో సరిచూడవలసి యుండును. అచ్చులోనున్న ప్రకారము రేచనయొక్క లక్ష్య లక్షణ పద్య మీ విధముగా నున్నది.

త్రిదశేంద్రులాఱగు పదియగు నెడనకున్
గదియ రెంట్లును మూటను
నదుకుడుఁద్రిపదకు నమరు.

(కవి. పు. 54 వా. ము. 1950)

---

1. మేలన గీతియందు పాదమంతటను ఏక జాతి గణముల ననంతాదు లొప్పుకొనినారు. దానికి కారణము 'మేలనగీతి' ఉత్సా హమ్మయొక్క చివరి మాత్రను తగ్గించుటచే ఏర్పడినదగుటయే యని తోచును. మరియు, ఈ స్థితి అనంతాదు లొక్క మేలన గీతియందే సమ్మతించినారు.

లక్ష్య స్వరూప విషయమటులుంచి, ఇందులో త్రిపద కేమి లక్షణము చెప్పబడినదో స్పష్టముగాలేదు. గణ విభజన చేసి చూచినచో

ఇం + ఇం + ఇం + ఇం
సూ + ఇం + ఇం
సూ + ఇం + ఇం

అని ఏర్పడును. ఇక అర్థమును చూతమన్న, ఆరింట పదింట ఇంద్ర గణములుండగా, రెంటను, మూటను అదుకగా త్రిపద ఏర్పడునని తోచును. అయితే రెంటను మూటను అదుకునవి యేవి? అవి కూడా ఇంద్రగణములే అయినచో, ఆ నాల్గుగాక ఉండవలసిన మిగతా గణములేవో తెలియదు. షట్పదిలో చంద్ర గణములు కూడ ఉండును. మరి, ఇందులో కూడ నుండునా? లేక సూర్యగణములుగాని, అవి ఇవి కలిసిగాని యుండునా? ఉన్నచో ఎక్కడెక్కడ? చంద్రగణము లుండుననుకొన్నచో పద్యము కుదరదు. సూర్యగణములన్నను ఒకటి, అయిదు, ఏడు, తొమ్మిది, పది గణములు సూర్యగణములుకావు. ఇట్లేవిధముగ కూడ, ఇది సమన్వయముకాదు. ఇక గణవిభజనబట్టి చూచినచో అనంతాదుల లక్షణమునకు విరుద్ధముగా నున్నది. చివరి రెండు పాదములలో చివర సూర్యగణ మనంతాదుల లక్షణ మందుండగా పై పద్యమున మొదట నున్నది.

కన్నడమందు త్రిపదకు ప్రముఖప్రయోగమున్నది తెలుగున లేదనియే యనవచ్చును. రేచన త్రిపదకు, కన్నడ త్రిపదకు ఏమైన పోలికయున్నదేమో చూడవలెను. కన్నడ త్రిపద యొక్క ఆ యా పాదముల గణక్రమ మిట్లుండును.

ఇం + ఇం + ఇం + ఇం
ఇం + సూ + ఇం + ఇం
ఇం + సూ + ఇం

మొత్తముమీద పద్యములో అన్ని పాదములందు గలసి పదనొకండు గణము లుండును. ఆరవ పదవ గణములు సూర్య (బ్రహ్మ) గణములు. మిగిలినవన్నియు ఇంద్ర (విష్ణు) గణములు. మొదటి రెండు పాదములలో నాల్గేసి గణములు, మూడవ పాదములో మూడుగణము లుండును. ఇది కన్నడ త్రిపదలక్షణము.

రేచనపద్యమందలి 'ఆఱగు పదియగు.....' అనుదానిని బట్టి కన్నడ త్రిపదననుసరించి లక్షణము చెప్పబూనినట్లు కనిపించును. ఆరవ, ఏడవగణములు వరుసగా రెండవ, మూడవ పాదములలో నుండుటబట్టి 'రెంటను, మూటను అనియు, రేచన లక్షణమున నున్నది. అయితే ఆ స్థానములలో నుండవలసిన గణములు సూర్యగణములని చెప్పుటకు తగినస్థితి రేచన పద్యమునలేదు. కన్నడ లక్షణము ననుసరించినచో రేచన పద్య మీ క్రిందివిధముగ నుండవలయును.

త్రిదశేంద్రు—లాఱగు—పదియగు—నెడనకున్
గదియగ—రెండి—టనుమూట—సూర్యులు
నదుకుడు—త్రిపద—కునమరు

త్రిదశేంద్రులు అని ఆపుకొని పద్యమందన్నియు ఇంద్రగణములే యుండునని చెప్పుకొనవలెను. ఇక, ఆరవ, పదవ స్థలములలో—అనగా రెండవ, మూడవ పాదములలో—మాత్రము సూర్యగణముల నదుకవలెను. పై సవరించిన పాఠము ననుసరించినచో లక్ష్య లక్షణములు రెండును సమన్వయమగును.

అయితే దీనికిని విన్నకోట పెద్దన లక్షణమునకును భేదము స్పష్టముగా కనిపించుచున్నది. మొత్తము మా యా పాదములలో నుండవలసిన సంఖ్య ఇద్దరి లక్షణమందును సమానమే. కాని, రేచన లక్షణమున సూర్యగణములు రెండే యుండగా పెద్దన లక్షణమున మూడున్నవి. మరియు ఆరింట, పదింటకాక, ఏడింట ఎనిమిదింట, పదునొకండింట నున్నవి. అనగా రేచన లక్షణములోని ఆరవ ఏడవ గణములు, పదవ, పదునొకండవ గణములు వెనుక ముందులైనవి. మరియు రెండవ పాదముచివరి ఇంద్ర గణము సూర్యగణమయినది.

అయితే రేచన పెద్దనల లక్షణము లందీ భేదమెందుకు వచ్చినదన్నది విచారణీయమగును. కన్నడ త్రిపదయొక్క లక్షణముతో పోల్చుకున్నను సరిగా లక్షణము చెప్పగలిగినంత స్పష్టముగా రేచనయొక్క త్రిపదలక్షణములేదు. అందువలన రేచనయొక్క త్రిపద లక్షణముచెప్పు లక్ష్య పద్యమును గణ విభజనముచేసి, చూచి లక్షణముచెప్పవలసిన స్థితి పెద్దనకు కలిగియుండును. పెద్దన చూచిన లక్షణ పద్య మందొకటి రెండక్షరములు లోపించి యుండవచ్చును. అప్పుడు

త్రిదశేంద్రు—లాఱగు—పదియగు—నెడనకున్
గదియగ—రెండిట—మూట—సూర్య
నదుకుడు—త్రిపదకు—నమరు

అను రీతిగా గణ విభజనము జరిగియుండవచ్చును. పై పాదమందు రెండవ పాదమందుండవలసిన 'రెండిటను' కు బదులు, 'రెండిట' అనియు, 'సూర్యుల'కు బదులు 'సూర్య'నని యున్నది. ఇదే పెద్దనకు లభించినచో పెద్దన చెప్పిన లక్షణము దాని గణ విభజన ననుసరించియేయున్నది. అందువలననే ఆ యాపాదములందలి గణ సంఖ్య ఇద్దరి లక్షణములలో సమానముగానే ఉండియు పెద్దన లక్షణమున గణభేదము, స్థానభేదము కలిగినది.

ఇంత చెప్పుటయెందుకు? అని యనవచ్చును. దీనికి కారణమున్నది. పెద్దన ఈవ ఛందో విషయ రచనకు పూర్తిగా రేచననే అనుసరించినాడు. రేచనచెప్పకుండిన రెండుమూడు క్రొత్తవిషయములను చెప్పినాడుకాని, చెప్పినవానిని మార్చి యుండలేదు. అందువలన ఈ విషయములయందును పెద్దన రేచననే యనుసరించి యుండుననుట సమంజసముగా తోచును. కావుననే పయివిచారమంతయు నావశ్యకమయినది.

ఇట గమనించవలసిన మరొక విషయమున్నది. రేచన మూడు విషమగీతులు చెప్పగా పెద్దన వానినుండి ప్రగీతిని వదలినట్లుగా అచ్చుప్రతులయందు కనిపించుచున్నది. అనగా ప్రగీతి

పెద్దన చెప్పలేదు. దీనికి కారణము కనిపించదు. ఒకవిధముగా నిట్లు చెప్పవచ్చును. ఆటవెలది యను సమగీతమునకే ఏ మార్పును లేకుండ కేవలము ప్రాసచేర్పుటచేతనే 'ప్రగీతి'గా చెప్పబడుచున్నది. ఇట్లే తేటగీతికికూడ ప్రాసచేర్చి మరొక పేరుపెట్టవచ్చును. కాని దీనిని రేచన చెప్పలేదు. నిజమునకు తేటగీతికి లేనప్పు డాటవెలదికికూడ అక్కరలేదను ఉద్దేశ్యముతో పెద్దన దానిని వదిలియుండెనేమో యనిపించును. కాదన్నచో గ్రంథపాతము జరిగియుండునని చెప్పవలసియుండును.

ఒక్క కావ్యాలంకారచూడామణియందేకాదు, ఇంకను వివిధఛ్ఛందో గ్రంథములందు చర్చించి తేల్చుకొనవలసిన విషయము లనేకములున్నవి. సహృదయుల విమర్శలు, చర్చలే సరియైన పరిష్కారమును కలిగించగలవు.

నాకుతోచిన యీ విషయములను చెప్పుటకు హేతుభూతులయిన శ్రీ బండి నాగరాజుగారికి కృతజ్ఞతలు.

# కుమారదాసుని దశరథుడు

## శ్రీ టి. బి. యం. అయ్యవారు

సంస్కృత సాహిత్య ప్రపంచమున కుమారదాసుడు మహాకవిగ మంచి ప్రశస్తి నందుకొన్న ధన్యుడు. రామాయణేతివృత్తము నాధారముగ చేసికొని, అతడు రచించిన జానకీహరణము రాజశేఖరునివంటి మహాకవుల స్తోత్రములకు పాత్రమైనది. కాళిదాస మహాకవి రఘువంశము విపుల ప్రచారమున రసికుల నలరించుచుండ, రామగాథను, మరల మహా కావ్యముగ వ్రాయు సాహసము కుమారదాసునకే చెల్లినది. ఈతని తరువాత రామాయణమును మహా కావ్యముగ వ్రాసినవారెందరో కలరు. కాని వారి కృతులేమియును జానకీహరణముతో పోల్ప నర్హములు కావని ఘంటాఘోషమున చెప్పవచ్చును. ప్రవరసేనుని సేతుబంధము (ప్రాకృత కావ్యము) మాత్రము దీని కపవాదము (**Exception**). అంతే. మహాకావ్య నిర్మాతగ కుమారదాసుడు, మాఘు, భారవులకు తుల్యుడు. ఈ విషయ మాతని కావ్యము నామూలచూడము పరిశీలించిన సహృదయులకు విదితము కాకపోదు. ఏవంవిధ ప్రతిభాశాలియగు నీ మహాకవిదేశకాలముల నించుక పరామర్శించి, జానకీహరణ గత దశరథపాత్ర చిత్రణమును స్థూలముగ ప్రస్తావించుటయే నా వ్యాసలక్ష్యము.

### దేశకాలములు

గ్రంథస్థ నిదర్శనములబట్టి యిమ్మహాకవి సింహళదేశీయుడని చెప్పవలయును. తద్దేశ పరిపాలకుడగుట మరియొక విశేషము. రాజకవి యగు నీతని గురించి యనేక గాథలు సింహళీయులు కొందరు చెప్పుకొందురు. "మహావంశము" కాళిదాస మహాకవితో నితనికిగల సంబంధమును సూచించు నొక కథను పేర్కొన్నది. భోజరాజునకు మనవారంటగట్టిన "కమలే కమలోత్పత్తిః" యను శ్లోకపు కథను కుమారదాసున కది అన్వయింపచేయుచున్నది. కథలోమాత్ర మే భేదమును లేదు. అచ్చట కుమారదాసుడు, ఇచ్చట భోజరాజు. తన ప్రాణమిత్రుడగు కాళిదాసు వేశ్యాహతుడు కాగా, సుహృద్ వియోగమును భరింపజాలని ఈతడతని చితిపైననే ప్రాణత్యాగము చేసెనట. ఆ సందర్భముననే ఈ మహాకావ్యమును నాశువుగా చెప్పెనని యొక ప్రతీతి. సింహళ దేశీయ గ్రంథము లనేకము లీ సంగతిని ముచ్చటించినవి. కథ మాట యెట్లున్నను, కుమారదాసుడు సింహళదేశ సార్వభౌముడనుట కిది తోడ్పడును. దేశమేదైననేమి? మహాకవుల పరిగణించునప్పుడు కుమారదాసుని మనము మరచిపోలేము.

ఈతని శ్లోకపాదమొకటి వ్యాకరణ మహాభాష్యమున కానవచ్చుటచే కొంద రీతనిని పతంజలికి పూర్వుడని యందురు. అది సరికాదు. సూక్తి ముక్తావళిలోని రాజశేఖరుని ప్రశంస దీనికి బాధకముగ నున్నది.

"జానకీహరణం కర్తుం రఘువంశే స్థితే సతి
కవిః కుమారదాసశ్చ రావణశ్చ యదిక్షమః"
(సూక్తిముక్తావళి)

రఘువంశానంతరము పుట్టినదని చెప్పుటకు నీ శ్లోకమే ప్రబల దృష్టాంతము. ఛందోబద్ధమగు పతంజలి మునివాక్యమునే కుమారదాసుడు తన శ్లోకమున నదుకుకొనెననుట సముచితమైన తీర్పు. సంస్కృత వాఙ్మయ చరిత్రకారులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి అభిప్రాయమును నిట్లేయున్నది. ఇంత సందేహమునకు మూలమైన "అయి విజహీహి దృఢోపగూహన"మ్మను నా శ్లోకమును క్షేమేంద్రుడు కూడ తన "ఔచిత్య విచార చర్చ"లో నుపసర్గౌచిత్యమునకు వ్యతిరేకోదాహరణముగ నుదాహరించినాడు. కాళిదాసునకు కుమారదాసుడు సమకాలికుడైనను కావచ్చును—లేదా అర్వాచీనుడైన కావచ్చుననుటయే దీని పిండితార్థము. ఇంతవరకును శుష్కమైన దేశకాలముల చర్చ సాగినది. ఇక నసలు విషయమును ప్రస్తావింతము. విశ్వామిత్రుని యజ్ఞమునకు మారీచ సుబాహులు పదే పదే విఘ్నమును కల్గించుచుండిరి. విష్ణ్వంశ సంభూతుడగు శ్రీరామునిం గొంపోయి తన యజ్ఞమును నిర్విఘ్నము కావించుకొనవలెనని ఆ మహర్షి తలంపు. ఈ యుద్దేశము తోడనే అతడు దశరథునికడకు వచ్చి, సవనరక్షకై శ్రీరాముని తనవెంట పంపుమనును. పుత్త్రవ్యామోహపీడితుడగు దశరథుడు వాగ్దానభంగమునకైన సమ్మతించునుగాని, అకృతాస్త్రుడు కాకపక్షధరుడగు శ్రీరాముని విశ్వామిత్రునివెంట పంపుట కంగీకరింపడు. కడకు వశిష్ఠుల ప్రోద్బలమున నెట్లో గుండె రాయి చేసికొని పంపును. వాల్మీకమున నీ ఘట్టమంతయును నొక పెద్ద రాద్ధాంతము. విశ్వామిత్రుడు రాముని నడుగును. దశరథుడు వీలుకాదనును. పుత్త్రవిరహాభీరువగు నా మహారాజునోట వాల్మీకి ఈ వాక్యముల చెప్పించినాడు.

"ఊనషోడశ వర్షోమే రామో రాజీవ లోచనః
న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహరాక్షసైః
ఇయ మక్షౌహిణీ సేనా యస్యాహం పతిరీశ్వరః
అనయా సహితో గత్వా యోద్ధాహం తైర్నిశాచరైః
ఇమే శూరాశ్చ విక్రాంతా భృత్యామేస్త్ర విశారదాః
యోగ్యా రక్షోగణైర్యోద్ధుం న రామం నేతు మర్హసి
అహమేవ ధనుష్పాణి ర్గోప్తా సమరమూర్ధని
యావత్ ప్రాణాన్ ధరిష్యామి తావ ద్యోత్స్యే నిశాచరైః
నిర్విఘ్నా వ్రతచర్యా సా భవిష్యతి సురక్షితా
అహం తత్ర గమిష్యామి న రామం నేతు మర్హసి
..............................
విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితుం ముని శార్దూల! నరామం నేతు మర్హసి"
(బాలకాండము 2 వ సర్గము)

వాల్మీకమున ఇంత విపులముగా నడచిన ఈ ఘట్టపు స్వరూప మునే కుమారదాసుడు పూర్తిగ మార్చివేసినాడు. ధర్మార్థమైన దశరథ విశ్వామిత్రుల సమావేశమును నిజముగా కుమారదాసుడు మహోదాత్తముగ చిత్రించి మూలగాథకు మెఱుగులు తీర్చినాడు. అస లతని కావ్యమున విశ్వామిత్రుని ప్రవర్తనమే వేరు. ఎక్కడ లేని నిండుతనమును నతడు ప్రదర్శించును. యథావిధి కుశల ప్రశ్నలైన పిమ్మట నతడు సుబాహు మారీచుల శిక్షకై శ్రీరా ముని తనవెంట పంపు మనును. అంతే. అంతటితో విశ్వామిత్రుని పనియైనది. అతడు వేరుగా బలవంతమేమియును చేయలేదు. అంతయును దశరథునికే విడచిపెట్టి మౌనముగ నున్నాడు. మూలము నందలి విశ్వామిత్రుని ధోరణి నచ్చకే కుమారదాసు డిట్లు వ్రాసెననుకొందును. తను కావించిన ఈ మార్పునకు సమర్థన కూడ నాతడే ఇట్లు చేసుకొన్నాడు.

నృపతావితి వేదితా పదా
మునినా జోష మభూయ తక్షణమ్
మహతాం నకదాచి దర్థనా
గురు నిర్బంధ వినష్ట సౌష్ఠవా—
(జానకీహరణము—చతుర్థసర్గము)

విశ్వామిత్రునంతటివాడు వచ్చి యడుగుట—మహో దారులగు రఘువుల వంశమున పుట్టిన దశరథుడు తొలుత నిత్తునని, చివరకు వీలుపడదనుట—అతడు నిర్బంధము చేయుట కుమారదాసునకు రుచింపలేదు. అందుచేతనే యిట్లు వ్రాసి సమర్థించుకొన్నాడని తోచును. విశ్వామిత్రుని పాత్రనే ఇంత రమ్యముగ తీర్చిన మహాకవి దశరథునకు లోపము చేయునా! విశ్వామిత్రునకు తగినట్లుగనే ప్రవర్తించినా డతడు. శ్రీరాముని ద్విజాశీఃపరిపూతతనుని గావించి యొక్కదినము వ్యవధిలో పంపి వాడు. మూలమునవలె—విశ్వామిత్రుని భ్రూభంగములకుగాని, వశిష్ఠాదుల హితవాక్యములకుగాని ఇందావ్కారమే లేకపోయినది. మహారాజుగా తన కర్తవ్యమును తాను గుర్తించి దశరథు డిచ్చట నడచుకొనెను. మహర్షివెంట యజ్ఞ రక్షణకై పోవ నున్న తన బహిఃప్రాణమగు శ్రీరాముని అంకమున కూర్చుండ బెట్టుకొని యాతడు కావించిన హితోపదేశము—కుమారదాసుడు దశరథుని కిరీటమున చెక్కిన మహోజ్జ్వలవజ్రము. అది ఇది.

శరణోపగతం న పాతియో
న భినత్తి ద్విషతాం సమున్నతిమ్
నసబాహు రసాధన క్షమో
నరవృక్ష ప్రభవః ప్రరోహకః
పరకృత్యజడో యశోఽర్జనే
జఠరైక ప్రవణో నిరుత్సుకః
పశురేవబుధై ర్నిగద్యతే
యవసగ్రాస నివృత్తమానసః
అకృత ద్విషదున్నతిచ్ఛిదః
శ్రిత సంరక్షణ వంధ్య కర్మణః
పురుషస్య నిరర్థకః కరః
కిల కండూయన మాత్ర సార్థకః
అశనే రసనాని దేహినాం
కృతయోగాని ముఖేషు భూరిశః
న నసన్తి తదేషు దుర్లభం
ప్రభుయత్ స్యా దభయం ప్రజల్పితుమ్
తవ జీవిత సంశయేష్వపి
న పరిత్యాజ్య మిదం కులవ్రతమ్
సులభం ప్రతిజన్మ జీవితం
హృదయం ధర్మరతం హి దుర్లభమ్"
(జానకీ హరణము, చతుర్థసర్గము)

దశరథుని యుపదేశ మిచట సంగ్రహముగా నుదాహ రించితిని. దీనిలోని చివరిశ్లోకము ఇక్ష్వాకు కుల సముత్పన్నుడగు దశరథున కెంతయును తగియున్నది. పుత్ర వ్యామోహ మును తెగకోసి, ధర్మరక్షణకు బద్ధకంకణుడై, దశరథుడు కేవలము రాజ్యాశ్రమ తపస్వివలె నిచట ప్రవర్తించినాడు. ఇట్లు దశరథుని కుమారదాసుడు చిత్రించుటకు కారణము నాకు చూడ కాళిదాస మహాకవి కృత రఘువంశమును బహువారముల నత డధ్యయన మొనరించుటయే. జనశ్రుతిలోని కాళిదాస, కుమార దాసుల మైత్రీబంధమును జానకీహరణమున కనుపించు రఘు వంశ శ్లోకానుకరణములును నా యూహ కాధారములు. రఘు వంశ వర్ణితులగు నిక్ష్వాకుల మహోదాత్త చరిత్రముల కను రూపముగ, కొంత స్వతంత్రించి, దశరథుని శీలమున కిట్లు

కుమారదాసుడు వన్నెల దిద్దెనని చెప్పనచ్చును. రాజకవియగు నాతని ఆత్మీయత కూడ దీనికి కొంతవరకు హేతు వనిపింపక పోదు. ధర్మబద్ధముగ, ప్రజారంజకముగ సింహళదేశమును పాలించిన మూర్ధాభిషిక్తులలో కుమారదాసు డొకడని యా దేశ గ్రంథములు చెప్పుచున్నవి. తాదృగ్ధర్మాభిరతిగల మహా రాజు రఘరధు నిట్లు చిత్రించుటలో వింతలేదు. లౌకికదృష్టిలో నీ మార్పు అనుచితమయినను, ధార్మిక దృష్టి కిది పరమ రమణీయమనుటలో విప్రతిపత్తి యుండదనుకొందును. ఇమ్మహా కవి కవితాసౌందర్యమును వీలువెంట వేరొక వ్యాసమున ప్రస్తా వించెదను. ఇప్పటి కిది చాలును. సాహిత్య ఎకాడమీవారు కాళి దాసుని కృతులతోబాటు—ఈ మహాకవి జానకీహరణమును కూడ సుందరముగ్ర ప్రకటింపవలెనని నా యభ్యర్థనము.

# రాజగోపాల విలాసము

## శ్రీ బండి నాగరాజు

పై శీర్షికలో మామిత్రులు శ్రీ కొడకండ్ల వెంకట రాఘవాచార్యులవారు 'భారతి'— 7—2—62 న నొక లఘువ్యాసము ప్రకటించిరి. అం దీక్రిందివిషయములు గమ నార్హములు:—

1. కృష్ణుని యష్టమహిషులను అష్టవిధశృంగార నాయి కలనుగా శ్రీ నిడుదవోలువారు నిరూపించిరి:—1. రుక్మిణి-స్వీయ స్వీయ, స్వీయ; 2 భద్ర—పరకీయ (జారిణి), కలహాంతరిత, జారిణి; 3. లక్షణ—వాసకసజ్జిక, వాసక సజ్జిక, జారిణి.— ఇట్లు మూఁడుచోట్ల మూఁడు విధములుగాఁ దెలిపియున్నారు.

2. అవస్థావిశేషము ననుసరించి, రుక్మిణి—స్వీయ యనుట పొసఁగదు. కలహాంతరిత యగును.

3. భద్ర—జారిణియనుట ప్రమాదికము. ఈమెకృష్ణుని యర్ధాంగి కనుక పరకీయకాదు. అవస్థావిశేషము ననుసరించి కలహాంతరితగాదు. అభిసారికయగును.

4. లక్షణ—జారిణియనుట పొరపాటు. శ్రీ వెంకటరావు గారే వేఱొకచోట తెలిపినట్లు వాసకసజ్జికయగును.

5. ఇతరలు, వారు నిరూపించిన నాయికలే యగుదురు. రుక్మిణి— స్వీయయనుటవలన, అష్టమహిషుల ప్రసక్తి యున్నందున నితరలు పరకీయ లగుదురా?

పై శీర్షికతోనే శ్రీ ఆర్. రాజగోపాల్‌గారు మఱొక లఘువ్యాసమును 'భారతి'— 7—4—62లో ప్రకటించిరి. అందలి సారాంశమిది:—

1. 'రాజగోపాలవిలాసము' ముద్రణప్రతియందు కొన్ని పొరపాట్లు సంభవించిన విషయము వాస్తవము. ఆవిషయము శ్రీవెంకటరావుగారే గుర్తించియున్నారు. (The Southern School in Telugu Literature, Revised Edition) దానిని శ్రీ రాఘవాచార్యులవారు చూచినట్లులేదు.

2. కాళయ— అవస్థాభేదములచే నీయిష్టమహిషులను అష్టవిధ శృంగారనాయికలుగా చిత్రించి యున్నాఁడు. ఈ యష్టమహిషు లందఱును దక్షిణ నాయకుఁడగు కృష్ణునివట్ల స్వీయలే. శ్రీ రాఘవాచార్యులవారు, అవస్థావిశేషము ననుస రించి రుక్మిణి—స్వీయయనుట పొసఁగదని యే కారణము వలన అనిరో తెలియుటలేదు.

3. రాజగోపాల విలాసమునందు చిత్రింపఁబడిన యీ యష్టవిధనాయికలను శ్రీ ఆర్. రాజగోపాల్‌గారు ఆంధ్ర సాహిత్య దర్పణమునందలి లక్షణములతో వివరించిరి. (రుక్మిణి —కలహాంతరిత, భద్ర—అభిసారిక, లక్షణ—వాసకసజ్జిక జాంబవతి—విప్రలబ్ధ, మిత్రవింద—ఖండిత, సుదంత— విరహోత్కంఠిత, కాళిందీ—ప్రోషితభర్తృక, సత్యభామ— స్వాధీనపతిక.)

మీఁద గీట్లుంచిన విషయములు ముఖ్యముగా గమనింపఁ దగినవి.

శ్రీ రాఘవాచార్యులవారు చూపిన పొరపాట్లను పొర పాట్లేయని శ్రీ రాజగోపాల్‌గారు వాస్తవము నొప్పికొనిరి, మంచిది. శ్రీ నిడుదవోలువారును ఈ విషయమును గుర్తించి యున్నారఁట! సంతోషము. కాని, వారేమని గుర్తించిరో ఆ గుర్తింపునకు ప్రస్తుతముతో నేమాత్రము ప్రశక్తి యున్నదో తెలుపరైరి. వారుచెప్పిన యాంగ్ల గ్రంథమునఁగల ప్రస్తుతాంశములను దెలుపక, శ్రీ రాఘవాచార్యులవారి సవర ణలనుబట్టియు, శ్రీ నిడుదవోలువారి నిరూపణలను బట్టియు శ్రీ నిడుదవోలువారి నిరూపణలనుబట్టియు లక్ష్య లక్షణముల నేకరువుపెట్టిరి; పిష్టపేషణము!

శ్రీ రాజగోపాల్‌గారు ఒక ముఖ్యవిషయమును గమనింప వలసియున్నది.

1. అష్టమహిషు లందఱును స్వీయలేగదా! మఱి, రుక్మిణి—స్వీయయని ప్రత్యేకముగాఁ జెప్పుటయేల?

2. స్వీయ, పరకీయ (అన్య), జారిణి=(వేశ్య,సామాన్య)యను (నాయికా) భేదములు మూఁడును, స్వాధీనపతిక మొదలగు నెనిమిది (ఆ నాయికలయొక్క యవస్థా) భేదములును వేఱు వేఱు విభాగములని శ్రీ రాజగోపాల్‌గారికిఁ దెలిసినట్లులేదు! స్వీయ—పరకీయయు, జారిణియుఁగాఁ జాలదు. ఐనచో స్వీయాత్వము శాశ్వతముగాఁ గోల్పోవును. అవి యవస్థనుబట్టి మాఱవు. భర్తతో వారికిఁ గల సంబంధము నవి సూచించును. స్వాధీనపతికాది భేదములు అవస్థావిశేషమునుబట్టి మాఱును. ఒక్క సత్యభామయే యవస్థనుబట్టి యెనిమిది విధములుగను వ్యవహరింపనగును. కనుక, అష్టమహిషులను అష్టవిధశృంగార

# గ్రంథ విమర్శనము

## శ్రీరామచరిత మానసామృతము

[రచయిత్రి—తులసీదాసదాసి—మూల్యము రు. 10—405 పుటల వచన గ్రంథము. ప్రతులకు—నేలనూతుల పార్వతీకృష్ణమూర్తి—మూలస్పేట నెల్లూరు]

ఆనంద కాననే రమ్యే జంగమః తులసీ తరుః కవితా మంజరీ యస్య రామ భ్రమర భూషితా—' మధుసూదన సరస్వతి.

పై వచన గ్రంథ రచయిత్రి శ్రీమతి నేలనూతుల పార్వతమ్మగారు. శ్రీ వేంకటేశ్వర సమేత అలమేలు మంగతాయారు దేవికి ఈ గ్రంథము సమర్పితము. 'మున్నుడు'లో శ్రీమతి పార్వతమ్మగారు బ్రహ్మశ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు రచించిన వాల్మీకి రామాయణ కథామృత రచనమందలి వస్తు ప్రదర్శన పద్ధతియే తమ కావ్య రచనకు ఆదర్శప్రాయమైన దనియు.......హిందీ భాషలో దలమానికమని ఎన్నదగి పవిత్ర గ్రంథమగు తులసీ రామకథ పఠనమునకుఁ ద్రోవచూపుటయే తమ రచనయొక్క ఉద్దేశ్యమనియుఁ దెల్పినారు. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు—'మూలమునకు యథాతథముగ వారనువదించినదికాదనియుఁ గథను సంకుచితముగఁ జెప్పుచుఁ బోవు దురనియుఁ దనికింపుగ దోచినచోట ననువదించిరనియు—ఈ పద్ధతి మూలగ్రంథమును జదువవలెనను నాశను రేకెత్తించు ననియుఁ'—దమ యాశీర్వచనములలో సెలవిచ్చినారు. తులసీదాసు రచనా విశిష్టత, రామచరిత మానసముయొక్క తత్త్వమును జర్చించినారు కూడ. శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు తులసీదాస వృత్తము నిందు సంగ్రహించిరి. ఈ రామచరిత మానసమునకు సప్త సోపానములు గలవు. బాలాయోధ్యారణ్య కిష్కింధా సుందర లంకా కాండము లఱును ఉత్తరకాండమును ఆ సోపానములు. రామ చరిత మానసమన రామచరిత్ర మనెడు మానస సరోవరమని భావము. (రూపకాలంకారము). మానస సరస్సు బ్రహ్మ సంకల్పమువలనఁ గల్గినట్టిది. సమస్తపాపములను బ్రక్షాళన మొనర్చునది. సప్తర్షులు నిత్యము స్నానముచేసి పావిత్ర్యము నొందునట్టిది. అందుచేతనే రామచరితను మానస సరస్సుతో నభేదము కల్పించి రూపకల్పనము చేసినాఁడు కవి. వాల్మీకి రామాయణమునకును, దీనికిని అటనటఁ బొందికలులేవు. తదనువాద గ్రంథము కాదిది. రామకథ నెవరెట్లు గానము చేసిన నేమి? అందరి శుభాఖ్యాయికలన్నియు నే భిన్న దేశకాలములలో వర్ణించిననేమి? రామగుణగాన సముద్రాభిముఖముగఁ బ్రవహించి అందు సంలీనమగుననే ఆ భావ పరంపరా సరిత్తులు. వాల్మీకి రామాయణము ఒక హిమవత్పర్వతము వంటిది. వివిధ రామ కథలన్నియుఁ దన్నగ సముద్భూత సౌరభ వర్షి పుష్ప సమంచిత తరుతతులు. మానస సరోవరములు, మంజుల ధామములు—. తులసీదాసు 'మానసము' భక్తిజల ప్రపూర్ణము. సమస్తప్రాణి లోక జీవనప్రదము. అనుభోక్తృరసానంద పర్యవసాయి. తృషార్తునకు దివ్యప్రప. తులసీదాసు హృదయతంత్రులు పలికించు కొన్న మధుర వాఙ్నికరము. ఒక మహా భక్త హృద్ఘటము జీవన రథ ప్రయాణములోని ఒడుదుడుకులలోఁ దొణికిన రామ తత్త్వ (భక్తి) రసోల్బణమే మానసము.

తులసీదాసు భక్తుఁడు. జననము 16 వ శతాబ్ది. బ్రాహ్మణ శాఖీయుఁడు. తండ్రి ఆత్మారామ దూబే—తల్లి హులసీదేవి. అభుక్త మూలానక్షత్రమున జన్మించెనట. ముఖ దర్శనము కూడ దని పిత దేశాంతర మేగెను. పుట్టుకతో దంతము లుండెనట. రామోచ్చారణము చేయుటచే 'రామ్‌బోలా' అని పిలచిరట! (ఇంటిపేరైనది). ఇల్లువీడి తీర్థాటనము సాగించినాఁడు. సూకర క్షేత్రమున నరహరిదాసు గురువయ్యెను. అభ్యస్త శాస్త్ర సర్వస్వుఁడై, పెండ్లాడినాఁడు. భార్య రత్నావళి. పుట్టినింటికేగిన భార్యపై వలపురేగి, వెల్లువ దాటియేగి, ఆమెచేఁ బ్రబోధితుఁడై విరాగియయ్యెను. ప్రయాగలో సన్యాసి యయ్యెను. చిత్ర కూటమున నిరంతర రామోపాసన సల్పెను. జపోదకముల అశ్వత్థ మూలమునఁ బోయ రాక్షసత్వముఁబాసిన ఒక బ్రహ్మరక్షస్సు ప్రత్యుపకారముగా, రామదర్శన భాగ్యమునకై హనుమంతుని జూపెను. అతఁడెవఁడోగాఁడు. తన రామాయణమును విని ముదశ్రులు రాల్చు నొక ముదుసలి. వానివలనఁ గల్గిన లాభము రెండు పాల్లు జారవిడచుకొన్నాఁడు. తాను దీయు చందనము యాచించు నిర్భర బాలురఁ గోపించిన మన దాసుఁడు, బైరాగి వేషమునఁ బ్రబోధించిన మారుతి మూలమున ఆ బాలురలో రాముని దర్శించినాఁడు. రచన చిత్రకూటముననే. సంకటమోచన హనుమద్విగ్రహము గంగా ఘట్టమున నిల్పినాఁడు. చరమదశలోఁ దన రచనలపై దుమారము రేగినది. రామకథాగానముతో నసువులఁ బాసినాఁడు. సూరదాసు సమకాలికుఁ డితఁడు. అగ్బరు పృచ్ఛపై సూరదాసు

'అతఁడు మహర్షి అనియు, వానినోట వచ్చినది శబ్దబ్రహ్మమని' తెల్పును. 'తులసీ సతసయి, దోహావలి, కవితావలి, వినయపత్రిక—' వీని రచనలు.

వాణీ వినాయకులకు వాల్మీకి హనుమంతులకు, సీతకు నతు లర్పించుచు గావ్యారంభము చేసినాఁడు తులసీదాసు.

వాల్మీకీయమున—రామకథ నారద మహర్షి వాల్మీకికిఁ దెల్పినట్లు కలదు—భరద్వాజుఁడు సాక్షిభూతుఁడు, బ్రహ్మ కారకుఁడు. మానసమునఁనో? భరద్వాజుఁడు యాజ్ఞవల్క్యుని రామకథను గూర్చి ప్రశ్నించును. అతఁడు పార్వతికి శివుఁడు చెప్పినది తాను జెప్పెద ననును. శివుఁడు అగస్త్యునికడ రామకథ వినినట్టిది, పార్వతితో భాషించినట్టిదిగా గథ ప్రారంభమగును. అట వాల్మీకి రామ జీవితగాథలో భాగస్వామి అగును. (ఉత్తరకాండము). ఇట రామ చరితతో శివ పార్వతులు భాగస్వాములు—(దండకారణ్యమున మాయాహరిణమును మాయించి సలక్ష్మణుఁడై వచ్చిన రామునికి సీత కన్పింపకపోఁగా వియోగ దుఃఖితుఁడగు రాముని జూచి—పరీక్షింప మాయాసీతయైన పార్వతి, రామ సర్వాంతర్యామిత్వము ప్రస్ఫుటము కాఁగా, భర్త రాము నేల పూజించునో తెలిసికొనును. తాను పరీక్షించిన తీరు, తత్ఫలితము భర్తకుఁ జెప్పక బొంకి, భర్తృతిరస్కృతయయ్యె. ఆ దేవిని పాపాత్మగా నెంచి శివుఁడు ఆమెను స్పృశింపఁడయ్యె. పార్వతి రాముని మానస పూజచేసి పశ్చాత్తప్తయై భర్తృపాదములపైఁ బడును. శివుఁడు రామకథ దేవికి వినిపించును.)

తన అసత్య దోష ఫలితముగా సతీదేవి అనాహూత యయ్యు దక్షయజ్ఞమునకు బోవ సిద్ధమగుట—శివుఁ డామెను వలదని విఫలుఁడగుట—పిత్రవమానితయై హరునే భర్తగాఁ గోరి యోగాగ్నికి ఆమె బలియై పార్వతిగా నవతరించుట—'అథావమానేన పితుర్గృహీతాదక్షస్య పుత్రీ భవపూర్వపత్నీ, సతీయోగ విసృష్టదేహా తాం జన్మనే శైలవధూం ప్రపేదే' అన్న శ్లోకమునకు వివరణ కథ-గృహీతము. 'నారదుఁడుముందే శివునిపేరు తడవక అమంగళవేషుఁడు భర్తయగునని తల్లిదండ్రుల చింతాక్రాంతులఁ జేయుట—అతఁడు శివుఁడే భర్త యగుననన్నను మేనాదేవి ఖిన్నయగుట—పార్వతి తన స్వప్న వృత్తాంతము చెప్పుట—దేవశిరముని పార్వతీ జన్మ విషయము చెప్పి మేనా హిమవంతుల తృప్తిపరచుట—పార్వతి 4, 5 వేల సంవత్సరములు తపస్సు చేయుట—బ్రహ్మ, శివుఁడు భర్త యగుననియు సప్తర్షులు వత్తురనియుఁ జెప్పుట—శివుఁడు రామోపాసన చేయుట రాముఁడు ప్రత్యక్షమై పార్వతిని వివాహమాడుమని కోరుటపై శివుఁడు తన పూర్వ ప్రతిజ్ఞ వీడుట— సప్తర్షులే పార్వతీభక్తి పరీక్షించుటకై శివుని పరిహసించుట (బ్రహ్మచారి కుమార సంభవ కావ్యమునవలె)-ఇవి కాళిదాసు తడవనివి—సుందరములే. శివుని నేత్రద్వయమునకుఁ గన్పింపక రసాలశాఖపైఁ దాగిన మన్మథుఁడు మూఁడవ నేత్రము తెరచుటతో భస్మమగును. శివుఁడు రతి కభయమిచ్చి ప్రద్యుమ్న పుత్త్రుఁడు భర్తయగుననును. మన్మథుని భస్మీభూతునిఁ జేసిన శివుఁడు ఏలయని సప్తర్షులు మరలఁ బార్వతిని బరీక్షించి ప్రసన్న లగుదురు. వరుఁడైన శివునిఁజూచి మేనాదేవి వాని వికృతాకారమునకు దుఃఖించును. ప్రాణత్యాగము చేయఁగోరును. నారదుఁడు సమాధానపరచును—ఇవి కవి స్వకపోల కల్పితములు. యాజ్ఞవల్క్యుఁడు శివరాముల కభేదము చాటుట ప్రశస్తముగా నున్నది. భర్తనుబొందిన పార్వతి ఇప్పుడు అవశిష్ట రామకథ వినఁగోరును. నాఁటి రామ తిరస్కృతియే ఆమె నింతలు చేసినదికదా!! ఇదంతయు నాటకీయపద్ధతియై పోయినది—శివునికి రామునిపై భక్తి అపారముగాఁ బ్రదర్శింపఁబడినది. కాకభుశుండి (కాకిపేరు) గరుత్మంతునికి దెల్పిన ఈ గాథ శివుఁడు పార్వతికి దెల్పుచున్నాఁడు—

కాకభుశుండి గురుధిక్కారము చేసిన—అయోధ్యలోని శూద్ర శివభక్తుఁడు. నానా జన్మములెత్తునట్లు శివశప్తుఁడగును. కాకభుశుండి యగును. గురువు శివుని బ్రార్థించి శిష్యుని గాపాడఁ గోరును. దానిచే—దివ్యశక్తులు, ఇచ్ఛా మరణము వరములుగా అనుగ్రహింపఁబడినవి. అది శైవమున బాలరామోచ్ఛిష్టమును దినుచుండెడిది. అది సర్వలోకముల రామునిలోఁ గన్నది. రాముఁడు దానిని బట్టుకొని మోక్షమిత్తుననును. అది రామునిపై భక్తినే కోరును. ఇట్లు రామతత్త్వ మెఱింగి రామకీర్తనము చేయుచు, సుమేరుప్రాంత వృక్షముపై నుండ—లంకలో నాగపాశబద్ధులైన రామాదుల, నారద ప్రేరితుఁడై గరుత్మంతుఁడు రక్షించి, ప్రభుస్థితికి విచారించి తద్దుఃఖ నివృత్తికై నారదుని, బ్రహ్మను, శివుని—వాని ఆజ్ఞపై కాకభుశుండినిజేరి ప్రబోధమందును. అది రామచరిత మానసము—నారద మోహగాథ, రావణుని పుట్టుక తెల్పి—రామావతారకథ తెల్పును.

జలంధరుఁడు రావణుఁడగుట—నారద శాపముపై హరి రాముఁడుగా అవతరించుట—నారద గర్వభంగము—శతరూపా స్వయంభువుల తపః ఫలితముగా విష్ణువు రాముఁడుగా జన్మించుట—(కౌసల్యాదశరథులు అదితి కశ్యపులును, శతరూపాస్వయంభువులును)—ప్రతాపభానుఁడనురాజు, వాని తమ్ముఁ డరిమర్దనుఁడు బ్రాహ్మణ శాపమున రావణ కుంభకర్ణులగుట, వారి మంత్రి ధర్మరుచి విభీషణుఁడగుట—ఇవి అవాల్మీకీయములు. ఈ రామ చరిత మానసమున-కౌసల్యకు శిశువైన రాముఁడు విశ్వరూపము చూపించును. రామచంద్రోదయ సందర్భమున కాకభుశుండి, శివుఁడు—అయోధ్యలో మానవ రూపముల నుందురు. విలుకాదన్న

# గ్రంథ విమర్శనము

దశరథుని మాటకు విశ్వామిత్రుని మనస్సున హర్ష ముద్భవించును. మిథిలోద్యానమున—గౌరీ పూజా నిమిత్తము వచ్చిన సీతయు, గురుపూజా ద్రవ్య నిమిత్తముగా నేగిన రాముఁడును పరస్పర దర్శన సమ్మోహితులగుదురు. ప్రేమపూరితవాక్కులు ప్రకటపరతురు గూడ. గౌరి పుష్పమాలను వరప్రదానముగా సీత కిచ్చును. రాముఁడు భర్తయగునని దీవించును. చంద్రుని జూచి రాముఁడు సీత ముఖమున కది లొచ్చని వర్ణించును. స్వయంవర మంటపమున వందిమాగధులు శివ ధనస్సును బూర్వము రావణ బాణాసురులు స్పృశింపలేకపోయిరని పల్కుదురు. శివ ధనుర్భంగము చేసిన రాముని మిథిలలోనే పరశురాముఁడు దర్శించును. సీత మ్రొక్క అతఁ డాశీర్వదించును. జనకునిదూతలు పరశురామగర్వభంగము దశరథుని బిల్వనేగి తెల్పుదురు. సీత తన మహిమచే అణిమాది సిద్ధులచే వియ్యాలవారిని దన్పును. బ్రహ్మ ముహూర్తమును శోధించి లగ్నపత్రికను నారదునిచే జనకున కంపును. తనకే పట్టాభిషేకముచేయుట విని రాముఁడు దుఃఖించును. దేవతలు స్వకార్యార్థము రామ పట్టాభిషేక విఘ్నకారులై వాగ్దేవి నర్థింతురు. ఆమె మంథరవాక్కున వెలసినది—రామునిపై ఈఁగవాలనీయనిది కైక—మాయ ఆవరించి మంథర మాట వినును. వనరాజ్యము తండ్రి నాకొసఁగెనని ఆనందముతో రాముఁడుపల్క కౌసల్య కొంత దుఃఖించియుఁ దండ్రిగారి ఆజ్ఞ రాముఁడు పాలించుటలో ఆనందపరవశ అగును. రామ లక్ష్మణులు విఘ్నేశ్వరునకు, ఉమాశంకరులకు మ్రొక్కి బయలు దేరుదురు. గుహునకు రామతత్త్వము నాఁటిరాత్రి లక్ష్మణుఁడు బోధించును. అరణ్యమున శివపూజ చేయుదురు. రామదర్శనార్థము పాదచారియగు భరతుని మందలించి రథ మెక్కించును గౌసల్య. భరద్వాజుఁడు సరస్వతీమాయను దెల్పును. ఇంద్రుఁడు బృహస్పతితో భరతాగమము దేవకార్యభంగమగునేమో అని ఆలోచించును. ఇంద్ర జనకులు చిత్రకూటమున కరుదెంతురు. పంచవటిలో రాముఁడు లక్ష్మణునకు దత్త్వము తెల్పును. లక్ష్మణుఁడులేని సమయమున రాముడు సీతతో—'నేను మనుష్య లీలల నొనర్తును. నేను సంపూర్ణముగ రాక్షసుల వధించువరకు నీవు అగ్నిలో నివాసము చేయుము' అనును. ఆమె అట్లొనర్ప ఆమె ప్రతిబింబ మొకటి ఆశ్రమమున ఉండును—సీతా లక్షణము లన్నియు నది ప్రకటించును. లక్ష్మణు డిది యెఱుఁగడు. రావణుఁడు మనస్సున వందనమాచరించి సీతను దీసికొనిపోవును. జటాయువుతో రాముఁడు సీతాపహరణ వార్త స్వర్గమునఁ దండ్రి కెఱిఁగింపవలదని చెప్పును. నవలక్షణభక్తి రాముఁడు శబరికి బోధించును. ప్రాణమిత్రు వన్నను వాలి కోరఁడు. తార జ్ఞానమూర్తి. లంకలోని దేవాలయములో కోదండరాముని విగ్రహము ప్రతిష్ఠింపఁబడి పూజార్హముగా నున్న యది. శ్రీరాముని ధ్యానించు విభీషణున కాంజనేయుఁడు లంకలో నమస్కరింపగా అతఁడు జానకి చరిత్ర సర్వము తెల్పును. హనుమంతుఁడు చెట్టుపైనుండి ప్రాణత్యాగము చేయనుంకించు సీతముందు అంగుళీయకము పడవేయును. ఆమె చూచుచుండ రామగుణగానము చేయును. సీత వానిని శంకింపనే శంకింపదు. రాయబారిగా వెడలిన అంగదుఁడు రావణపుత్త్రునితో నాటలాడును. అందువైరము పెరుగును. అంగదుఁడు సభలో రావణుని కిరీటముఁగొని విసర అది రాముని జేరును. ప్రతిక్షాకార్యారంభమున వానరులు రాముని ధ్యానింతురు. మారుతి ఓషధి పర్వతముతో అయోధ్యనుగాంచును. భరతుఁడది రాక్షస మాయగా నెంచి బాణము వేయును. మారుతి 'రామా' అని మూర్ఛితుఁడై పడును. భరతుఁడు—నాకు రామునిపై ప్రేమ ఉన్నచో ఇతఁడు బ్రతుకునుగాక—అనఁగా హనుమంతుఁడు లేచి విషయమంతయు వానికిఁ దెల్పును.

రావణ వధానంతరము మాయాసీత దగ్ధమై నిజ సీత బయల్పడును. వృద్ధరాజు (దశరథుడు) భేద భావముతో రామునిపై మనసు నిల్పుటచే అతనికి మోక్షము లభింపలేదు—(సగుణోపాసకులు దానిని పొందలేరట!) అని శివుఁడు పల్కను'—అయోధ్యలో సీతకు లవకుశులు జన్మింతురు'—ఇట్టి మార్పులతో రామ చరిత మానస గ్రంథ రచన సాగినది. ఇందు రామభక్తి ఉద్వేలమై ప్రవహించినది.

రచయిత్రి, శ్రీమతి పార్వతమ్మగారు మున్నుడులలోఁ దెల్పినట్లు—హిందీలోని రామచరిత మానసాంధ్రతము తెల్గువారికి అందించి మూలగ్రంథముపై మరులు పుట్టించునట్టిదీ గ్రంథమనుటలో నతిశయోక్తిలేదు. వాల్మీకీయముతో బోల్చుకొనుటకు మనకీ గ్రంథము ఎంతేని సాయపడును. 'తలితండ్రులు' (14 పుట) కామేష్టి (64 పుట) మాట్లాడు (మాట్లు + ఆడు — అనిష్టరూపము) సురులు (322 పుట) గ్రహింతురు (2పుట) అన్నవి ఇందలి ముద్రణ దోషములు.

కమ్మనిదై సలక్షణమైన భాష—కథా కథనవైఖరి—మూల గ్రంథ శ్లోకార్థ వివరణ చణత—వీర్ని రచనలోఁ బరవళ్లు ద్రొక్కు

చున్నవి. పెక్కు ప్రాంతముల కథనములతో సందర్భపరుపఁబడి, అనుబంధింపఁబడి క్లిష్ట బంధురమైన భాగముల—ముడులు విప్పి సుగమము చేయుటలో రచయిత్రులు చూపిన రచనా పాటవము సాటిలేనిది. వారి గాఢ భక్తియే ఈ రచనకు దారి తీసినట్లు ఈ గ్రంథము చెప్పకయే చెప్పుచున్నది. ప్రతి వ్యక్తియు జదువ దగిన సద్గ్రంథ మిది.

నానా పురాణ నిగమాగమ సమ్మతం యత్
రామాయణే నిగదితం క్వచిదన్యతోఽపి
స్వాన్తః సుఖాయ తులసీ రఘునాథగాథా
భాషా నిబంధ మతి మంజుల మాతనోతి—
ఇతిశమ్.

—వావిలాల రామమూర్తి.

## శివభక్త చరితము

[రచయిత: విద్వాన్ పొం. సూర్యనారాయణశర్మ, 44 బి/1 వెల్లాలవీథి; పురసవాకం, మద్రాసు—7. వెల రు. 8—50.]

శివభక్తులను తమిళులు నాయన్మారు అనుపేరున వ్యవహరింతురు. వీరు అరువదిమువ్గురు గలరు. తమిళనాడున శైవ మతవ్యాప్తికి తోడ్పడిన కారణజన్ములు వారు. ఈ నాయన్మారుల దివ్యచరిత్రముల నభివర్ణించు రసవత్కావ్య మొకటి తమిళమున పంద్రెండవశతాబ్దమున నంతరింపబడెను. ఈ గ్రంథనామము తిరుత్తొండర్ (భక్తుల) పురాణము. కాని పెరియపురాణమనునది ప్రసిద్ధనామము. ఈపేరే నేటికిని ప్రచురప్రచారమున నున్నది. మహాభక్తులగు నాయన్మారులకు సంబంధించిన గ్రంథముగుటచే, దీనికి పెరియపురాణమను వ్యవహారనామ మేర్పడెనని నుడువుదురు.

తమిళవాఙ్మయమున పెరియపురాణమున కొక విశిష్టత కలదు. దీనిని కొందరు రాజనీతి శాస్త్రమనియు, మరి కొందరు రసవత్కావ్యమనియు, ఇంకను కొందరు తమిళదేశ చరిత్రను తెలిసికొనుటకు తోడ్పడగల రచనమనియు నుడువుదురు. నిజమునకు, పెరియపురాణమున ఈ లక్షణములన్నియు గలవు. చారిత్రకముగా ఈ గ్రంథమునకు విలువ చాల గలదు. దీని నాధారముగ చేసికొని నాయన్మారుల కాలమును నిర్ణయించుటకు వీలయినది. అంతేకాక, ఇందలి కొన్నివిషయములు శాసనములందును కానవచ్చుచున్నవి. పెరియపురాణమునుండి ఆ నాటి తమిళుల సాంఘికాచారములనుకూడ తెలిసికొననగును. ఇట్టి యుద్గ్రంథమునకు తెలుగున వచనానువాదము వెలయుట హర్షింపదగు నంశము.

శైవ మత గ్రంథములను పంద్రెండు భాగము లొనర్చిరి. ఒక్కొక్క భాగమునకును 'తిరుమురై' అని పేరు. పెరియ పురాణము పంద్రెండవ తిరుమురై అని వ్యవహారము. తేవారం మున్నగునవి కడమ భాగములు. తమిళ వాఙ్మయమున పెరియ పురాణమునకు పేరుపెంపులు లభించినట్లే తమిళ కవులలో తత్కృతికర్తయగు శేక్కిళారునకు కూడ చిరయశస్సు లభించినది. 'శేపూర్ కిళార్' అనుమాటకు రూపాంతరమే శేక్కిళారు. ఇది వంశనామము. ఈ వంశీయులు భూలక్ష్మిని సేవించుచు కాలము గడపు కర్షకులు. వీరిని వేళాళర్ అందురు.

శేక్కిళారునకు తలిదండ్రు లిడినపేరు అరున్మొళి దేవర్. కాని, వంశనామముననే అతడు నేటికిని సభక్తికముగా సంస్మరింపబడుచున్నాడు. పండిత కవులు పలువు రీతని కవిత్వ మహత్త్వమును కొండాడిరి.

శేక్కిళారు తొండమండలమునందలి కుండ్రత్తూరను గ్రామమున సదాచార సంపన్నులగు జననీజనకులకు ప్రభవించెను. చేయూరు, పాలారు నదుల నడుమనున్న భూభాగమునకు తొండమండలమని పేరు. అనగా నేటి చెంగల్పట్టు ఉత్తరార్కాడు మండలము లన్నమాట. తొండనాడు సజ్జనాళికి నిలయమట. ('తొండై నన్నాడు శాండ్రోరుడైత్తు'). కనుకనే మహావిద్వాన్ మీనాక్షిసుందరంపిళ్లై శేక్కిళారును ప్రశంసించుచు, 'తిరుత్తొండై నన్నాట్టు వేళాళర్ కులతిలక! పెంగిరై యాడి యరుశే' అనెను.

చోళభూపతియగు అనపాయచోళుని కొలువుకూటమున శేక్కిళారు ప్రధానమంత్రిగ నుండెను. ఉత్తమ చోళ పల్లవన్ అను బిరుదము నొసగి రా జతనిని సత్కరించెను. కాని చోళుడు జైనమతావలంబకుడై, శైవమునెడ అనాదర భావము వహించియుండుట శేక్కిళారునకు కంటకముగ నుండెను. రాజును శైవునిగా నొనర్చు నభిలాషతో అతడు శివ భక్తుల కథలను గ్రంథస్థము గావించెను. అందుల కతడు చిదంబరమున కేగెను. ఒక్క సంవత్సరకాలములో పెరియ పురాణమును రచియించెననియు, మూడువేలమంది శ్రోతల సమక్షమున కావ్యావిష్కరణ మహోత్సవము జరిగెననియు, అనంతరము అనపాయచోళుడు పెరియ పురాణమును తత్కర్తను ఏనుగుమీద నధివసింపజేసి పురవీథుల నూరేగించెననియు చెప్పుదురు. తత్సమయమున చోళరాజు శేక్కిళారునకు వెనుకభాగమున నిలబడి ఆ కవిపుంగవునకు గొడుగుపట్టి వింజామరము వీచెనట! అంతేకాదు; అతనికి 'తొండర్‌సీర్ పరవువార్' అను బిరుదము కూడ నొసగెను. పెరియ పురాణమునకు వెనుక ఇంత కథ యున్నది.

# గ్రంథ విమర్శనము

పెరియ పురాణమునం దభివర్ణింపబడిన భక్తులు ఒక్క కులమువారు కారు; ఒక్క ప్రాంతమువారును కారు. వివిధ వర్ణములకును, తమిళనాడులోని వివిధ ప్రాంతములకును చెందిన మహనీయులు వారు. వారికి భక్తియే ప్రాణము. భక్తియే సర్వస్వము. నాయన్మారులు పవిత్ర శైవక్షేత్రములను సందర్శించి, ఆ యా శివమూర్తుల నుద్దేశించి భక్త్యుద్రేకమున పద్యము లల్లిరి; పాటలు పాడిరి. నాయన్మారులు తెలుగుదేశమునందలి శ్రీకాళహస్తీశ్వరుని, శ్రీశైల మల్లికార్జునుని కీర్తించిరి. వారెన్నియో అద్భుత కార్యముల నొనర్చి, ప్రజలకు శైవమునందు భక్తి భావమును కలుగజేసిరి. ఆ నాళ్లలో కొందరు రాజులు జైనమతావలంబకులై యుండిరి. అట్టివారిని కూడ ఈ శివ భక్తులు శైవమునకు త్రిప్పిరి. వారు మృత్యువునకు భయపడలేదు; పైపెచ్చు మృత్యుదేవతను సహర్షముగ నాహ్వానించిరి. నాయన్మారు లందరును పండితులు కారు. కొందరు మాత్రమే పండితులు, కవులును. కాళహస్తి కన్నప్పవంటి మూఢభక్తులును వారిలో కొందరు లేకపోలేదు. పండితులైనను, అపండితులైనను, ప్రజ్ఞానిధులైనను పరమమూఢులైనను నాయన్మారులు భక్తిమార్గమే తరణోపాయమని ప్రవ్యక్తమొనర్చిరి. వారిలో ఒక గొప్ప గుణము కానవచ్చుచున్నది. అన్యమత దూషణము నాయన్మారుల రచనలలో కానరాకుండుటయే ఆ విశిష్ట లక్షణము. పాలకురికి సోమనాది వీర శైవ కవులు చేసిన పరమత దూషణమును గుర్తునకు తెచ్చుకొన్నచో, నాయన్మారులు చాల విశిష్టులని తేటతెల్లము కాగలదు. ఇట్టి మహా భక్తుల జీవిత విశేషములను వారు ప్రదర్శించిన మహిమలను వివరముగ తెలియజేయు బృహద్గ్రంథమే పెరియ పురాణము.

ఈ యుద్గ్రంథమును తెలుగున వచన రూపమున శ్రీ శివభక్తచరిత మను పేరున శ్రీ పొంగూరు సూర్యనారాయణ శర్మగారు అనువదించినారు. అనువాదము సలక్షణమగు గ్రాంథికాంధ్రమున సాగినది. అటనట శైలి కొంచెము ప్రౌఢముగ నున్నది. గ్రాంథికభాషలో సంతరింపబడిన రచనములకు ప్రచారము తగ్గుముఖము పట్టుచున్న ఈనాళ్లలో భాష కొంచెము సరళముగ నున్నచో, ఇంకను బాగుండియుండెడిది. "శ్రీమంతంబై నగాధిరాజంబగు హిమవంతంబున రాజహంస విహారరమ్యంబై, మునిమానససేవ్యంబైన మానస సరోవరంబు గలదు. దానికి నుత్తరంబున ననతి దూరంబున కైలాసంబు గలదు......" "ముక్తా శిబికారూఢుడై రాకాచంద్రునివలె విలసిల్లుచు సితాతపత్రంబునీడ భక్తులు పరివేష్టించిరా సంబంధుడు మధుర ప్రవేశించెను. వైదికులు వేద ధ్వనులతో నెదురు వోయిరి......" 552 పుటలుగల శ్రీ శివ భక్త చరితమునందలి శైలి మొదటినుండి చివరిదాక ఇటులనే సాగినది. శైలిలో సమతను సాధించినందులకు అనువాదకులు అభినందనీయులు.

కొందర నుకొనునట్లు, అనువాదము సులభమైనపని కాదు. చాల కష్టతరమైనది. అందును రసవత్తరమైన కావ్యము ననువదించునప్పుడు ఈ కష్టము మరింత ఎక్కువగా తెలియవచ్చును. కాగా, మూలములోని సొగసుల నన్నిటిని అనువాదములోనికి తీసికొనివచ్చుట చాలకష్టమని సహృదయులు భావించుచున్నారు. శ్రీ సూర్యనారాయణశర్మగారి తెలుగుసేత మూలవిధేయమై, పఠనయోగ్యమై యున్నది. ఇందుకు వా రొనర్చిన పరిశ్రమము ప్రశంసనీయము. ద్రావిడ నామములను తెలుగులో వ్రాయునప్పుడు కొన్ని దోషములు దొరలినవి. ఉదా:—ఇయఱ్ పగై—ఇయల్పహ; ఇళైయాన్‌కుడిమార—ఇలయాన్కుడిమార; మెయ్‌ప్పొరుళ్—మెయ్యొప్పొరుళ్; మంగైయర్‌క్కరసి—మంగయక్కరశి; తిరుక్కుఱిప్పుత్తొండ—తిరుకురుప్పుతొండ; అరుణ్ మొళిత్తేవర్—అరున్మొద్దేవరు మొదలైనవి. 'తిల్లైవాళ్ అన్‌దణర్' అనుమాటకు చిదంబరవాసులగు దీక్షితులకు—అని అర్థము చెప్పబడినది. ఈ యర్థము సరియైనదే. కాని మూలమునందలి సొగసు ఇందు రాలేదు. అన్‌దణ్మై అను మాటకు దివ్యకృప లేక బ్రాహ్మణత్వము అని అర్థము గలదు. బ్రాహ్మణత్వముగలవారు అన్‌దణర్. ఈ శబ్దము బ్రాహ్మణులకు పర్యాయపదముగా తమిళ కావ్యములందు ప్రయుక్తము. కనుక దీక్షితులనుటకంటె బ్రాహ్మణులనుట యుక్తము. ఇవి చిల్లర దోషములు. వీనిని ద్వితీయ ముద్రణమున సులభముగ సవరించుకొనవచ్చును.

మొత్తముమీద శ్రీ సూర్యనారాయణశర్మగారి తెలుగుసేత చక్కగా నున్నది. వారి కృషిని మఱొకతూరి కొనియాడుచున్నాను. ఈ తెలుగుసేత అవశ్య పఠనీయము. అందును మన వీర శైవ కవుల రచనములను విమర్శనా దృక్పథముతో పరిశీలింప నభిలషించు భాషా జిజ్ఞాసువులు తప్పక పఠింపవలసిన గ్రంథ మిది. ఇక శివపాద సేవాతత్పరులకా, ఇది పారాయణ గ్రంథమే!

—చల్లా రాధాకృష్ణశర్మ.

## క థా క డ లి

[రచన: జొన్నలగడ్డ రామచంద్రరావు. శ్రీ కృష్ణదేవ రాయలు ప్రచురణలు, గుడివాడ. వెల: మేలు ప్రతి 2 రూ. లు; సాదా : 1—50. క్రౌన్‌సైజులో 102 పేజీలు.]

ఈ సంపుటిలో లైసెన్సు కూలి, వాళ్ళు ముగ్గురు, తల్లి కోరిన కోరిక, వానకోవెలలు, చిరంజీవులు, వాగ్దానం, ఆమె రాలేదు, చిరస్మరణీయ, ఎవరు హంతకులు, ఎదగని మనుష్యులు అనే పది కథలున్నాయి. ఈ కథల్లో వానకోవెలలు, వాళ్ళు ముగ్గురు ఆమెరాలేదు అనే మూడు కథలు ఇంగ్లీషు కథలకు అనుసరణలు! 'లైసెన్సుకూలి' అనే కథలో రామయ్య కూలివాడైనా, కూటికి తిప్పలుపడేవాడైనా—డబ్బుకోసం ఆశపడక ఉదాత్తతను ప్రదర్శిస్తాడు. 'వాళ్ళు ముగ్గురు'లో ముగ్గురు వేర్వేరు సమస్యలు గల స్త్రీలు సమస్యలు పరిష్కారంగాక, రైలుకిందపడి మరణిస్తారు. 'తల్లి కోరిన కోరిక'లో ఒక ప్రసాద్—తన భార్య మరణిస్తూ, తన కుమారుని బాగా చదువు చెప్పించమంటుంది. జీతం కుటుంబపోషణకే చాలని పరిస్థితుల్లో తన కుమారునికి చదువు ఎట్లా చెప్పించటం అని ఆలోచించి—తన కుమారుడి కో ఉత్తరం ఇస్తాడు. అందులో ఇలా ఉంటుంది: "అయిదువేల రూపాయలు ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్ళితెచ్చుకో. ఆ డబ్బుతో చదువు పూర్తిచేసి, నీ తల్లి కోర్కె నెరవేర్చు". "వానకోవెలలు" అనే కథలో రాములు మోటుమనిషి. అందర్నీ కొడుతూఉంటాడు. అట్లాగే భార్యను కూడా కొట్టగా ఆమె పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆతర్వాత రెండు వానకోవెలలు అతని జీవితంలో ప్రవేశిస్తాయి. ఆ రెండింటినీ అతను పెంచుతాడు. అక్కణ్ణుంచీ అతను ఎవర్నీ హింసించటంలేదు. ఒకరోజు వర్షంలో అతను ఇంటికిరాగా, ఆ పక్షులగూడు తడిసిపోతుంది. అవి రెండూ ఏడుస్తూఉంటాయి. అతనికి జ్వరం తగుల్తుంది. తర్వాత చనిపోతాడు. భగ్నప్రేమ కథావస్తువుగా గలది—'చిరంజీవులు'. 'వాగ్దానం' కథలో ఒకతను భోగంకొంపకు వెళ్ళటమూ, అక్కడ ఆ భోగం అమ్మాయిచేత, ఆమె బిడ్డను ఈ వ్యాపారంలోకి దించనని వాగ్దానం తీసుకోవటమూ కథావస్తువు. 'ఆమె రాలేదు' కథలో—ఒకతను ఒకామెను పెళ్ళి చేసుకుంటాడు. ఆమె అంతకుపూర్వం ఎవర్నో ప్రేమించింది. ఐతే అతను మరణించాడు. కొన్నాళ్ళకు ఒక ఉత్తరం వస్తుంది—అతని దగ్గర్నుంచి. ఆ ఉత్తరాన్నిచూసి భర్త తన భార్య ఎవర్నో ప్రేమిస్తున్నదని మండిపడతాడు. ఆమె ఇల్లువదిలి వెళ్ళిపోతుంది. తీరా చూడగా, ఆ ఉత్తరం, ఆ ప్రియుడు బతికివున్నరోజుల్లో రాసినది. తిరిగి తిరిగి 'లేటు'గా ఆ ఉత్తరం చేరింది. 'చిరస్మరణీయ'లో ఒక భార్యాభర్తలు హాయిగా ఉంటారు. ఒకనాడు ఒకతను తిండిలేక మాడుతూవచ్చి, ఒక వెండి ఫోటో ఫ్రేమును తీసుకొచ్చి ఆ భర్తను కొనమంటాడు. అది, తనొక అమ్మాయిని ప్రేమించినట్టూ, ఆమె వేరొకనిని చేసికొన్నట్టూ, ఆ ఫ్రేములో ఆమె ఫోటో ఉండేదన్నట్టూ చెబుతాడు. ఆ ఫోటో ఇవ్వడు. ఫ్రేముకొన్నతర్వాత, ఆ యువకుడు ఆత్మహత్య (అనేఅనుకోవాలి) చేసుకుంటాడు. అతని జేబులో ఫోటో ఉంటుంది. భర్త ఆ ఫోటో చూడగా—అది తన భార్యదే ఐఉంటుంది. 'ఎవరు హంతకులు'లో ఒకామె, ఒక పెద్దమనిషి సంపర్కంవల్ల రహస్యంగా బిడ్డలను కని, ఆమె వాళ్లను హత్య చేస్తుంది. కోర్టువారు విచారణకు తీసుకొస్తార్లు. ఆమె పరిస్థితుల ఒత్తిడివల్ల అట్లా చంపానని అంటుంది. సాక్ష్యం సరైనదిలేదని కోర్టు కేసును కొట్టేస్తుంది. ఐతే అప్పటికే ఆమె మరణించి ఉంటుంది! 'ఎదగని మనుషులు' లో ఒకతను ఒక అమ్మాయితో చనువుగా వున్నాడని అందరూ ఊహాపోహ పడటమూ, తీరా అతను సోదరప్రేమ చూపుతున్నాడని తెలుసుకోవటమూ కథావస్తువు.

కథాసాహిత్యం విపరీతంగా పెరుగుతున్న ఈరోజుల్లో ఈ 'కథాకడలి' కూడా ఒకటి. 'కథ లెందుకు రాస్తారు?' అనే ప్రశ్నకు సమాధానంలేదు. 'ఎందుకు చదువుతారు?' అనే ప్రశ్నకు ఏం సమాధానమో, దీనికీ అదే. 'సాంఘిక ప్రయోజనంలేని కథ కథకాదు' అని కొందరి నమ్మకం. పై కథల్లో కొన్ని అట్టి ప్రయోజనం గలవి వున్నై. ఈ రచయిత తీసుకున్న 'కథావస్తువులు' కొన్ని మంచివేఐనా, కొన్ని 'మరీ' ఇదిగావున్నై. ఐతే 'కథ'ను చెప్పటంలో ఈ రచయితకు అంత నేర్పున్నట్టు తోచదు. అందువల్ల 'కథ' చదువుతున్నప్పుడు ఉత్సాహం కుంటుపడుతుంది. వ్యావహారిక తెలుగు, శైలి—బాగా అలవాటు చేసుకున్నట్టయితే ఈ రచయిత మంచి కథలు రాయగలిగే ఆశ కనిపిస్తుంది. ఐతే కాలక్షేపంకోసం కథలు చదువుకునేవారికి మాత్రం ఈ కథలు అడ్డురావు.

—సుకుమార్

## వనితాలోకం 1, 2 భాగాలు

### జీవనసామరస్యం; నారీజగత్తు

[రచయిత్రి : శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. ప్రాప్తిస్థానం:—యం. శేషాచలం అండ్ కో. మద్రాసు. మూల్యం: ఒక్కొక్కటి మూడు రూపాయలు.]

ఆంధ్ర రచయిత్రులలో అగ్రశ్రేణిలోని రచయిత్రి శ్రీమతి సరస్వతీదేవి. ప్రాచీన, ఆధునిక పోకడల కలయికతో వీరి రచనలు ఒక ప్రత్యేకతను తెచ్చుకున్నాయి. వీరి రచనలన్నీ కూడా భావ గంభీర్యానికి, మాటల పొందికకు మచ్చుతునకలు.

వైవిధ్యం, విలక్షణత కల్గిన వీరి రచనలను గ్రంథరూపంలో శేషాచలం అండ్ కో వారు ఆంధ్ర పాఠకులకు అందించారు.

వనితాలోకం శీర్షిక క్రింద అప్పుడప్పుడు రాస్తూవచ్చిన వ్యాసాలే—జీవన సామరస్యము, నారీజగత్తు సంపుటాలు. ఈ వ్యాసాలలో విషయ వైవిధ్యం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. చదవడానికి తేలికగా, ఆలోచించడానికి లోతుగావున్న ఈ వ్యాస సంపుటాలకు ముందుమాట రాస్తూ—"వారి రచన—సాహితీలత విశాలాంధ్రలో బహువిధ ప్రక్రియలతో విస్ఫారినది. విశిష్టత గడించినది" అన్నారు శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు. వాటిలో స్త్రీల సారస్వతము, సాంఘిక సత్యాలు, ప్రాచీనసంప్రదాయవిషయాలు బాల వాఙ్మయం మొదలైన అనేక విషయాలున్నాయి. "నారీ జగత్తు" సంపుటంలో కూడా దాంపత్యజీవన సామరస్యతను గురించిన వివిధ రచనలున్నాయి. స్త్రీల హక్కులు, వైవాహిక సంప్రదాయాలు, చారిత్రక పరిజ్ఞాన విషయాలు మొదలైన వెన్నో విపులీకరించడం జరిగింది. వ్యాసరచన అంతంత మాత్రంగా ప్రోత్సహింపబడుతున్న ఈ రోజులలో ఈ వ్యాసాలు రాసిన రచయిత్రికి, ప్రచురించిన ప్రచురణకర్తలకు ధన్యవాదాలర్పించాలి.

## అక్కరకు వచ్చినచుట్టం; ముత్యాల మనసు; కథలు, గల్పికలు

[ప్రాప్తిస్థానం: యం. శేషాచలం అండ్ కో, మూల్యం: ఒక్కొక్కటి రెండు రూపాయలు.]

ఈ సంపుటులకు పీఠిక రాస్తూ, స్వామి శివ శంకరులు "దేవిగారి రచనలలో వైవిధ్యమున్నది, వస్తు స్వీకరణములోను, రచనలోను, తాత్పర్యార్థములలోను చాలా విశిష్టత గోచరిస్తుంది" అన్నారు. ఈమె 'రచనలలో ధార్మికదృష్టి నిహితమైవుంటుంది' అన్నారు.

ఈ కథలు, గల్పికలలో బాల్య, కౌమార, యౌవన వృద్ధాప్యములలోవుండే స్త్రీ పురుషుల మనోరీతులు, ఇష్టానిష్టములు, సంఘర్షణలు చక్కగా వర్ణించడం జరిగింది. ఈ కథలన్నీ వయోభేదం పాటించనక్కరలేకుండా అందరూ చదవతగ్గవిగా వుండడం ఒక ప్రత్యేకత. రెండుసంపుటాలలోను ముప్ఫయివరకూ కథలున్నాయి.

## జాతిరత్నాలు

**[స్త్రీల పాటల కథలు]**

[ప్రాప్తిస్థానం: యం. శేషాచలం అండ్ కో; మూల్యం: 1—50.]

కీర్తిశేషులు సురవరం ప్రతాపరెడ్డిగారు సుదీర్ఘమైన పీఠికరాసి, చివర క్లుప్తంగా ఇంత పీఠిక రాయడం ఒక ఎత్తు, ముచ్చటగా ఒక్కముక్కలో చెప్పదలచుకున్నదంతా చెప్పడం ఒక ఎత్తు అన్నారు—సరస్వతీదేవిగారు—తన పుస్తకానికి అంత చక్కటి పేరు పెట్టుకున్నారని భావన. జాతిరత్నాలు సంపుటిలో తాతమ్మలకాలంనుండీ ఈనాటివరకూ వినవస్తూనేవున్న లక్ష్మణదేవర నవ్వు, సత్యభామ సరసము, ధర్మాంగద చరిత్ర, ధర్మరాజు జూదము, ఊర్మిళాదేవి నిద్ర మొదలైన గేయ కథలున్నాయి. సుందరమైన కథాభాగాన్ని పొందుపరుస్తూ, చక్కని వచనంలో మిగిలిన కథను క్లుప్తంగా చెప్తూ రచించిన వ్యాసాలివి. ముక్కవోని నూతనత్వమే వాటి ప్రత్యేకత.

కొంచెం ఖరీదు యెక్కువే అయినా ఈ పుస్తకాలన్నీ చాలా చక్కగా ప్రచురించడం హర్షనీయం. పుస్తక ప్రచురణ పూర్తిగా వ్యాపారమే కాకుండ, సాహితీసేవ అని కూడ కొంచెం ఊహిస్తే ఇలాంటి ఉత్తమమైన రచనలు అందంగా ప్రచురించే ధైర్యం ప్రచురణకర్తలకి కల్గుతుంది.

—శ్రీమతి రామలక్ష్మి.

## ఫౌస్ట్

(మూలం: గొథే, అనువాదం: శ్రీ వి. ఎస్. శర్మ, సాహిత్య అకాడెమీ పక్షమున ప్రతిమా బుక్స్‌వారి ప్రచురణ, మద్రాసు 7. వెల: రు. 5 లు.)

జర్మన్ మహాకవి గొథే చాలా గ్రంథాలు వ్రాశారు. వానిలో అన్నీ ప్రసిద్ధిలోకి రాలేదు. నవలలో "సారోస్ ఆఫ్ వెర్థర్" కు వచ్చిన ప్రాముఖ్యం తక్కినవానికి రాలేదు. నాటకములలో ఫాస్ట్‌కు వచ్చిన ప్రాముఖ్యం తక్కినవానికి రాలేదు. మరి ఐరోపీయ సాహిత్యంలో ఫాస్ట్‌కు వున్న స్థానం అతిక్రాంతమైంది. అది ప్రపంచ వాఙ్మయ మహాగ్రంథములలో ఒకటి.

గొథే దీనిని రెండు భాగాలుగా రచించారు. మొదటి భాగం ఒక వయస్సులోను, రెండోభాగం ఇంకో వయస్సులోను, ప్రౌఢనిర్భర వయఃపరిపాకంలో మొదటి భాగాన్ని వ్రాస్తే, ప్రాయ మింతకు మిగుల కైవ్రాలకుండా రెండోభాగాన్ని వ్రాశారు. ఇందులో ప్రథమభాగాన్నే ఇప్పుడు శ్రీ శర్మగారు జర్మనీ భాషలో నుండి తెలుగులోకి సాహిత్య అకాడెమీ పక్షాన అనువదించారు.

అనువాదం అనేది తేలిక అని చాలామంది అభిప్రాయం. కాని అది మౌలికరచనకన్నా గూడా కష్టమైనపని. ఒక రచయిత ఒక భాషలో, ఒక సంప్రదాయంలో, ఒక అలంకార ప్రక్రియా

మార్గంలో రచించిన గ్రంథాన్ని ఇంకో భాషలోకి, ఇంకో పలుకుబడిలోకి అనువదించవలసి ఉన్నప్పుడు, అక్కడ ఆ మౌలిక గ్రంథం తాలూకు భాషా, ఇక్కడ ఏభాషలోకి మార్చుస్తున్నారో ఆ భాష గట్టిగా వచ్చి ఉండాలి. లేకపోతే ఆ అనువాదం అంతంత మాత్రంగానే ఉంటుంది. అసలు సొగసులు మటుమాయం అవుతాయి.

మరి అనువాదం మహా రచయితలను గురించి జరుగ తున్నప్పుడు అందులో ఉండే కష్టం అంతా ఇంతా కాదు. ముఖ్యంగా గొథే వంటి కవిని అనువదించడం మరీను. ఇంగ్లీషులోకి మొదటిసారిగా గొథే నాటకాలను అనువదించిన సర్ వాల్టర్ స్కాట్, ఆ అనువాదాలకు తాను వ్రాసిన పీఠికలో ఈ కష్టం ఎట్టిదో విశదంగా పేర్కొన్నారు. ఆ తర్వాత ప్రతి అనువాద కర్తా గూడా అదే కష్టాన్ని అనుభవించామనీ చెప్పారు.

అయితే, అక్కడ వారికో సౌలభ్యం ఉంది. గొథే తన ఫాస్ట్ నాటకం మొదటిభాగంలో అధికభాగం "బ్లాంక్ వెర్స్" న వాడారు. ఆ 'బ్లాంక్ వెర్స్' లోనే ఇంగ్లీషువారు కూడా ఆ గ్రంథాన్ని తర్జుమా చేశారు. ఛందస్సుకు సంబంధించినంత వరకు ఈ సౌలభ్యాన్ని వారు అనుభవించి, గొథేగారి పద్యంలో ఉన్న ఓజస్సును కొంతవరకు తమ అనువాదాల్లోకి పట్ట గల్గారు.

ఇప్పుడు, తెలుగులో అటువంటి వీలు లేదు. అందుచేత శ్రీ శర్మగారు వచనాన్ని ఉపయోగించారు. గ్రాంథికాన్ని, వ్యావహారికాన్ని మిళితంచేసి వాడారు. అది కూడా కొంతవరకు బాగా ఉందే అనుకుందాము. కాని మూలంలో ఉన్నట్లు, ఇంగ్లీషు అనువాదాలు చదివితే, మనకు కన్పించే శక్తి మాత్రం ఈ వచనంలో రాలేదు. ఇంకో విషయం ఏమిటంటే, ఫాస్ట్ ఈ భాగంలో గొథే చాలా పాటలు వ్రాశారు. ఆ పాటలను అన్నిటిని శ్రీ శర్మ వదిలివేశారు. అంటే ఫాస్ట్‌లో ప్రాణం తీసేశారు.

ఇక శర్మగారి తెలుగు. వారికి తెలుగు నుడికారం గట్టిగా తెలిసినట్లు లేదు. అందువల్ల భాష చాలావరకు కృత్రిమంగా ఉంది.

ఫాస్ట్ కథ యేమిటో అందులోని రచనాశిల్పము, తత్త్వము ఏమిటో మున్నుడిలో ఎరిచ్ ట్రూమన్జ్ చక్కగా వివరించారు. ఈ నాటకంలో ఉన్న బహు అభూతకల్పనలకు హేతువును నిరూపించారు. ఇందులో ఉన్న కథ అంతా కల్పన కాదు. ఫాస్ట్ కథ జానపద గాథగా జర్మనీలో అనాదిగా చలామణీలో ఉంది. ఆ కథనే ఇతివృత్తంగా గ్రహించి, దానిలో ఎన్నో మార్పులు, చేర్పులు చేసి గొథే ఈ నాటకాన్ని రచించారు. ఇందులో ఫాస్ట్ 19 వ శతాబ్దపు యూరోపీయ తత్త్వ జిజ్ఞాసువుకు చిహ్నం. ఆ జిజ్ఞాసువును దైవశక్తులు, అసుర శక్తులు ఎట్లా ఆడించాయో ఇందులో చక్కగా నిరూపింపబడింది. సకలమైన జ్ఞానంకన్నా, ప్రేమ అనే వస్తువు దొడ్డది అని ఫాస్ట్, మార్గరెట్ల ప్రేమకథలో సూచింపబడింది. గొథేగారి ఫాస్ట్ ప్రధానంగా ఈ ప్రేమ కథే. ఇందులో అసుర శక్తులమీద ఆ ప్రేమయొక్క విజయం నిరూపించబడింది.

ఇట్టి మహా గ్రంథాన్ని ఇంకో భాషలోకి అనువదించడానికి ప్రయత్నించేప్పుడు పడవలసిన జాగ్రత్తలన్నీ సాహిత్య అకాడెమీవారు పడివున్నట్లయితే, గొథేగారి ఈ దృశ్యకావ్యం తెలుగుభాషలో స్థిరంగా నిల్చిపోయే విధంగా వచ్చివుండేది. ఇప్పుడు ఈ తర్జుమాను గూర్చి ఆమాట అనలేము. కాలం అనంతమైంది గనుక, ఎప్పుడో ఒకప్పుడు ఇది రమ్యంగా తెలుగులోకి వచ్చే అవకాశం ఎట్లాగూ ఉంది. ఈ లోగా శ్రీ శర్మగారి అనువాదం అందుకు తొలిమెట్టుగా భావించుకుందాము. ఇంకో విషయం ఏమంటే ఇటువంటి గ్రంథాలకు ఒక్క తర్జుమా చాలదు. బహుమంది ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఇంగ్లీషులో అట్లాగే చేశారు. అట్లాగే ఇక్కడాను. అట్టి తర్జుమాలలో ఏదోఒకటి సర్వాంగసుందరంగా రూపొందవచ్చు. అందుకే 'యత్నే ఫలే' అన్నారు.

—హా. శి.

## మానవ-ఐక్యతాదర్శము

(కర్త: శ్రీ అరవిందఘోష్. అనువాదకులు: కీ. శే. సూరపరాజు రఘునాథం. ప్రకాశకులు: అరవింద సర్కిల్, నిడదవోలు. ప్రతులు దొరుకుచోటు:మానాప్రగడ శ్రీరాములు, అడ్వొకేటు, కొవ్వూరు. ప. గోదావరి; లేక: ది పర్సనల్ బుక్‌షాప్ మెడ్రాస్—6; 422 పుటలు; వెల రు: 6—00.)

చరిత్రకందిన కాలమునుండి నేటివరకు రాజనీతి (Politics) సంస్కృతి (Culture) ఆధ్యాత్మిక వికాసము (Spiritual Insight) అను నేత్రత్రయముతో నొప్పారు మానవుడు ఏ రీతిగా మానవ-ఐక్యతాదర్శమును "వసుధైవ కుటుంబకమ్" అను ఆర్యోక్తి ననుసరించి ఈ లోకమున నిర్మింపదలచి, విఫలమైనది ఈ గ్రంథములో సమగ్రముగ చర్చింపబడినది. "ఆధ్యాత్మిక—మానవ మతమే భావి శుభోదయమునకు మార్గము కాగలదు. ప్రపంచమున కంతటికిని ఏకైక మత విధానముండదు......వ్యక్తి తన తోటివారల పరిపూర్ణ సౌభాగ్యమున తన సౌభాగ్యమును కాంచవలయును..... మన ఆధ్యాత్మిక మతమునకుచెందిన ఇది యొక ముక్తిమార్గము" అని ఆదర్శము నిరూపింపబడినది. (402 వ పుట). ఈ ఆద

ర్శమునే వివేకానందస్వామివారు "నా గురుదేవుడు" మున్నగు ఉపన్యాసములలో అభివర్ణించియున్నారు.

శ్రీ అరవిందులవారి అమలోదాత్తమనీష, రచనా ప్రాగల్భ్యము ప్రతి వాక్యమునను స్ఫురించుచునేయున్నవి. అనువాదకులు సాధ్యమైనంతవరకు ఆ వెలుగును తెలుగులోనికి కొనివచ్చినారు. కాని, "లోపాలోపములు" (9) "స్పష్టము" (10) బాహ్యామార్పులు (337) ఆలస్యములు, భూత భవిష్యత్తులు (338) అవ్యక్తములు (342) సామాధిక? (380) రసములు (389)—ఈరీతికి చెందిన అనువాద పదములు సంస్కరింపబడవలసి యున్నవి.

చక్కటి తెల్లకాగితముమీద్ర పెద్ద పుస్తకము అందముగ ముద్రింపబడి బైండు చేయబడియున్నది. కూలంకషముగ ప్రపంచ రాజకీయ ఘట్టముల తాత్పర్యమును పొందికగ తెలిసికొనగోరువారైనను, ఈ గ్రంథమును కొని చదివి ప్రకాశకుల పరిశ్రమను సార్థక మొనర్తురుగాక!

—శ్రీ నిర్వికల్పానందస్వామి

## గ్రంథ పరిచయం

### 1. ప్రాచీన గాథాలహరి

(1, 2 భాగాలు)

శ్రీ పి. గణపతిశాస్త్రిగారు పూర్వం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రాచీన గాథాలహరి అనే శీర్షికతో వ్రాసిన కథలలో కొన్నిటిని ఎం. శేషాచలం అండ్ కో వారు రెండు భాగాలుగా ప్రకటించారు. ఇందులో మొదటి భాగంలో దేవదాసి, ఇతర కథలు కలిసి మొత్తం 7 కథలు ఉన్నాయి. ఇది కేంద్ర మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారికి అంకితం ఇయ్యబడింది. రెండోభాగంలో పుష్పాంజలి మొదలైన కథలు 11 దాకా ఉన్నాయి. దీనిని శ్రీ శాస్త్రిగారు శ్రీ ఆర్థూర్ ఐసన్‌బర్గ్‌కు అంకితం యిచ్చారు. ఒక్కొక్క భాగం వెల : సాదాప్రతి రు. 2—25, మేలు ప్రతి రు. 3—25 లు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు వారికి వ్రాసుకోవాలి.

### 2. పరిణామకథలు

శ్రీ సూర్యదేవర మల్లికార్జునరావుగారి ఈ గ్రంథాన్ని, శ్రీ విశాలాక్షి గృహ గ్రంథాలయ ప్రచురణ, వడ్లమూడివారు ప్రకటించారు. ఈ గ్రంథం పీఠికాభాగం, కథానికలు, అనుబంధం అని మూడు భాగాలుగా ఉంది. రచన సామాన్యంగా ఉంది. వెల లేదు.

### 3. మీ సేవలో పరమాణువులు

ఇంగ్లీషులో ఇది హెన్రీ డన్‌లాప్, హాస్ప్టన్‌గార్ల రచన. తెలుగులోకి శ్రీ ఘల్లాది నరసింహశాస్త్రి అనువదించారు. శేషాచలం అండ్ కో, బందరు వారు ప్రకటించారు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్‌కు వ్రాయాలి. సాదా ప్రతి వెల రు. 2—25. మేలు ప్రతి వెల రు. 3—25.

### 4. నిదుర కన్నెలు

మాత్రాఛందస్సులో శ్రీ అరిపిరాల విశ్వం వ్రాసిన కవిత్వ గ్రంథం. ఇందులో కోణార్క, పాషాణి, చెరిగిపోయిన కల, మువ్వరాగిణి, మనసు వెనుక మరుభూములు, దిగుడు రెక్కలు, పాదముద్రికలు, రెండే క్షణాలు, నిదురకన్నెలు, అవులించిన ఆకాశం, అంతిమసంధ్య, నేనులో నేను, అన్వేషణ, మ్రోగని పాట, నీవు రావు, ఏమని పాడేది మొదలైన ఖండికలు ఉన్నాయి. గ్రంథం శ్రీ దామోదరం సంజీవయ్యకు అంకితం ఈయబడింది. ధర 150 నయాపైసలు.

### 5. పువ్వుపుట్టగానే పరిమళం

(బాల సాహితి)

శ్రీ మధురాంతకం రాజారాం పిల్లలకోసం వ్రాసిన చిన్న పుస్తకం. ఇందులో గాంధీ, వీరేశలింగం, కే. ఎస్. కేసరి, రాధాకృష్ణన్, సుభాస్‌బోస్, జయప్రకాశ్, రవీంద్రుడు, రామకృష్ణ పరమహంస—జీవిత విశేషములు మధురముగా చెప్పబడినవి. గోదా గ్రంథమాలవారు దీనిని ప్రకటించిరి. వెల: 56 నయాపైసలు.

### 6. ఆంధ్ర భల్లటము

(అన్యాపదేశ్య కావ్యము)

ఇది భట్టభల్లటుని సంస్కృతకృతికి శ్రీ ధనకుధరం వేంకటాచార్య అనువాదము. స్ఫూర్తి శ్రీ 'ప్రాస్తావిక' తో బుక్ వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్‌వారు దీనిని ప్రకటించిరి. వెల: రూపాయి.

### 7. జీవన పథము

విశ్వవిఖ్యాత తత్త్వవేత్త జేమ్సు ఎలెన్ భావములు ఆధారముగా శ్రీమతి లిలీ ఎల్. ఎలెన్ సంకలితపరచిన గ్రంథమునకు శ్రీ తిపిర్నేని లక్ష్మీనారాయణ అనువాదము. రామకృష్ణ గ్రంథ మండలి, పటమట, విజయవాడ—6 వారు దీనిని ప్రకటించిరి. వెల: రు. 1—25 లు.

### 8. సరోజని

శ్రీమతి సరోజినీదేవి జీవిత చరిత్ర. గ్రంథకర్త శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ. ప్రభా అండ్ కో, గుంటూరు వారి ప్రచురణ; వెల రూపాయున్నర.

### 9. మహాత్ముడు

పిల్లలు చదువుకునేందుకు వీలుగా డా. శంకర శ్రీ రామారావు ఈ గ్రంథమును రచించినారు. దీనినిగూడా గోదా గ్రంథ మాలవారు ప్రకటించినారు. వెల: రూపాయి.

### 10. మన విషయం

చిన్నపిల్లలకు దేశాన్నిగురించి, దేశనాయకులనుగురించి, ఇట్లాగే ఇంకా ఎన్నో విషయాలనుగురించి తెలియజెప్పటం కోసం శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ ఈ గ్రంథాన్నిరచించారు. ఇది గోష్ఠీపద్ధతిలో వ్రాయబడింది. ప్రకాశకులు: మాధవ మందిరం, శ్రీకృష్ణనగర్, గుంటూరు. వెల: పంద్రెండణాలు.

# వార్తలు

జూన్ 1 : సింకియాంగ్—అజాద్ కాశ్మీర్ సరిహద్దుల నిర్ణయం విషయమై చైనా, పాకిస్తాన్‌లు చేసుకొన్న ఒప్పందంపై భారత ప్రభుత్వం అధిక్షేపణ తెలియజేసింది.

—నాజీ నాయకుడు శ్రీ ఐక్‌మన్‌ను టెల్ అవీవ్‌లో ఉరితీశారు.

—కాశ్మీర్ ఛర్చ భద్రతా మండలిలో జూన్ 15 న జరిగితే బాగుంటుందని భారతదేశం తెలియజేసింది.

—చిన్న కార్ల ఫ్యాక్టరీని రాష్ట్రంలో స్థాపించవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రాన్ని కోరింది.

జూన్ 2:—భారత బృందం ఎవరెస్టు అధిరోహణం విఫలమైంది.

—టిబెటులోని భారత వాణిజ్య సంస్థలను మూసివేశారు.

—జాతీయ ఏకీకరణ మండలి సమావేశం ఆరంభమైంది.

జూన్ 3:—విశ్వ విద్యాలయాలలో ఇంగ్లీషుస్థానే ప్రాంతీయ భాషలను బోధనా భాషలుగా ప్రవేశపెట్టాలని జాతీయ ఏకీకరణమండలి సూచించింది.

—పారిస్‌లో విమాన ప్రమాదం జరిగి 131 మంది చనిపోయారు.

—టర్కీ ప్రధానిగా ఇస్మైల్ ఇనోనూ నియమితులైనారు.

—మురికివాడల నిర్మూలనకు స్థలార్జన చట్టాన్ని ఆగస్టు నుండి 66 పురపాలక సంఘాలకు వర్తింపజేయాలని ఆంధ్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

—పంచాయతీ ఎన్నికలలో రహస్య బాలెట్ పద్ధతిని ప్రవేశపెట్టడానికి సభ్యుల పదవీకాలాన్ని 5 ఏళ్లకు పొడిగించడానికి వీలు ఒక బిల్లును అంధ్రప్రదేశ్ ప్రభుత్వం తయారు చేసింది.

జూన్ 4:—కాశ్మీర్‌పై భారత సార్వభౌమత్వాన్ని తాను గుర్తించింది లేదని చైనా ప్రకటించింది.

—తూర్పు బెంగాలులో పరిస్థితి తీవ్రంగా వున్నట్లు పాకిస్తాన్ ఒప్పుకున్నట్లు శ్రీ నెహ్రూ పార్లమెంటులో ప్రకటించారు.

—పూనా—బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌కు ప్రమాదం సంభవించి 4 గురు మరణించారు. 63 గురు గాయపడ్డారు.

—అఖిల భారత కాంగ్రెస్ సంఘం సమావేశం ఢిల్లీలో ప్రారంభమైంది.

జూన్ 5 :— పంచాయతీలకు పార్టీలులేని ఎన్నికల తీర్మానం నెగ్గింది. అయితే అన్ని ఎన్నికలకు ఆ పద్ధతి పనికిరాదని శ్రీ నెహ్రూ చెప్పారు.

—ఆంధ్రలో భారీ విద్యుత్ పరికరాల ఫ్యాక్టరీ స్థాపనకుగాను ప్రాథమిక కార్యకలాపాలు ప్రారంభమైనట్లు కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం ప్రకటించారు.

—కారు ప్రమాదానికి గురియై బెల్లంకొండ స్వాములవారు సిద్ధిపొందారు.

జూన్ 6:—అవినీతిని నిర్మూలించడానికి క్రిమినల్‌లాను, రాజ్యాంగాన్ని మార్చడం జరగవచ్చని దేశీయాంగమంత్రి పార్లమెంటులో ప్రకటించారు.

—శ్రీ టి. టి. కృష్ణమాచారి కేంద్ర మంత్రివర్గంలో చేరారు.

—కాంగ్రెస్ అధ్యక్షుడుగా శ్రీ సంజీవయ్య ఎన్నిక అయినారు.

—చైనాపట్ల భారతదేశ విధానాన్ని శ్రీ నెహ్రూ పార్లమెంటులో వివరించారు.

జూన్ 7:—లావోస్‌లో ప్రభుత్వ నిర్మాణంపై ముగ్గురు రాకుమారులకు ఒప్పందం కుదిరింది.

—వ్యవసాయ ఫలసాయాలకు కనీసపు ధరలు నిర్ణయించే విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు కేంద్ర ఆహార మంత్రి ప్రకటించారు.

జూన్ 8:—దిగుమతులు బాగా తగ్గింపబడనున్నట్లు ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ లోక్‌సభలో ప్రకటించారు.

—భారతదేశానికి 24 మిలియన్‌ల డాలర్ల సహాయం ఇవ్వడానికి బ్రిటన్ నిశ్చయించుకుంది.

— నాగపూర్ — తాతానగర్ పాసింజరుకు ప్రమాదం జరిగింది. 9 మంది చనిపోయారు. 127 మంది గాయపడ్డారు.

— సరిహద్దుల తగాదాలో ఏ క్షణంలోనైనా యుద్ధం ప్రజ్వరిల్లవచ్చని చైనా హెచ్చరించింది.

—అమెరికా సహాయంతో పాకిస్తాన్ ఒక రాకెట్ పరీక్ష జరిపింది.

# వార్తలు

—పశ్చిమదేశాలతో పోటీచేయడానికి కమ్యూనిస్టు రాజ్యాలన్నీ కలిసి, తమ వస్తూత్పాదనశక్తిని పెంచుకోవాలని ఆలోచిస్తున్నాయి.

జూన్ 11:—చైనా—భారత సరిహద్దు తగాదా పరిష్కారానికి శ్రీ నెహ్రూ "తటస్థ ప్రాంతం సూచన" చేశారు

—సౌవన్నాఫౌమా ప్రధానమంత్రిత్వానికి లావోస్ రాకుమారులు ఒప్పుకున్నారు.

—రాజస్థాన్‌లో రైలుప్రమాదంమూలంగా 26 మంది చనిపోయారు.

—తటస్థ దేశాలకు ఆర్థిక సహాయాన్ని తగ్గించాలని అమెరికా అధ్యక్షునకు ఆ దేశం సెనెట్ సిఫార్సు చేసింది.

జూన్ 12: ఆంధ్రప్రదేశ్‌లో రైళ్లలో రద్దీని తగ్గించేందుకు హైదరాబాదు నుంచి వరంగల్లుకు, విజయవాడ నుండి గుంటూరుకు, విజయవాడనుండి కాకినాడకు విద్యుత్ రైళ్లు నడపాలని రాష్ట్రప్రభుత్వం కేంద్రానికి విజ్ఞప్తి చేసింది.

—కేంద్రం విధించిన పన్నులలో ఆర్థికమంత్రి కొన్ని మినహాయింపులు ప్రకటించారు.

—పార్లమెంటు కాంగ్రెస్ పక్షానికి ఇద్దరు ఉప నాయకులు ఉండాలని నిర్ణయం జరిగింది.

జూన్ 13:—కాశ్మీర్ సమస్యనుగూర్చి భారత ప్రభుత్వ విధానాన్ని శ్రీ నెహ్రూ పత్రికా విలేఖరుల గోష్ఠిలో వివరించారు.

—పోచంపాడు ప్రాజెక్టు ప్రాథమిక కార్యకలాపాలను గూడా ఆపాలని కేంద్రానికి మహారాష్ట్రం విజ్ఞప్తి; మహారాష్ట్ర ఆక్షేపణకు సంజాయిషీ చెప్పవలసిందని కేంద్రం ఆంధ్రప్రదేశ్‌ను కోరింది.

—సీలేరు ఆనకట్టకు మంత్రి శ్రీ సుబ్బారెడ్డి 12 న శంకుస్థాపన చేశారు.

జూన్ 14:—కాశ్మీర్‌పై భద్రతా సంఘంలో చర్చలు ప్రారంభమైనాయి.

—బ్రిటిష్ కామన్‌వెల్తుశాఖమంత్రి శ్రీ డంకన్ శాండీస్ ఢిల్లీకి వచ్చారు.

—కేంద్ర బడ్జెట్ చర్చకు శ్రీ దేశాయ్ సమాధానం ఇచ్చారు.

—రాష్ట్రం అంతటా భూమిశిస్తును రెట్టింపు చేస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక బిల్లునుగెజెట్‌లో ప్రకటించింది.

జూన్ 15: కాందిశీకులపై పాకిస్తాన్ సైనికుల కాల్పుల వల్ల 15 మంది మరణించారు.

జూన్ 16:—ఢిల్లీలో అణ్వస్త్ర వ్యతిరేక మహాసభ ప్రారంభమైంది.

—ఐరోపా సమిష్టి విపణిపై శ్రీ శాండీస్, శ్రీ నెహ్రూ ప్రభృతులతో మంతనాలు సాగించారు.

—నూతన కాంగ్రెస్ కార్యవర్గాన్ని అధ్యక్షులు శ్రీ సంజీవయ్య ప్రకటించారు.

—ఫైనాన్సు బిల్లును లోక్‌సభ ఆమోదించింది.

జూన్ 17: శాస్త్రీయ పారిశ్రామిక పరిశోధనా మండలికి ప్రొ. హాల్డేన్ రాజీనామా యిచ్చారు.

—కాంగ్రెస్ పార్లమెంటరీ ఉపనాయకత్వానికి శ్రీయుతులు మెహతాబ్, హనుమంతయ్యలు నామినేషన్లు దాఖలు చేశారు.

జూన్ 18: కాంగ్రెసులో ముఠాతత్వ నిర్మూలనకు కృషిచేయగలనని కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ సంజీవయ్య హైదరాబాదులో ప్రసంగించారు.

—అల్జీరియాలో దౌర్జన్య విధానానికి ఫ్రెంచి రహస్య సైనిక సంస్థ స్వస్తిచెప్పింది.

—రాష్ట్రంలో స్కూలుఫైనలుదాకా ఉచితంగా విద్యను బోధించే ఏర్పాట్లు చేయడానికి ఆంధ్రప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు విద్యామంత్రి శ్రీ పి. వి. జి. రాజు ప్రకటించారు.

—రాష్ట్రపతి పింఛను సవరణబిల్లుకు లోక్‌సభ ఆమోదించింది.

—భారత్‌కు 10 కోట్ల మార్కులు ఋణం యివ్వడానికి పశ్చిమ జర్మనీ నిశ్చయించుకుంది.

జూన్ 19:—శ్రీ శాండీస్ మంతనాలు ముగిశాయి. ఫలితం బాగున్నదని ఆయన ప్రకటించారు.

—సరిహద్దుతగాదాపై చైనా, భారత్ ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రకటించబడినాయి.

—భద్రతామండలిలో కాశ్మీర్ చర్చలో చిన్న రాజ్యాల సూచనలు; బలవంతపు పరిష్కారం పనికిరాదని అరబ్ రిపబ్లిక్ హెచ్చరించింది.

—సరిహద్దు పరిస్థితినిగూర్చి శ్రీ నెహ్రూ లోక్‌సభలో ఒక ప్రకటన చేశారు.

—జనాభాను బట్టి తిరిగి భారతదేశాన్ని విభజించవలసి ఉంటుందని పాక్ విదేశాంగమంత్రి ప్రకటించారు.

—19 మంది మంత్రులతో లావోస్‌లో మిశ్రమ ప్రభుత్వం ఏర్పడింది.

—త్వరలోనే మద్రాసు—వాల్తేర్ ఎక్స్‌ప్రెస్‌ను వేయబోతున్నట్లు రైల్వేమంత్రి ప్రకటించారు.

జూన్ 20 :— విశ్వవిద్యాలయాలలో బోధనాభాషగా ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్టాలని, మూడవ ప్రణాళిక లోపుగా ఈ పని జరగాలని కేంద్ర విద్యామంత్రి డా. శ్రీమాలి పార్లమెంటులో ప్రకటించారు.

—అణ్వస్త్ర పరీక్షల విషయంలో ఇప్పుడప్పుడే ఒప్పందం కుదరదని అమెరికా ప్రతినిధి శ్రీ ఆర్థర్ డీన్ ప్రకటించారు.

—రాష్ట్రం ఎదుర్కొంటున్న సమస్యలను పరిశీలించి చర్చించేందుకు ఆంధ్ర పార్లమెంటు, శాసనసభల సభ్యుల సమావేశం జూలైలో జరుపుతామని ముఖ్యమంత్రి శ్రీ సంజీవ రెడ్డి ప్రకటించారు.

పురపాలక సంఘాల పదవీకాలాన్ని 3 నుండి 5 ఏళ్లకు పెంచుతూ చట్టాన్ని సవరించడానికి ఆంధ్రశాసనసభ పూను కుంది.

జూన్ 21:—మైసూరు ముఖ్యమంత్రిగా శ్రీ నిజలింగప్ప ప్రమాణ స్వీకారం చేశారు.

—రైలు, ట్రక్కు కొట్టుకొని 7 గురు మరణించారు.

జూన్ 22:—ఆంధ్రప్రదేశ్ 1962—63 బడ్జెట్టు ప్రకటించబడింది. ఇందులో రాష్ట్రం ఆదాయం 115.47 కోట్లుగా, ఖర్చు 113.72 కోట్లుగా చూపించారు. అందువల్ల మిగులు 1.75 కోట్లు తేలింది. అయితే ఇది 5 కోట్ల రూపాయల ఆదాయం తెచ్చే కొత్త పన్నులు వేయడంవల్ల వచ్చింది.

—కాశ్మీర్‌పై ఐర్లెండ్ భద్రతా మండలిలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించింది. ఆ తీర్మానాన్ని రష్యా వీటో చేసింది. కాశ్మీర్‌లోంచి పాకిస్థాన్ దురాక్రమణ వైతొలగాలని శ్రీ మీనన్ కోరారు.

జూన్ 23:—భద్రతామండలిలో కాశ్మీర్‌పై పాశ్చాత్య రాజ్యాల వైఖరిని శ్రీ నెహ్రూ పార్లమెంటులో గట్టిగా విమర్శించారు.

జూన్ 24:—క్వెమాయ్‌పై చైనా తిరిగి కాల్పుల ప్రారంభించింది.

జూన్ 25:—ఈ సంవత్సరం మొదటి 5 నెలల్లోను పాకిస్థాన్ 12 సార్లు, చైనా 5 సార్లు, భారతదేశపు వాయు సరిహద్దులను అతిక్రమించినట్లు శ్రీ రఘురామయ్య రాజ్య సభలో ప్రకటించారు.

జూన్ 26:— విశ్వవిద్యాలయాలలో బోధనాభాషగా ప్రాంతీయ భాషల ప్రవేశాన్ని గూర్చి ప్రభుత్వ విధానాన్ని కేంద్ర విద్యామంత్రి డా. శ్రీమాలి రాజ్యసభలో వివరించారు.

—షోంబే, అదోలాల రాజీ మంతనాలు భగ్నం అయినాయి.

—పంజాబు గవర్నర్ శ్రీ గాడ్గిల్ రాజీనామా యిచ్చారు.

—సెలెక్టు కమిటీకి అదనపు భూమి శిస్తు బిల్లును పంపించారు.

జూన్ 28:—జాతీయ ఆదాయం పెరుగుదల తగ్గినట్లు ప్లానింగు మంత్రి శ్రీ నందా ప్రకటించారు. మూడవ ప్రణాళిక మొదటి సంవత్సరంలో వ్యవసాయోత్పత్తి తగ్గిందని గూడా ఆయన అన్నారు.

—మూడవ ప్రణాళిక అంతానికి 7 లక్షల ఎకరాలకు నాగార్జునసాగర్ నీరు అందుతుందని మంత్రి శ్రీ సుబ్బారెడ్డి ప్రకటించారు.

జూన్ 29 : తెలుగును అధికార భాషగా చేయడానికి ప్రభుత్వం కృషిని వివరిస్తూ రాష్ట్ర శాసనసభలో ముఖ్య మంత్రి ఒక ప్రకటన చేశారు.

జూన్ 30 : మద్రాసు బడ్జెట్టులో 7 కోట్లు పైగా కొత్త పన్నులు విధింపబడినాయి.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**